


# ఆంధ్ర రచయిత్రులు

## లఘుపరిచయాల కరదీపిక












కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ

With best Compliments from



**BOMMIDALA SRIKRISHNAMURTHY FOUNDATION**

#4-4-120, BTC House, 5th Lane, Chandramouli Nagar,
GUNTUR, Andhra Pradesh- 522 007.
Ph: 0863 - 2357615, 2357616.
www.spoorthiawards.org

# ఆంధ్రరచయిత్రులు

ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల మహాసభల సందర్భంగా వెలువరిస్తున్న

లఘుపరిచయాల కరదీపిక

సంపాదక మండలి

డా. మండలి బుద్ధప్రసాద్

ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్

గుత్తికొండ సుబ్బారావు

ప్రధాన సంపాదకుడు

డా. జి వి పూర్ణచందు

సంపాదకులు

శ్రీ నవులూరి రమేష్ బాబు

శ్రీమతి గుడిపూడి రాధికారాణి

శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపురసుందరి

కృష్ణాజిల్లా రచయితల సంఘం

సత్నాం టవర్స్ 1వ అంతస్తు, బకింగ్‌హాం పేట పోష్టాఫీసు ఎదురు,

గవర్నర్ పేట, విజయవాడ-520002

**ఆంధ్ర రచయిత్రులు**

**(ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల మహాసభల సందర్భంగా వెలువరిస్తున్న లఘుపరిచయాల కరదీపిక)**


ప్రచురణ: కృష్ణాజిల్లా రచయితల సంఘం

సంపాదక మండలి
డా. మండలి బుద్ధప్రసాద్
ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్
గుత్తికొండ సుబ్బారావు

ప్రధాన సంపాదకుడు
డా. జి వి పూర్ణచందు

సంపాదకులు
శ్రీ నవులూరి రమేష్ బాబు
శ్రీమతి గుడిపూడి రాధికారాణి
శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపురసుందరి

**మొదటి ముద్రణ : జనవరి, 2019**
**వెల: రు. 100/-**





డిజైన్: శ్రీ మధులత గ్రాఫిక్స్, విజయవాడ

ప్రతులకు:
శ్రీ మధులత పబ్లికేషన్స్, సంజీవయ్య కాలనీ, అరండల్ పేట,
విజయవాడ 520 002. ఫోన్: 9440172936

## రచయిత్రులను సన్నిహితం చేసే ఒక కరదీపిక

కృష్ణాజిల్లా రచయితల సంఘం గతంలో మూడు పర్యాయాలు ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు, వివిధ భాషాచారిత్రక అంశాలపై 25కు పైగా జాతీయ సదస్సులు నిర్వహించి తెలుగు భాషోద్యమ దీప్తిని కలిగించింది. తెలుగు భాషకు ప్రాచీనతా సంపన్న ప్రతిపత్తిని సాధించటంలో ముఖ్య భూమిక వహించింది. తెలుగు భాషోద్యమ పరంగా ప్రజల గుండె తలుపులు తట్టే అనేక కార్యక్రమాలు చేపట్టి, పెద్ద సంఖ్యలో సాహితీవేత్తలను భాగస్వాములు చేయగలిగింది. దాదాపు నలభై ఏళ్ల విరామం తరువాత, నవ్యాంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక తొలిసారిగా ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల మహాసభలు నిర్వహిస్తూ, మహిళా చైతన్యానికి తనవంతు తోడ్పాటు నందిస్తోంది.

2019 జనవరి 6, 7 తేదీలలో విజయవాడ పి. బి. సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్స్ కళాశాలలో నిర్వహిస్తున్న ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల మహాసభల సందర్భంగా "ఆంధ్రరచయిత్రులు" గ్రంథాన్ని కూర్చటానికి కృష్ణాజిల్లా రచయితల సంఘం చిరుప్రయత్నం చేసింది. సాహితీ మిత్రులు శ్రీ నవులూరు రమేష్ బాబు, శ్రీమతి గుడిపూడి రాధికారాణి, శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపురసుందరి శ్రమించి ఈ పుస్తకానికి రూపకల్పన చేశారు. కొత్తగా రచనావ్యాసంగం ప్రారంభించిన చాలా మంది రచయిత్రుల పరిచయాలు ఈ పుస్తకంలో చోటు చేసుకోవటం విశేషం.

ఈ "ఆంధ్రరచయిత్రులు" లఘుపరిచయాల కరదీపికలో ఎక్కువమంది నూతన రచయిత్రులకు అవకాశం కల్పించటానికి ప్రయత్నించాం. మలిముద్రణలో దీన్ని మరింత పెంపుచేయగలమని భావిస్తున్నాం. వాట్సాప్, ఇ-మెయిల్ లాంటి వాటిలో చాలామంది పంపినవి సరిగా తెరుచుకోకపోవటం లాంటి ఇబ్బందుల వలన కొందరు రచయిత్రుల పరిచయాలు ఈ పుస్తకంలో చోటు చేసుకోలేకపోయి ఉండవచ్చు. మలిముద్రణలో వీటిని సరిచేయ గలమని మనవి.

మహిళలలో సాహిత్యాభిలాష జాతి అభ్యున్నతికి దోహదపదేడిగా భావిస్తున్నాం. సామాజికాంశాలపైన మహిళల ప్రతిస్పందన ఎక్కువ ఆచరణీయంగా ఉంటుందని కూడా భావిస్తున్నాం. 1980-81లలో మచిలీపట్టణంలో స్పందన సాహితీ సమాఖ్య ఆధ్వర్యంలో, ఆనాటి సాహిత్య అకాడెమీ సౌజన్యంతో ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల మహాసభలు జరిగాయి. 4 దశాబ్దాల తరువాత ఇంత భారీస్థాయిలో జరుగుతున్న ఈ సభలకూ ఆనాటి సభల ముఖ్యకార్యకర్తలే సారథ్యం వహిస్తుండగా, ఆనాడు ప్రముఖంగా పాల్గొన్న ఎందరో రచయిత్రులు ఈ సభలలో ఉత్సాహంగా పాల్గొనటం విశేషం.

రచయిత్రులు ఒక కూటమిగా ఏర్పడి సంఘటిత మయ్యేందుకు, మహిళాభ్యున్నతి కోసం రచయిత్రులు ముక్తకంఠంతో నినదించేందుకు ఈ మహాసభలు వేదికగా నిలుస్తాయని, ఈ పుస్తకం ఆ దిశగా రచయిత్రులను సన్నిహితం చేస్తుందని నమ్ముతున్నాము. సహకరిస్తున్న ప్రతీ ఒక్కరికీ ధన్యవాదాలు.

**గుత్తికొండ సుబ్బారావు**
అధ్యక్షులు

**డా॥ జి.వి. పూర్ణచందు,**
ప్రధానకార్యదర్శి

**కృష్ణాజిల్లా రచయితలసంఘం**

# ఆంధ్రరచయిత్రులు

**లఘుపరిచయాల కరదీపిక**

**అచ్చమాంబ కొమర్రాజు :** జన్మస్థలం గుంటూరు. 1906, సెప్టెంబరులో జన్మించారు. ప్రముఖ వైద్యురాలు, న్యాయవాది, రాజకీయ నాయకురాలు, మాజీ పార్లమెంటు సభ్యురాలు. "ప్రసూతి - శిశుపోషణ" అనే పుస్తకాన్ని వ్రాశారు. 1946 లో ఆంధ్ర మహిళాసంఘం ఆధ్వర్యంలో ప్రారంభమైన 'మహిళ' అనే స్త్రీల కొరకు ఉద్దేశించబడిన మాసపత్రికకు సంపాదకత్వం వహించారు. 1964లో మరణించారు.

**అచ్చమాంబ బండారు :** జన్మస్థలం కృష్ణాజిల్లా పెనుగంచిప్రోలు. 1874లో జన్మించారు. మహిళాభ్యుదయానికి ఎనలేని కృషి చేసిన తొట్ట తొలి విదుషీమణి, కథా రచయిత్రి. తెలుగు, హిందీ, ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, సంస్కృత భాషల్ని నేర్చుకున్నారు. స్త్రీసమస్యలమీద రచించిన, అనేక కథలు, వ్యాసాలు 'హిందూసుందరి' అనే పత్రికలో ప్రచురితమయ్యాయి. పేరు తెచ్చిన గ్రంథం "అబలాసచ్చరిత్ర రత్నమాల". ప్రముఖ ఖగోళశాస్త్రవేత్త అయిన వరాహమిహిరుని భార్య 'ఖన' జీవితాన్ని కథగా రచించారు. 1905 జనవరి 18 న మరణించారు.

**అచ్యుతవల్లి ఐ.వి.ఎస్. :** జన్మస్థలం పశ్చిమ గోదావరి జిల్లా దొంతవరం. 1943 మే1 తేదీన జన్మించారు. ఆకాశవాణిలో 1960-62 ప్రాంతాలలో బి. గ్రేడు కళాకారిణిగా లలితగీతాలు పాడారు. 'బాత్ ఏక్ రాత్ కీ (10 కథలు); మూగబోయిన ప్రకృతి (10 కథలు) ; నాగావళి నవ్వింది(10 కథలు); అచ్యుతవల్లి కథలు (3 కథలు) ; ఇంకా వివిధ పత్రికలకు రాసినవి 8 కథలు దాకా ప్రచురితమయ్యాయి. పురస్కారాలు గృహలక్ష్మి స్వర్ణకంకణం, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం అవార్డు (ఉత్తమ కథారచయిత్రి), సుశీలా నారాయణరెడ్డి అవార్డు, తెలుగువిశ్వవిద్యాలయం విశిష్ట పురస్కారం(2 సార్లు), వాసిరెడ్డి రంగనాయకమ్మ అవార్డులు అందుకున్నారు. 2010లో మరణించారు.

**అద్దేపల్లి జ్యోతి :** సిటీ ఎంపోరియం, మెయిన్ రోడ్,కాకినాడ, తూ.గో.జిల్లా. ఆం.ప్ర.

**అనంతలక్ష్మి ఏ :** తెలుగు సాహిత్యంలో రాధాతత్త్వము వ్రాశారు.

**అనంతలక్ష్మి నందివాడ డా. :** జన్మస్థలం కృష్ణాజిల్లా తాడంకి గ్రామం. 23.7.1950న జన్మించారు. అనంత, అనంతం అనే పేర్లతో రచనలు చేశారు. తెలుగు సాహిత్యంలో రాధాతత్త్వం' అనే అంశంపై పి.హెచ్.డి.చేశారు. డిగ్రీ కళాశాల అధ్యాపకురాలుగా పనిచేశారు. కొన్ని విమర్శలు కూడా వ్రాశారు. 'న్యాయం నిద్రపోయింది, తాళం' మొదలైన 10 కథలు రచించారు. ప్రస్తుతం హైదరాబాదులో ఉంటున్నారు.

**అనసూయ ఉయ్యూరు :** తిరువూరు రచయితల సంఘ సభ్యురాలు. కథలు, కవితలు రాస్తారు.రాజుపేట, తిరువూరు, కృష్ణా జిల్లా.

**అనసూయ కన్నెగంటి :** జన్మస్థలం ప.గో.జిల్లా కొవ్వూరు మం. పసివేదల గ్రామం. హైదరాబాద్‌లో నివాసం కథ, నవల, బాలసాహిత్య రచయిత్రి. 350 కథలు, 300బాల కథలు, 2నవలలు, 150కవితలు, అనేక వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురింపబడ్డాయి. వాటిలో 23 కథలు బహుమతులు పొందాయి. వెలుగురేఖలు, కాలాన్ని చిలికితే నవలలు; జీవన శిల్పం, పొడిచే పొద్దు, దీపతోరణం, ఆవిడెవరు?, కరదీపికలు కథాసంపుటాలు; అడవిరాజు ఆదర్శం, స్నేహితులు బాల కథాసంపుటాలు వెలువరించారు. ఆం. ప్ర. ప్రభుత్వ ఉగాది పురస్కారం, వాసిరెడ్డిసీతాదేవి, పోలవరపు కోటేశ్వరరావు, గురజాడ, ఈనాడు పురస్కారాలు, 25పైగా సత్కారాలు అందుకున్నారు. మానస స్వచ్ఛందసేవా సంస్థ వ్యవస్థాపక అధ్యక్షులుగా ఉన్నారు. చిరునామా: విల్లా నం.17 ఎ, వర్టెక్స్ లేక్ వ్యూ, నిజాంపేట, హైదరాబాద్-500090. ఫోను నం. 9246541249, 7337201249.

**అనసూయమ్మ ద్రోణవల్లి :** విజయవాడలో జన్మించారు. రచయిత్రి.

**అనసూయాదేవి దొప్పలపూడి :** 1919లో జన్మించారు. 'మాతృహృదయం, అశ్రుతర్పణం, అనంగ విలాపము, విరాగిని' మొదలైన పెద్ద కావ్యాలు వ్రాశారు. తుమ్మల సీతారామమూర్తిగారి శిష్యురాలు.

**అనూరాధ ('పుల్లాభట్ల సుబ్బలక్ష్మి') :** జన్మస్థలం పశ్చిమగోదావరి జిల్లా. 30.8.1949నలో జన్మించారు. తెలుగు సాహిత్యంలో ఎం.ఏ. చేశారు. అనూరాధ, సరస్వతి పేర్లతో కథలు రచించారు. అత్తారింటికి దారేది?, సెవెన్ డేస్ హెవెన్, కోవెలకోరని దేవతలు మొదలైన అనేక కథలు వివిధ పత్రికలలో వ్రాశారు.

**అనూరాధ ఉపద్రష్ట :** జన్మస్థలం పశ్చిమగోదావరి జిల్లా భీమవరం. 31.10.1943న జన్మించారు. ఎం.ఏ., బి.ఇడి. చేసి, ఇంగ్లీష్ రీడర్, శాఖాధ్యక్షురాలుగా

బరంపురంలోని ప్రభుత్వమహిళా కళాశాలలో పనిచేశారు. తెలుగునుంచి ఒరియా భాషలోకి కథలు, వ్యాసాలు అనువదించారు. వ్యాసకర్త, వ్యాఖ్యాత. కవితారచనలు కూడా చేశారు.

**అనూరాధ కొంకేపూడి :** పాటలు, కథలు, కవితలు, వ్యాసాలు, నాటికలు రాస్తారు. నేలతల్లి పొత్తిళ్ళలో కవితా సంకలనం వెలువరించారు. శాకంబరీ ప్రసాదం వంటలపుస్తకం వ్రాశారు. పెళ్ళి పాటలు పాడతారు. విజయనగరంలో నివాసం.

**అనూరాధ కొడాలి :** మండల పరిషత్ అభివృద్ధి అధికారిణి, విజయవాడ రూరల్, కవయిత్రి. కృష్ణా జిల్లా పెదపారుపూడి మండలం, వెంట్రప్రగడలో జన్మించారు. చిరునామా: ఫ్లాట్ నెం: 301, సాయిగుర్గా ఎంక్లేవ్, సాయిపురంకాలనీ, గొల్లపూడి గ్రామ పంచాయితీ, విజయవాడ రూరల్.

**అనూరాధ గంధం :** జన్మస్థలం విజయనగరం. 4.6.1955 న జన్మించారు. విశాఖపట్నం నివాసం. విశాఖ పోర్టుస్టో ఉద్యోగం చేశారు. అనేక వ్యాసాలను, 'ప్రేమవాహిని' అనే పేరుతో 20 కథల సంపుటిని వెలువరించారు.

**అనూరాధ యలమర్తి :** జన్మస్థలం కృష్ణాజిల్లా ముదునూరు. నాలుగు దశాబ్దాలుగా సాహితీ సేద్యం. ప్రేమవసంతం నవల ప్రచురింపబడింది. పచ్చబొట్టు నవల సీరియల్‌గా వచ్చింది. వివిధ పత్రికలు, ఆకాశవాణి, దూరదర్శన్‌లలో కథలు, కవితలు ప్రసారమయ్యాయి. సంసారలో సరిగమలు, కొత్తబంగారులోకం వండర్ వరల్డ్ లో శీర్షికలు. తానా ప్రపంచ సభలు–తిరుపతి కి ఆహ్వానం అందుకున్నారు. పలు కవిసమ్మేళనాలతో పాటు లక్నోలో జాతీయ కవిసమ్మేళనంలోను పాల్గొన్నారు. ప.గో.జి. తణుకు అధ్యక్షురాలిగా సాహితీ కార్యక్రమాలు నిర్వహించారు. నవ్య కథలపోటీలో ఉత్తమ కథాపురస్కారం, ఆంధ్ర, భారత్, తెలుగు బుక్ ఆఫ్ రికార్డ్స్, బుక్ ఆఫ్ స్టేట్ రికార్డ్స్ లో స్థానంపొందారు. సాహితీరత్న బిరుగును, గుర్రం జాషువా, రావూరి భరద్వాజ అవార్డులు, అనేక పురస్కారాలు పొందారు.

**అనూరాధ శ్రీభాష్యం.డా. :** ఉపన్యాసకులు–తెలుగు. తొలినాటి సాంఘిక నవలల్లో స్త్రీ, అశోక్ అనుబంధం, జ్ఞాపిక, బతుకమ్మ పాటలు రచించారు. శతపాధ్యాకంఠీరవ బిరుదు పొందారు. 25 కవితలు ప్రచురితం. జతీయ స్థాయిలో పత్ర సమర్పణలు చేశారు. ఫోను నం.8790325502.

**అనూరాధ సుజలగంటి :** జన్మస్థలం రాజమండ్రి. హైదరాబాద్ లో నివాసం. 7నవలలు, 40కథలు పత్రికలలో ప్రచురింపబడ్డాయి. వాటిలో 3నవలలు, కొన్ని కథలు బహుమతులు పొందాయి. హిందూస్థానీ సంగీతంలో పట్టభద్రులు. కర్ణాటక సంగీతం ఇంటి వారసత్వం.

**అన్నపూర్ణ ఎ :** జన్మస్థలం కాకినాడ. 3.7.1946న జన్మించారు. నవలలు, వ్యాసాలు రచించారు. జనబలం పత్రిక సహాయకురాలుగా పనిచేశారు. వివిధ మాసపత్రికలలో 15 పెద్దకథలు, అనేక లఘుకథలు వ్రాశారు.

**అన్నపూర్ణ కూచిభొట్ల :** జన్మస్థలం జంగారెడ్డిగూడెం, తాళ్ళపూడిగ్రామం. 25.8.1959న జన్మించారు. రాజమండ్రి నివాసం. మార్నింగ్ రోమియో, వలపు తలపులతో అనే రచనలు చేశారు.

**అన్నపూర్ణ చామర్తి డా. :** తెలుగు శాఖాధ్యక్షులు, సెయింట్ జోసెఫ్ మహిళా కళాశాల, విశాఖపట్నం. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి రూపకాలు-రూపికలు పరిశోధనాంశంగా పి.హెచ్.డి పట్టా పొందారు. 48 జాతీయ అంతర్జాతీయ సదస్సుల్లో పత్ర సమర్పణలు చేశారు. వాటిలో 20 గ్రంథాల్లో ప్రచురింపబడ్డాయి. కవితలు, వ్యాసాలు పత్రికల్లో ప్రచురితం కాగా టి.వి., రేడియోల్లో కార్యక్రమాల్లో పాల్గొన్నారు. చిరునామా: ఇం.నం. 7-12-9/ఎ, 2వ లైను, ఎ.యు.ఔట్ గేట్ డౌన్, విశాఖపట్నం-17. ఫోను నం: 9948599041.

**అన్నపూర్ణ చింతలపాటి :** బాల సాహిత్యం.

**అన్నపూర్ణ పాతూరి :** నెల్లూరులోని ఆదర్శ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయినిగా పనిచేస్తున్నారు. మూడు దశాబ్దాలుగా 300 పైగా కవితలు, 25 పైగా కథలు, కొన్ని వ్యాసాలు, గల్పికలు, బాలల కథలు వ్రాశారు. నెల్లూరు జిల్లా రచయితల సంఘం కార్యదర్శిగా పనిచేశారు. నెల్లూరుజిల్లా తెలుగు భాషోద్యమ సమితికి అధ్యక్షురాలిగా కొనసాగుతున్నారు. ప్రచురణలు అడవి ఉరేసుకుంది, నిశ్శబ్దాన్ని వెతక్కు(2 కవితా సంకలనాలు); పెన్నా తీరాన, హృదయాక్షరాలు (2 నానీల సంపుటులు). పురస్కారాలు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయిని అవార్డు, జయంతి విశిష్ట పురస్కారం, సాహితీ సరస్వతి, సాహితీ విశారద బిరుదులు; రాష్ట్రస్థాయి అత్యున్నత పురస్కారం, సోమేపల్లి సాహితీ పురస్కారం వంటి అనేక పురస్కారాలు అందుకున్నారు.

**అన్నపూర్ణమ్మ ఆత్మూరి :** జన్మస్థలం మద్రాసు. 1875లో జన్మించారు. తండ్రి కొల్లిపర శ్రీరాములు, భర్త ఆత్మూరి రామమోహనరావు. జాతీయభావాలు కలిగిన రచయిత్రి. కుమార సుగుణబోధిని వంటి రచనలు చేశారు.

**అన్నపూర్ణమ్మ దరిశి :** జననం1907, మరణం1931. మహిళా చైతన్యానికి సంబంధించిన అనేక రచనలు; దార్ల సుందరీమణి. 1833, తండ్రి గంజి శ్రీరాములు. చేనేత కుటుంబానికి చెందిన కవయిత్రి. చర్లగుడిపాడు నివాసం

**అన్నపూర్ణమ్మ భూషి :** జన్మస్థలం కృష్ణాజిల్లా కందలంపాడుగ్రామం. 1925లో జన్మించారు. కథారచయిత్రి.

**అన్నపూర్ణాదేవి పరుచూరి :** తనసోదరి పరుచూరి భువనేశ్వరీదేవితో కలిసి జంటగా రచనలు చేశారు. 20వ శతాబ్దపు పూర్వార్థంలో పేరెన్నికగన్న జంటకవయిత్రులు, వీరాభిమన్యు, తెలుగుబిడ్డ, దైవమహిమ ఖండకావ్యాలు, 'కర్షకా!' గేయకావ్యం, "కృషీవలా!" పద్యకావ్యం వ్రాశారు. హరిజనోద్యమంలో పాల్గొన్నారు. ఖడ్గపాయసము, వీరబలివేదిక లాంటి ప్రయోగాలు వీరివి పేరెన్నికగన్నవి ఉన్నాయి.

**అన్నపూర్ణాదేవి మాగంటి :** ఏలూరులో జన్మించారు. జాతీయభావాలుగల రచయిత్రి. మాగంటిబాపినీడుగారి సతీమణి, 1921లో స్వరాజ్యనిధికి ఒంటిమీద నగలన్నీ తీసి గాంధీజీకి అందించిన దాత. గాంధీజీ ఈమెను తన పుత్రికగా కొనియాడారు. భర్తతో అమెరికా ప్రయాణం మానుకుని, దేశసేవకు అంకితమయ్యారు. కలగర అన్నపూర్ణాదేవి పేరుతోనే రచనలు అచ్చయ్యాయి. సీతారాము, నవవర్ష స్వప్నము, విహంగ మంగళము మొదలైన రచనలు చేశారు. 1933లో మరణించారు.

**అన్నపూర్ణ పాతూరి :** బిరుదులు సాహిత్య సరస్వతి,సాహితీ విశారద. చిరునామా. ఇం.నం.1156/28-1, ప్రశాంతినగర్, నవలాకుల గార్డెన్స్, నెల్లూరు-524002.

**అన్నపూర్ణ సిరిపురపు :** ఎం.ఎ. చదివారు. కవయిత్రి, రచయిత్రి. జ్యోతిష్య, వాస్తుశాస్త్ర నిపుణురాలు. ఆత్మజ్ఞాన ప్రకాశం గ్రంథం రాశారు. సరస్వతీ పీఠం సంస్థను నడుపుతున్నారు. ఆంధ్రప్రతికలో కొంతకాలం ఉపసంపాదకులుగా పనిచేశారు.

**అన్నమ్మ మాథ్యూ :** జన్మస్థలం గోదావరి జిల్లా. 22 మార్చి 1922 న జన్మించారు. భారతదేశంలో మహిళల పత్రిక 'వనిత' స్థాపకురాలు, ప్రధాన సంపాదకురాలు. 20 ఏళ్ల వయస్సులో మలయాళ మనోరమ ప్రధాన సంపాదకుడైన కె.ఎమ్. మాథ్యూను వివాహం చేసుకుని, కేరళ వెళ్ళారు. 17 వంటల పుస్తకాలను మలయాళంలోను, 4 ఆంగ్లంలోను రచించారు. జర్నలిజం, సంగీతం, కుకరీ మరియు సామాజిక సంక్షేమ సంబంధ రచనలు కూడా చేశారు. రాచెల్ థామస్ అవార్డు (1992), విజ్ఞానదీపమ్ పురస్కారం (1994), 'నిర్మితీ కేంద్ర' అవార్డు (1996) వంటి పలు అవార్డులను పొందారు. 10 జూలై 2003 న 81 సంవత్సరాల వయస్సులో మరణించారు.

**అబ్బరాజు మైథిలి :** 27.7.1966న జన్మించారు.అంతర్జాలంలో ప్రసిద్ధి చెందిన రచయిత్రి. వైద్యురాలు.కవయిత్రి,విమర్శకురాలు. ఆమె ప్రస్తుతం బెంగళూరులో వైద్యవృత్తిలో ఉన్నారు.

**అబ్బూరి ఛాయాదేవి :** జన్మస్థలం రాజమండ్రి. 1933 అక్టోబరు 13న జన్మించారు.స్త్రీవాద రచయిత్రి. అబ్బూరి వరదరాజేశ్వర రావుగారి సతీమణి. మధ్య తరగతి కుటుంబాలలోని స్త్రీలు ఎదుర్కొనే సమస్యల గురించి, పురుషాధిక్యతకు లోబడిన స్త్రీల గురించి చాలా కథలు రాసారు. బోన్సాయ్ బ్రతుకు, ప్రయాణం సుఖాంతం, ఆఖరికి ఐదు నక్షత్రాలు, ఉడ్రోజ్ కథలు చాలా ప్రసిద్ధిపొందాయి. న్యూఢిల్లీలోని జవహర్ లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో డిప్యూటీ లైబ్రేరియన్ గా పనిచేసి 1982లో స్వచ్ఛందంగా పదవీ విరమణ చేశారు. కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు పొందారు.

**అభిలాష :** జన్మస్థలం గుంటూరుజిల్లా వేమూరు. వర్ధమాన, అభ్యుదయ కవయిత్రి, నాస్తికురాలు. అక్షర అక్షయపాత్ర, మహోజ్వలనం, అనుపల్లవి, అగ్నినక్షత్రం, గుండెచప్పుడు అనే పుస్తకాలు వెలువరించారు.

**అమరజ్యోతి :** జన్మస్థలం అనకాపల్లి. 15.8.1964లో జన్మించారు. మొలుస్తున్న రెక్కలను ప్రేమిస్తా, నీకు తెలియని నువ్వు సంపుటులు ఆవిష్కరించారు. కొన్ని కథలు, కవితలు బహుమతులు పొందాయి. అనేక కవిసమ్మేళనాలలో పాల్గొన్నారు. చాలా పురస్కారాలు పొందారు. చిరునామా: 6-65, సాయిబాబా గుడి ఎదురుగా, బి.ఆర్.టి.కాలనీ, ఎ.ఎం.ఎ.ఎల్. కాలేజి రోడ్, అనకాపల్లి-531001. విశాఖ జిల్లా. ఫోను నం. 9182873598.

**అమృతవల్లి అవధానం.** ప్రొద్దుటూరు. ఉపాధ్యాయిని, కవయిత్రి. రేడియోలో కథానికలు, కవితలు ప్రసారం. పుస్తక సమీక్షా కార్యక్రమాలలో, కవిసమ్మేళనాలలో పాల్గొంటారు. చిరునామా. 1/269, బొల్లవరం, ప్రొద్దుటూరు-516360, కడప జిల్లా. ఫోన్. 9052912120.

**అమృతా చౌదరి గారపాటి :** ఆకాశవాణి నాటికలలో పాల్గొన్నారు. జానపద నృత్య పోటీలలో బహుమతులు పొందారు. చిరునామా: 48-8-6బి, గరుడ క్రెస్ట్ అపార్ట్ మెంట్, బైబిల్ స్కూల్ రోడ్, ఫ్లాట్ నం.110, గుణదల, విజయవాడ-4.

**అమ్మాజి గుడ్ల :** జన్మస్థలం విజయనగరం జిల్లా పార్వతీపురం. నారంశెట్టి బాలసాహిత్య పీఠం కార్యదర్శి. బాలసాహిత్య రచయిత్రి, ఉపాధ్యాయిని. అనేక దిన, వార, మాసపత్రికలలో వీరి రచనలు ప్రచురింపబడ్డాయి. "పిల్లల్లారా! రేపటి భారత పౌరుల్లారా!" గేయం పేరు పొందింది. కథలు, పాటలు, గేయాలు రాయడం, పాడడం; చిట్టి రూపకాలు, హాస్య, వ్యంగ్య నాటికలు పిల్లలతో వేయించి ప్రశంసలు పొందారు. 1994లో అక్షరవిజయం లో భాగంగా వయోజనులను అక్షరాస్యులను చేయడం కోసం నాటికలు, కథలు, గేయాలు అల్లి ప్రచారం చేశారు. విద్యాశాఖ

వారి ప్రశంసాపత్రాలు, ఉత్తమ ఉపాధ్యాయినిగా, తెలుగుభాషా సేవకురాలిగా అనేక పురస్కారాలు పొందారు. చిరునామా: గుడ్ల అమ్మాజీ, టీచర్, 14-1-83, సబ్ జైలు ఎదురుగా, బెలగాం , పార్వతీపురం, విజయనగరం జిల్లా ఆంధ్ర ప్రదేశ్, ఫోన్: 7386408306

**అరవింద :** జన్మస్థలం గుంటూరుజిల్లా మానేపల్లి. 14.4.1934న జన్మించారు. అసలుపేరు అన్నంరాజు సుగుణమణి. నవలా రచయిత్రి. అరవింద కథలు కూడా సంపుటిగా ప్రచురించారు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుంచి ఈ కథల పుస్తకానికి ఉత్తమగ్రంథం పురస్కారాన్ని, అనేక పురస్కారాల్ని అందుకున్నారు.

**అరుణ గల్లా :** అరకొండ నుంచీ అమెరికా వరకు  అనే 13 కథల పుస్తకాన్ని రచించారు. అరకొండ చిత్తూరుజిల్లాలోని ఒక పుణ్యక్షేత్రం. దీనికే అర్థగిరి అనికూడా పేరుంది.

**అరుణ చామర్తి (ముటుకూరి) :** కవయిత్రి. అనేక జాతీయస్థాయి కవితల పోటీలలో బహుమతులు గెల్చుకున్నారు. పత్రికలలో ప్రచురింపబడిన కవితలు సంకలనాలుగా వెలువడ్డాయి. 90 వ్యాసాలు వ్రాశారు. లహరి అనే వ్యాససంపుటి వెలువరించారు.

**అరుణ తేళ్ళ :** జన్మస్థలం ప్రకాశం జిల్లా తిమ్మసముద్రం. ఒంగోలులో నివాసం. నవ్యాంధ్ర రాష్ట్ర రచయిత్రుల సంఘ గౌరవాధ్యక్షులు, ఆం.ప్ర.మహిళాభ్యుదయ సమితి అధ్యక్షులు, కళామిత్రమండలి అవార్డ్స్ కమిటీ చైర్ పర్సన్ గా ఉన్నారు. టీవి ఫిలిం నంది అవార్డ్స్ కమిటీ పూర్వసభ్యులు. లాటిన్ అమెరికాల అరుణతార క్యూబా చరిత్రను కొప్పర్తితో కలిసి అనువాదం చేశారు. 100వరకు కథలు, వ్యాసాలు, సమీక్షలు వ్రాశారు. 120పైగా కవితలు రచించారు. నాటికలు, ప్రసంగాలు, కవితలు ఆకాశవాణిలో ప్రసారం చెయ్యబడ్డాయి. మూడు దశాబ్దాలుగా  సాహిత్య, సామాజిక, రాజకీయ రంగాల్లో కృషిచేస్తున్నారు.

**అరుణకుమారి బడబాగ్ని :** జన్మస్థలం చిత్తూరుజిల్లా పీలేరు., 7.6.1968న జన్మించారు. బి.ఏ.(లిట్), ఎం.ఏ. చేశారు. ప్రస్తుతం పార్వతీపురంలో ఉంటున్నారు. 'దిద్దుబాటు, మొక్కుబడి' మొదలైన కథలు వ్రాశారు.

**అరుణకుమారి యం.ఆర్. :** జన్మస్థలం చిత్తూరిజిల్లా. అశోకపురంలో 28.5.1960న జన్మించారు. ఉపాధ్యాయురాలు. పల్లెసీమ పత్రికా సంపాదకులు. వేగుచుక్క (14కథలు); సాగర కోయిల (20కథలు)  సంపుటులను వెలువరించారు.

**అరుణజ్యోతి ఎన్ :** అరుణజ్యోతి నాగిరెడ్డి. తహశిల్దారు. స్వస్థలం సూర్యాపేట. 150 కవితలు రచించారు. వాటిలో 20 పత్రికలలో ప్రచురితం. చిరునామా: అరుణజ్యోతి, తహశిల్దార్, సూర్యాపేట, ఇంటినెం.: 2-6-/1, చంద్రన్నకుంట, పోస్ట్-508213, ఫోనునం: 9966181561.

**అలక రాజేశ్వరీదేవి :** 19వశతాబ్దపు ఉత్తరార్థంలో సాహిత్య పోషకురాలుగా ఉన్నారు. 18.2.1679లో జీవించిన విజయనగర సంస్థానాధీశుడు విజయరామగజపతిగారి రాణి. భేకూ సింహరాజుల కుమార్తె. మంద కామేశ్వర కవి చేత మార్కండేయపురాణాన్ని తెలుగులో వ్రాయించి, అంకితం పొందారు.

**అలమేలుమంగ తాయారమ్మ ముదుంబై :** 19వ శతాబ్దపు ఉత్తరార్థంలో రచనలు చేసిన కవయిత్రి. పిఠాపురం వాస్తవ్యురాలు. స్త్రీజనకల్పవల్లి, గోదాకళ్యాణము, మొదలైన రచనలు చేశారు. బీబీనాంచారి కథని సుల్తానీ కళ్యాణం పేరుతో యక్షగానంగా రచించారు.

**అలివేలు దూసి :** జన్మస్థలం శ్రీకాకుళం జిల్లా. 12.4.1946 న జన్మించారు. వైద్య, ఆరోగ్య శాఖలో ఉద్యోగిని. కవితలు, నాటకాలు, వ్యాసాలు అనేకం వ్రాశారు. 2000 లో రంగులకల కథల సంపుటి వెలువరించారు.

**అశ్విని :** అసలు పేరు కల్లూరి కామేశ్వరీదేవి. జన్మస్థలం కోనసీమలోని కొత్తలంక గ్రామం. 7.5.1947న జన్మించారు. నవతరం కథలు అనే పేరుతో 25 కథలను ఒక సంపుటిగా వెలువరించారు. విహంగవిలాపము, విరాగిని మొదలైన పద్యకావ్యాలు వ్రాశారు. తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి శిష్యురాలు.

**అహల్యాదేవి గుత్తికొండ :** బ్రాంచి పోస్ట్ మాస్టర్, జంగంగూడెం, నూజివీడు గ్రామం. నేటి చరిత్ర, అరవిందాలు స్వీయరచనలు. మన(భాష)గోడు, నగ్న సత్యాలు సాహితీ సంకలనాలు ప్రచురించారు. పాఠశాలల్లో పద్య, వక్తృత్వ, వ్యాసరచన పోటీలు పెట్టి పిల్లల్ని ప్రోత్సహిస్తుంటారు. ఫోన నం. : 8106882802.

**ఆకెళ్ళ వెంకట సుబ్బలక్ష్మి.** కృష్ణాజిల్లా గుడివాడలో జననం. బాలసాహిత్య,కథ,వ్యాస రచయిత్రి,కవయిత్రి.వీరి రచనలు అన్ని దిన, వార, పక్ష, మాసపత్రికలలో ప్రచురితం. 9 బాలసాహిత్య, 3కథా సంపుటాలు,1కవిత,2 వయోజన విద్యా సంపుటాలు ఇలా మొత్తం 15 సంపుటాలు,10 సంకలనాలు వెలువరించారు.బాల గోకులం,ఆకెళ్ళ అసోసియేషన్ ల వ్యవస్థాపక అధ్యక్షులు.ఆ సంస్థల ద్వారా బాలల్ని,బాలకథా రచయితల్ని,కథా రచయితల్ని ప్రోత్సహిస్తున్నారు. చిరునామా. ఇం.నం. 24-6/4, సాయికుంజ్,విష్ణుపురి,మల్కాజ్గిరి,హైదరాబాద్-47. ఫోన్.9849464017.

**ఆదిలక్ష్మీ ప్రసాద్ నిడమర్తి :** జన్మస్థలం శ్రీకాకుళం జిల్లా కోటబొమ్మాళి గ్రామం. 5-12-1951న జన్మించారు. బాలసాహిత్యం, సమీక్షలు, వ్యాసాలు వ్రాశారు. పత్రికల్లో ఫ్రీలాన్సర్‌గా పనిచేశారు.

**ఇందిర గుమ్ములూరి(సుసర్ల) :** విశ్వనాథవారి చారిత్రక నవలలో మతదృక్పథము పరిశోధనాంశంగా పి.హెచ్.డి. పొందారు. విశ్వనాథ నవలలు-ఉపాసనా రీతులు, విశ్వనాథ ధిషణాహేల, తేలికైన తెలుగు తేట తెలుగు, విశ్వనాథ నవలా దిగ్దర్శనం గ్రంథాలు వెలువరించారు. అనేక సదస్సుల్లో పత్ర సమర్పణలు, ప్రసంగాలు చేశారు. చిరునామా: ఫ్లాట్ 401, కల్పవృక్షం, హెచ్.ఐ.జి. 450, సెక్టార్ 4, ఎం.వి.పి.కాలనీ, విశాఖపట్నం-17. ఫోను నం.9985386444.

**ఇందిరా చిరంజీవి :** త్రిపురారిభట్ల ఇందిరా చిరంజీవి ప్రముఖ తెలుగు రచయిత్రి. ప్రముఖ సాహితీవేత్త త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి కోడలు, అసలు పేరు ఇందిరాదేవి. వందకుపైగా కథలతోపాటు కథానికలు, వ్యాసాలు, నాటికలు, జానపదగేయాలు, కవితలు వ్రాశారు. పలు అంశాలపై రేడియో ప్రసంగాలూ చేశారు. 'నీవు నీవుగానే ఉండు' కథానికల సంపుటికి 1995లో డాక్టర్ సి.నారాయణరెడ్డి నుండి సినీ కళాసాహిత్య అవార్డును అందుకున్నారు. కొంతకాలంపాటు 'కరుణశ్రీ' పత్రిక గౌరవ సంపాదకులుగా వ్యవహరించారు. కవితాగానం, కవితావనం, పుష్యరాగాలు వీరి రచనల్లో కొన్ని. ఎన్నో అవార్డులు, రివార్డులతో పాటు 2008లో తెలుగు విశ్వ విద్యాలయ ధర్మనిధి పురస్కారం, జీవనసాఫల్య పురస్కారాలను అందుకున్నారు. 06-02-2016 న మరణించారు.

**ఇందిరా మోహన్దాస్ :** జన్మస్థలం గుంటూరుజిల్లా మాదవరం. 15-5-1935న జన్మించారు. లెక్చరర్గా పనిచేసి, రిటైరయ్యారు. నింగి నేలను తాకింది అనే 9 కథల సంపుటిని 1999లో వెలువరించారు.

**ఇందిరాకృష్ణ బొగ్గరపు :** జన్మస్థలం నెల్లూరు. ప్రముఖ కవి, బొగ్గరపు రాధాకృష్ణ మూర్తి భార్య. పత్రికలు, ఆకాశవాణిలో కవితలు, వ్యాసాలు, బాలల కథలు. అక్షర తరంగాలు కవితా సంపుటి వెలువరించారు. వాణి రంగారావు స్మారక పురస్కారం అందుకున్నారు. చిరునామా: ఇంటి నెం: 136-8-364, శ్రీ చైతన్య కాలేజీ ఎదురుగా, రామలింగాపురం, నెల్లూరు - 524003 ఫోను నం: 9885481939

**ఇందిరాదేవి సత్యవాడ (ఓగేటి) :** జన్మస్థలం గుంటూరుజిల్లా యాజలి గ్రామం. 1943 జూలై 21వ తేదీ జన్మించారు. ఎం.ఎ(తెలుగు) ఉత్తీర్ణురాలై మాడపాటి

హనుమంతరావు స్వర్ణపతకాన్ని సాధించారు. హైదరాబాదులోని గవర్నమెంట్ సిటీ కాలేజిలో ఆంధ్రశాఖకు అధిపతిగా పనిచేసి,స్వచ్ఛంద పదవీ విరమణ చేశారు. శతకాలు, గేయాలు, సాహితీ రూపకాలు, నాటికలు, చారిత్రక నవలలు, సాంఘిక నవలలు, కథలు, వ్యాసాలు వివిధ పత్రికల్లో అచ్చయ్యాయి. ఆకాశవాణి, దూరదర్శన్లలో అనేక కార్యక్రమాల్లో పాల్గొన్నారు. 11 నవలలు; 6 కథా సంపుటాలు; 6 సాహిత్య రూపకాలు; 64కథలు; ఇతర రచనలు 6 వెలువరించారు. సనాతన ధర్మ ఛారిటబుల్ ట్రస్ట్ వారి శ్రీరామనవమి ప్రతిభాపురస్కారం, తెలుగు విశ్వవిద్యాలయం వారి ధర్మనిధి పురస్కారం, సారస్వతసమితి మచిలీపట్నం వారి ఉగాది పురస్కారం, నోరి నరసింహశాస్త్రి స్మారక పురస్కారం అందుకున్నారు. 2009 మే 25 న మరణించారు.

**ఇందిరారావు షబ్నవీస్ :** ఒమన్ రేడియోలో 10సం. వృత్తి. ప్రస్తుతం హైదరాబాద్‌లో నివాసం. 2015లో పదవీవిరమణ తర్వాత మాస్టర్స్ ఇన్ జర్నలిజం చేశారు. కథా రచయిత్రి. నాటావారి నెలనెలా వెన్నెల దీపావళి, ఉగాది సంచికలలో కథలు ప్రచురితం. ఫోన్. 9989988226.

**ఇందుమతీదేవి గుడిపూడి :** అంబరీషవిజయము, లక్ష్మణాపరిణయము, తరుణీశతకము, రాజేశ్వరీశతకము, నీతి తారావళి, జన్మభూమి మొదలైన కావ్యాలు వ్రాశారు. విజయవాడలో ఉండేవారు.

**ఇందుమతీదేవి గుడిపూడి :** జన్మస్థలం పాత గుంటూరు. జననం 1890. విజయవాడలో స్థిరపడ్డారు. పుట్టినింటి పేరు మతుకుమల్లి. వీరి తాత మతుకుమల్లి నృసింహశాస్త్రి బొమ్మిదేవర జమీన్దారుల ఆస్థాన కవి. సోదరుడు నరసింహశాస్త్రి కూడా కవి. పదవయేట రచనావ్యాసంగం ప్రారంభించి అనేక సన్మానాలు పొందారు. విజయవాడలో అనేక సభలలో పాల్గొని, మంచి వక్తగా పేరు పొందారు. అంబరీష విజయము, నర్మద నాటకం, తరుణీ శతకము, రామకథామంజరి, రాజరాజేశ్వరీ నక్షత్రమాల మొదలైన 16 రచనలు వెలువరించారు. తిరవాయిమొళి అనువదించారు. గృహలక్ష్మి స్వర్ణకంకణము, సాహిత్య అకాడమీ ఉత్తమరచయిత్రి సత్కారాలు పొందారు.

**ఇందుమతీదేవి సోమరాజు :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'కలువపాముల' గ్రామం. వీరు కావ్యాళి, శకుంతలా పరిణయము, గౌరి అనే ఖండకావ్యాలు రచించారు.

**ఈశ్వరమ్మ కె. :** జన్మస్థలం తూర్పుగోదావరిజిల్లా రాజమండ్రి. 15-6-1954న జన్మించారు. 'భ్రమ, తేడా' అనేప్రఖ్యాత కథలతో పాటు అనేక కథలు వ్రాశారు.

**ఉదయ జానకి లక్ష్మి చింతపల్లి డా. :** ప్రకాశం జిల్లా దొనకొండ వాస్తవ్యులు. వింగ్స్ ఇండియా ఫౌండేషన్ అధినేత్రి. సామాజిక, సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక సేవా కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటారు. అనేక పత్రికలలో కథలు, కవితలు, వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. బాలలతో నాటికలు వేయిస్తారు. ఉత్తమ దర్శకత్వ అవార్డు, పరిపూర్ణ మహిళా అవార్డు, భారతీయ వికాస్ రత్న అవార్డ్, సేవాతపస్వి, ఆంధ్ర రత్న, అభినవ థెరిసా అవార్డ్ వంటి అనేక పురస్కారాలను పొందారు. చిరునామా: క్లవ్ పేట, 5వ లైను, ఇం.నం. 54-1-20(7), ఒంగోలు-523001.ప్రకాశం జిల్లా. ఫోను నం. : 9440731068.

**ఉదయం మోటూరి :** జన్మస్థలం తూర్పుగోదావరిజిల్లా. మహిళా ఉద్యమ దిక్సూచి.మెడికల్ రిప్రజెంటేటివ్ ఉద్యోగం చేశారు. తెనాలిలో అఖిల భారత మహిళాసభ జరిగినప్పుడు, పార్వతి, చింత కోటేశ్వరమ్మలతో కలసి బుర్రకథలు చెప్పారు. మహిళల్ని అభివృద్ధి పథంలో ముందుంచాలని, వారి ఆత్మస్థైర్యం కోసం కరాటే లాంటి విద్యలు నేర్పించాలని తెలిపారు. మహిళలకు ఆస్తిలో హక్కు కోసం చట్టం చేసేవరకు పోరాడారు.

**ఉమర్జీ అనూరాధ కావూరి డా. :** 1970లో జన్మించారు. సినీరచయిత్రి, నాటక రచయిత్రి, జర్నలిస్ట్. మరాఠీ, తెలుగు, తమిళం, ఆంగ్ల భాషలతో పరిచయం. తండ్రి ఉద్యోగరీత్యా కృష్ణాజిల్లా, విజయవాడకి వచ్చారు. కాలేజిలో చదువుకునే సమయంలోనే అనేక నాటకాలు వ్రాశారు, 3 రేడియో నాటికలు కూడా వ్రాశారు. తెలుగుపై ఇంటెన్సివ్ పరిశోధన, కేరళ క్రైస్తవ కుటుంబాలు ట్రెడిషన్సుపై పరిశోధన చేశారు. ఇండియన్ సినిమా లెజెండ్స్ గురించి వెండి తెర నిర్దేశకులు పేర సితార ఫిల్మ్ వీక్లీ మ్యాగజైన్లో వ్రాశారు. పెళ్ళి చేసుకుందాం రా, వైశాలి, ఘర్షణ వంటి డైలీ TV సీరియల్సుకు మాటలు; గగనం, ఏ మాయ చేసావే, 2010 మరో చరిత్ర, ఇంటింటా అన్నమయ్య, మాలిని 22 చిత్రాలకు స్క్రిప్ట్, మాటలు వ్రాశారు. అనురాధ 'ఉమర్జీ కుమరన్' పేరుతో ఈనాడు సినిమా పేజీ కోసం వివిధ చిత్ర వ్యక్తుల గురించి ఎన్నో వ్యాసాలు వ్రాశారు. వీరు తెలుగు సినీ రైటర్స్ అసోసియేషన్ వైస్ ప్రెసిడెంట్ చైర్‌పర్సన్‌గా ఉన్నారు. ప్రముఖ పురస్కారాలు 2010 ఉత్తమ సంభాషణలకు అక్కినేని అభినందన అవార్డు, సూపర్ హిట్ ఫిల్మ్ వీక్లీ అవార్డు అందుకున్నారు. తల్లి వేమగంటి సుశీల, కూడా ఒక రచయిత్రి, మద్రాస్ మరియు అన్ని భారతదేశం రేడియోకేంద్రాలలో ఒక కళాకారిణి. కేంద్రీయ విద్యాలయం చెన్నైలో ఇంగ్లీష్ టీచర్‌గా పనిచేశారు.

**ఉమా సరస్వతి ఓలేటి :** బందరు. తెలుగు ఉపాధ్యాయిని, కొత్తపూలు, పద్యపుష్పకం సంపుటాలకు సంపాదకత్వం వహించారు. కొన్ని సంకలనాలలో కవితలు వ్రాసారు. కవితలు పద్యాలు బహుమతులు పొందినవి. దూరదర్శన్ లో బాలకవి సమ్మేళనం నిర్వహించారు. అవధానాలలో పృచ్ఛకులుగా పాల్గొన్నారు. చిరునామా: ఇంటి నెం: 17/423, ఇంగ్లీష్ పాలెం, మచిలీపట్నం. ఫోను నం: 9866366457.

**ఉమాదేవి ఆచంట :** జన్మస్థలం గుంటూరు. 14.10.1942న జన్మించారు. హైస్కూలులో ఉపాధ్యాయురాలుగా పనిచేశారు. కథలు, నవలలు రచించారు. 22 కథలు వివిధపత్రికల్లో ప్రచురితమయ్యాయి. కొన్ని కథలు, నవలలు బహుమతి పొందాయి.

**ఉమాదేవి ఎం. డా. :** గుంటూరులో తెలుగు అధ్యాపకురాలిగా పనిచేస్తున్నారు. పలు పత్రికలలో ఆధ్యాత్మిక వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. జాతీయ, అంతర్జాతీయ సదస్సులలో 50వరకు పత్రసమర్పణలు చేశారు. వాటిలో 20వరకు ప్రచురింపబడ్డాయి. శాకంబరీదేవి మహాత్మ్యం, ప్రహ్లాదుడు తండ్రిని చంపిన హంతకుడా? పాకుడురాళ్ళమీద పరుగెత్తిన వీరుడు వంటి 40కి పైగా ఇతర వ్యాసాలు వ్రాశారు. అధరాపురపు తేజోవతి నవలలపై పరిశోధన చేశారు. చిరునామా. తెలుగు లెక్చరర్,ఎస్ జి హెచ్ ఆర్ & ఎం సి ఎం ఆర్ కాలేజి, గుంటూరు. ఫోన్. 9849061286.

**ఉమాదేవి బల్లూరి డా. :** జన్మస్థలం కర్నూలుజిల్లా కొసిగి. విశ్రాంత తెలుగు ఉపన్యాసకులు. తెలుగు, కన్నడ సంప్రదాయపు స్త్రీలపాటలు-తులనాత్మక పరిశీలన అంశంపై పరిశోధన చేశారు. శ్రీరామదూత శతకము, అక్షరవనం పుస్తకాలు వెలువరించారు. 3000 సమస్యాపూరణలు, 700 కవితలు రచించారు. జాతీయ సదస్సులలో పత్రసమర్పణలు చేశారు. అనేక పత్రికలలో వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. రేడియో ప్రసంగాలు చేశారు. అష్టావధానాలలో పృచ్ఛకులుగా ఉన్నారు. భగవద్గీత, రామాయణం, భారతంలపై ప్రవచనం చెప్తుంటారు. సహస్ర కవిచక్రవర్తిని, సహస్ర కవిమిత్ర, సహస్ర కవిరత్న, సహస్ర కవిభూషణ, సహస్ర పద్యశ్రీ బిరుదులు అందుకున్నారు. చిరునామా: నందకిషోర్, ఫ్లాట్ నెం. 204, 3వ క్రాస్, 3వ మెయిన్, న్యూ అదితి పబ్లిక్ స్కూల్, ఎ. జ ఎస్ లే అవుట్, బెంగళూరు 560061.

**ఉమాదేవి సి. :** జన్మస్థలం చిత్తూరుజిల్లా. 4.2.1947న జన్మించారు. ఎం.ఏ., బి.ఇడి. చేసి, 17 సం.లు విద్యా రంగంలో పనిచేశారు. నవలా రచయిత్రి, కవయిత్రి, వ్యాస రచయిత్రి కూడా. చిన్ని గుండెల చప్పుళ్ళు అనే కథా సంపుటిని రచించారు.

**ఉమాభారతి కోసూరి :** హోస్టన్, టెక్సాస్. ఎగిరేపావురమా! సాంఘిక నవల రచించి ప్రచురించారు.

**ఉష పొన్నపల్లి డా. :** జన్మస్థలం 'తెనాలి'. 9.5.1959న జన్మించారు. పరిశోధకురాలు, స్త్రీవాద వ్యాస రచయిత్రి.తెలుగు ఎం.ఏ. చదివి 'పల్నాటి వీరచరిత్ర నాటకాలు' అనే సిద్ధాంత గ్రంథం సమర్పించి, నాగార్జున విశ్వ విద్యాలయం నుంచి పి.హెచ్.డి. పట్టా పొందారు. 'స్త్రీ వాదం, స్త్రీవాద సాహిత్యం; మానవ వికాస సాహిత్య ధోరణులు, అనేక పత్రికలలో వ్యాసాలూ రచించారు. ఎన్.సి.సి. ప్రోగ్రాం ఆఫీసరు, విజయవాడ మేరిస్టెల్లాకళాశాల అధ్యాపకురాలు.

**ఉష మాధవపెద్ది :** జన్మస్థలం నరసరావుపేట. 22.11.1950లో జన్మించారు. 18 కథలు రచించారు.

**ఉషా గాయిత్రి మద్దాలి :** కర్నూలు జిల్లాకు చెందిన రచయిత్రి. కామర్స్ డిగ్రీ, నృత్యంలో మాస్టర్ డిగ్రీ పొంది బ్యాంకులో ఉద్యోగం చేసి, విశ్రాంతి పొందుతున్నారు. భారతనారీ వర్ధిల్లు అనే 15 కథల పుస్తకం రచించారు. పొట్టిశ్రీరాములు విశ్వవిద్యాలయం నుంచి ప్రతిభా పురస్కారం అందుకున్నారు. మనస్సు గేయసంపుటి వ్రాశారు. ప్రస్తుతం హైదరాబాదులో నివసిస్తున్నారు.

**ఉషాబాల గంటి :** జన్మస్థలం అమలాపురం. 13.8.1968న జననం. కథలు, కవితలు, వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురితం. పాలపిట్ట బాలకథాసంపుటి ముద్రించారు. 50కథలు వ్రాశారు. విశాఖపట్నం వాస్తవ్యులు. చిరునామా: ఫ్లాట్ నం.401, ఇం.నం.46-19-10. లక్ష్మీ ఈశ్వర్ నివాస్, మండావారి వీధి, దొండిపర్తి, విశాఖపట్నం-530016. ఫోను నం. 8019261852.

**ఉషారాణి కె :** కడప. 20 రేడియో నాటకాలు; ప్రభాత, ప్రబోధ గీతాలు, స్టేజ్ బ్యాలేలు వ్రాశారు. టి.వి.కి 20 డెయిలీ సీరియల్స్, 10 సింగిల్ ఎపిసోడ్స్, 13 ఎపిసోడ్స్ సీరియల్స్ 10 వ్రాశారు. కస్తూరి, అగ్నిపూలు, మంగమ్మగారి మనవరాలులకు మాటల రచయిత్రిగా మంచి పేరు పొందారు.2 నంది అవార్డులు,అనేక పురస్కారాలు పొందారు.

**ఉషారాణి ధనాశి డా. :** కలంపేరు సిరిరాగ. భౌతికశాస్త్ర ఉపాధ్యాయిని. కవితలు, కథలు రాయడం; పాటలు పాడడం అభిరుచులు. సేవాసేన సంస్థ నిర్వహణలు, సామాజిక సేవాకార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటారు.

**ఉషారాణి సోమంచి :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'విజయవాడ'. 1957లో 'యేలేశ్వరపు వి.ఎస్. చయనులు, సీతమ్మ' దంపతులకు జన్మించారు. ఆధునిక కథా రచయిత్రిగా

ప్రఖ్యాతి వహించారు. ఈమె రెండవ అన్నయ్య శ్రీ వై.కె.మూర్తి. 1977 కళాశాలస్థాయిలోనే రచనావ్యాసంగం ప్రారంభించారు. మొదట్లో ఆవేదనలూ, అనారోగ్యాలూ, అసంతృప్తులూ కథాంశాలుగా రచించారు. వీరి 'మీనా' కథ ఆంధ్రజ్యోతిలో 'వర్షం కురిసిన రాత్రి' ఆంధ్రపత్రికల, 'పందెం' కథ జయశ్రీ మాసపత్రికలో వెలువడ్డాయి. సోమంచివారి కోడలై, హైదరాబాదు చేరి రచనా వ్యాసంగం కొనసాగిస్తున్నారు. కథలు"అమ్మ కథ, అమ్మాయే పుట్టాలి, ఆడపిల్ల, అంతరం, ఆత్మగౌరవం, సితార, ఈ ప్రశ్నకు బదులేది?, ఇది కథ కాదు, తృప్తి, ప్రేమలత, బెటర్ హాఫ్, ప్రయాణం, దాహోర్తులు" అనే కథలు వ్రాశారు. నవలలు శాంతి, ఆరాధన, రాగద్వేషాలు, నీలినీడలు, లలాటలిఖితం, గురుబ్రహ్మ, ప్రేమామృతం' మొదలైనవి. ఆంధ్రభూమిలో సింగిల్ పేజీ కథలు, కార్డుకథలు, కాలంకథలు, మినీకథలు, హాస్య గల్పికలు ఇంకా ఆధ్యాత్మిక రచనలు కూడా చేశారు. 'ఆణిముత్యం' కథ రేడియోలో ప్రసారమైంది. ఇంకా 'కొవ్వొత్తి, సాలోచన, ఎదురీత, ఆడదాని జీవితం, ఆడది, అవగాహన, షరతులు' అనే కథలు, 'సోమంచి ఉషారాణి కథలు' అనే రెండు కథాసంకలనాలు; "కవితా శరాలు" అనే కవితా సంకలనం రచించారు.

**ఓల్గా (లలిత కుమారి, పోపూరి) :** గుంటూరు జిల్లా చుండూరు మండలం యడ్లపల్లి గ్రామం. నవంబర్ 27, 1950లోజన్మించారు. ఆంధ్రప్రదేశ్లోని రాజకీయ, సాహిత్యరంగపు చర్చలో స్త్రీవాద ధృక్పధాన్ని ప్రవేశపెట్టిన రచయిత్రిగా గుర్తింపుని పొందారు. స్త్రీవాద ఉద్యమానికి ప్రతీకగా నిలిచారు. వీరి తల్లిదండ్రులు పోపూరి వెంకటసుబ్బారావు, వెంకటసుబ్బమ్మ. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో తెలుగు సాహిత్యం ఎం.ఎ. చేసిన తర్వాత తెనాలిలోని వి.ఎస్.ఆర్. కళాశాలలో తెలుగు అధ్యాపకురాలిగా పనిచేశారు. ఓల్గా కథలు, నవలలు, పద్యాలు మహిళా సాహిత్యంలో ఎన్నదగినవి. చలం, కొడవటిగంటి కుటుంబరావు రచనల వల్ల ప్రభావితమై, స్త్రీ చైతన్యము అంశంగా రచనలు చేసి తనకై ఒక ప్రత్యేక స్థానం సంపాదించుకున్నారు. పత్రికల్లో, సాహిత్యంలో, అనువాదాల్లో మహిళా హక్కులపై అనేక చర్చలను లేవదీశారు. చలనచిత్రరంగంలో 'ఉషాకిరణ్' సంస్థకు కథా రచయిత్రిగా పనిచేసి, మూడు చిత్రాలు నిర్మించి పురస్కారాలు పొందారు. ఆవిడ రాసిన స్వేచ్ఛ నవలని వివిధ భారతీయ భాషల్లోకి అనువదించడానికి నేషనల్ బుక్ ట్రస్టు స్వీకరించింది. 1986 నుంచి 1995 వరకు ఉషా కిరణ్ మూవీస్ లో సీనియర్ కార్యవర్గ సభ్యురాలిగా పనిచేసారు. 1991 నుండి 1997 వరకు అస్మిత రిసోర్స్ సెంటర్ ఫర్ విమెన్ కు అధ్యక్షురాలిగా పనిచేసారు. ప్రస్తుతం అస్మితలో

జనరల్ సెక్రటరీగా పనిచేస్తున్నారు. అమెరికన్ లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ వారు ఓల్గా వ్రాసిన 12 కథల ఆంగ్లానువాదాలను తమ సంగ్రహంలో చేర్చారు.

**కనకదుర్గా మహాలక్ష్మి కొమ్మరాజు :** తెలుగు ఉపాధ్యాయిని, మచిలీపట్నం. తెలుగు, సంస్కృతాలలో ఎం.ఎ. చేశారు.అనేక కవితా సంకలనాలలో కవితలు ప్రచురించబడ్డాయి. పలు కవిసమ్మేళనాలలో, దూరదర్శన్లో కవితాగానం. టి.టి.డి.ద్వారా ఆధ్యాత్మిక ప్రవచనాలు, ప్రసంగాలు. వివాహ పంచరత్నాలు, నవరాగాలు, సన్మాన పత్రాలు వ్రాశారు. అష్ట, శత, ద్విశతావధానాలలో పృచ్ఛకులుగా పాల్గొన్నారు. చిరునామా: తెలుగు ఉపాధ్యాయిని, జైహింద్ సెకండరీ పాఠశాల, మచిలీపట్నం-521001. ఫోను నం. 8179104434.

**కనకదుర్గాంబ బచ్చు :** జన్మస్థలం తిరువూరు మండలం పెనుగొలను గ్రామం. 1934లో జన్మించారు. 2004లో 'కనకదుర్గాంబ శతకం' రచించారు. శతక రచయిత్రి.

**కనకమ్మ కాంచనపల్లి :** జన్మస్థలం గుంటూరుజిల్లా, పల్నాటి సీమలోని దుర్గి గ్రామం. సెప్టెంబరు 3, 1893న రంగారావు, రంగమ్మ దంపతులకు జన్మించారు. విజయవాడలో త్రిలింగ విద్యాపీఠం స్థాపకురాలు. సంస్కృతాంధ్ర రచయిత్రి. బి.ఎ. ఆంగ్లంలో పట్టభద్రురాలై నెల్లూరు, చెన్నైలలో లేడీ వెల్లింగ్టన్ ఉన్నత పాఠశాలలోను, క్వీన్ మేరీస్ కళాశాల లోను ఆంధ్రోపన్యాసకులుగా పనిచేశారు. సంస్కృతాంధ్రాలలో పాండిత్యం, విద్వాన్' విద్యార్హతలు. తన 12వ యేట, 1905లో రచించిన 'రంగ శతకము" తో రచనా రంగప్రవేశం చేసి, పండితోత్తముల మెప్పును పొందిన కవయిత్రి. నవ్యాంధ్ర కవయిత్రులలో శ్రేష్ఠురాలు. మాక్మిలన్ కంపెనీ వంటి విద్యాసంస్థల కోసం తెలుగు పుస్తకాలు రచించారు.ఆనాటి అన్ని స్త్రీల పత్రికలలోను వీరి రచనలు ప్రచురించబడ్డాయి. కాళిదాసు "అభిజ్ఞాన శాకుంతలము" సంస్కృత నాటకాన్ని ఆంధ్రీకరించారు. "రంగ శతకము" (1905) "పద్య ముక్తావళి " (1927) ప్రసిద్ధ రచనలు. "కవితా విశారద", "కవితిలక" అనే బిరుదులు మరియు కేసరి గృహలక్ష్మి స్వర్ణకంకణం అందుకున్నారు.

**కనకమ్మ పుట్టపర్తి :** పుట్టపర్తి కనకమ్మ (జూలై 22, 1922-1983) ప్రముఖ సంస్కృతాంధ్ర కవయిత్రి. సరస్వతీ పుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులుగారి భార్య. ప్రొద్దుటూరులో జన్మించారు. కాశీకవి కిడాంబి రాఘవాచార్యులు గారి మనుమరాలు. సాహిత్యం మీద మక్కువతో భర్తకు తెలియకుండా కవిత్వం రాస్తుండేవారు. ఒకనాడు పుట్టపర్తి వారు ఆ కవితల్ని చూసి భావ పరిపక్వతకు, భాషా సౌందర్యానికి మురిసిపోయి, వివిధ పత్రికలకు పంపారు. అవి

ప్రచురించబడి లోకానికి కవయిత్రిగా తెలిసింది. 'యశోధర, పశ్చాత్తాపం, విషాదగానం' వంటి కవితా ఖండికలను కలిపి 'అగ్నివీణ' పేరుతో పుట్టపర్తివారు వెలువరించారు. వివిధ దైవాలపై చక్కని కృతులను భర్తతో కలిసి వ్రాసారు. అన్ని ఆకాశవాణి కేంద్రాలలోనూ ఎన్నో సంవత్సరాలు ప్రసారమయ్యాయి. సామాజిక స్పృహతో వరకట్నానికి వ్యతిరేకంగా కవితారచన చేశారు. సంస్కృతంలో 'శ్రీరామ సుప్రభాతం' రచించారు. అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి వారు 1974లో ఉత్తమ కవయిత్రిగా సన్మానించారు. 1983 సంవత్సరంలో పరమపదించారు.

**కనకమ్మ పొణకా :** జన్మస్థలం నెల్లూరు జిల్లా మినగల్లులో జన్మించారు. అధికారిక విద్య లేకపోయినా తెలుగు, హిందీ సంస్కృతులలో తన ప్రయత్నాలతో నైపుణ్యాన్ని సంపాదించారు. నెల్లూరుకు సమీపంలోని పోట్లపూడి గ్రామంలో 'సుజాన రంజనీ సమాజం' మరియు 'వివేకానంద గ్రంథాలయం' ఏర్పాటు చేశారు. హరిజన ఉన్నత కోసం పనిచేశారు. కొద్దికాలం పాటు 1916 నుండి 1919 వరకు విప్లవ రాజకీయాల్లోకి రావడంతోపాటు మహాత్మాగాంధీ యొక్క ప్రముఖ శిష్యురాలు అయ్యారు. పోనకా కనకమ్మ మరియు ద్రోణంరాజు లక్ష్మీబాయిమ్మ తెలుగులో మొదటి జంట కవిత్వం. వారు రమణ మహర్షిపై అనేక తాత్విక కవితలు వ్రాశారు. వారు భగవద్గీత తెలుగులోకి "జ్ఞాన నేత్రం" అనే పేరుతో అనువదించారు. తెలుగు, ఆంగ్లాలలో శ్రీ రామయోగి యొక్క స్వీయ జీవిత చరిత్రను వ్రాశారు. కనకమ్మ రాసిన రచనలు భారతి, కృష్ణపత్రిక, గృహలక్ష్మి, అనసూయ, హిందుసుందరి జమీన్ రైతు ఇంకా అనేక ఇతర పత్రికలలో కనిపించాయి.

**కనకమ్మ పొన్నక :** సెప్టెంబర్ 15, 1963 న నెల్లూరులో మరణించారు. తెలుగులో స్వీయజీవిత చరిత్ర "కనకపు పుష్యరాగం"

**కనకవల్లి :** కొండపి రుక్మిణమ్మ ప్రకాశంజిల్లా కొండపి గ్రామంలో 15-1-1930న జన్మించారు. డేటింగ్, చిట్కా, తెగింపు అనే 9 కథల సంపుటిని రచించారు.

**కమల కాకాని :** జన్మస్థలం పశ్చిమ గోదావరి జిల్లా ఆరిగొల్లు గ్రామం. 19.8.1959న జన్మించారు. వరంగల్, హైదరాబాదు విశ్వవిద్యాలయాలలో తెలుగు, సైకాలజీలలో ఎమ్.ఏ.డిగ్రీ పొందారు. కమలిని, కమలిక, కనాలి లాంటి కలంపేర్లతో అనేక రచనలు చేశారు. 500కు పైగా కథలు; 30 నవలలు రచించారు. ఇంకా పిల్లల కథలు కూడా రచించారు.

**కమల కుమారి పంతుల :** జన్మస్థలం శ్రీకాకుళం జిల్లా లక్ష్మీనర్సుపేట. 19.8.1957న జన్మించారు. విజయనగరం జిల్లాలో ఉపాధ్యాయినిగా పనిచేశారు. 'గోస' పేరుతోవంశధార కథల కథా సంకలనం వ్రాశారు.

**కమల చింతపెంట :** జన్మస్థలం నిడదవోలు దగ్గరున్న తాడిమళ్ళ గ్రామం. 18.1.1941న జన్మించారు. కమల, మారుతి పేర్లతో రచనలు చేశారు. రచయిత్రి, నాటక కర్త్రి కూడా. దేవుళ్ళతీరు మనుషుల జోరు అనే 26 కథల సంపుటిని ప్రచురించారు.

**కమలమ్మ దిగుమర్తి :** జన్మస్థలం శ్రీకాకుళం. 6.5.1927న జన్మించారు. మోదుగు పూలు, స్త్రీ స్వాతంత్ర్యం రచనలు.

**కమలా దేశికన్ :** జన్మస్థలం రేపల్లెతాలూక, నల్లూరుగ్రామం. 5.11.1927న జన్మించారు. మహారాష్ట్ర లోని సేవాగ్రామ్లో ఉంటున్నారు. వీరి రచనలు 'డాక్టరుగారు దంపుడు బియ్యము, డాక్టరుగారు సెలవురోజు' పాఠకుల ఆదరణ పొందాయి.

**కమలా రాంజీ న్యాయపతి :** జన్మస్థలం విజయనగరం. 2-10-1947న జన్మించారు. వీరు డిగ్రీ వరకు చదివారు. విశాఖపట్నంలో నివసిస్తున్నారు. చిన్ని చిన్ని ఆశ, అనే కథల సంపుటాన్ని 2003లో విడుదల చేశారు.

**కమలాదేవి పులవర్తి :** పులవర్తి కమలాదేవి రాజమండ్రిలోని ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల కార్యనిర్వాహక సభ్యురాలుగా ఉండేవారు. నవలలు, కథలు చాలా వ్రాశారు. 'కవితిలక బిరుదు, సాహితీ పురస్కారం పొందారు. రచనలు సాహితీ సుధాకరులు, సాధు శాంతారాం.

**కమలాదేవి బుర్రా :** జన్మస్థలం విశాఖపట్టణం. ఏప్రిల్ 13, 1908 న జన్మించారు. లలిత కావ్యకర్త్రి. బుద్ధవరపు వారింట పుట్టి, బుఱ్ఱా వారింట మెట్టినారు. ప్రాచీనాంధ్ర, ఆంగ్ల సాహిత్యాలతో పరిచయం ఉంది. వీరు రచించిన 'ఛందోహంసి' అనే గ్రంథం, పోస్ట్ గ్రాడ్యేట్ స్టడీస్, ఉభయబాషాప్రవీణ వాళ్లకి పాఠ్యగ్రంథంగా ఎన్నుకోబడింది. ఆంధ్రా సెనేట్ లో సభ్యులుగా అనేక ప్రముఖ సంస్థలలో, కార్యక్రమాలలో పాల్గొన్నారు. రచనలు : శ్రీ వైశాఖ వేంకట ప్రభూదయం, ఛందోహంసి (రెండు భాగాలు), అనుష్టుప్, నిగమాంతర కవితోపమలు, మందాక్రాంత కవితాశ్రవంతి.

**కమలాదేవి భమిడి :** జన్మస్థలం ప.గో.జిల్లా, తణుకు. సంగీత, సాహిత్య, ఆధ్యాత్మిక వ్యాసాలు పత్రికలలో ప్రచురితమవుతున్నాయి. వాగ్గేయకార నాదయోగ వైభవం

రూపకం రచించి అన్నీ స్త్రీపాత్రలతో 14 సార్లు ప్రదర్శించారు. భక్తితత్వం ముకుందమాల పుస్తకాన్ని, శ్లోకాల సి.డి ని వెలువరించారు. నార్త్ అమెరికా తో సహా పలు చోట్ల సంగీత ఉపన్యాసాలు ఇచ్చారు. చిరునామా: 34-1-18, దొడ్డిపట్లవారి తోట వీధి, తణుకు, ప.గో.జిల్లా.

**కమలారాంజీ న్యాయపతి :** 6నవలలు, 400కథలు, 360కవితలు, 20నాటికలు వ్రాశారు. జాతీయ సేవా కార్యక్రమాల్లో పాల్గొని సర్వేపల్లి రాధాకృష్ణన్, జవహర్ లాల్ నెహ్రూ లచే సత్కారాలు పొందిన తొలి తెలుగు మహిళగా గుర్తింపు పొందారు." 20వ శతాబ్దపు నూరుమంది ఉత్తమ తెలుగు కథకులు" లో ఒకరిగా స్థానం పొందడం వీరి ప్రతిభకు తార్కాణం. హిందీలో కూడా కథలు వ్రాశారు.

**కరుణ మిడుతల :** జన్మస్థలం గుంటూరు. 4.4.1969 న జన్మించారు. కరుణ పేరుతో అనేక కథలు వ్రాశారు. తాయమ్మ కల, ముదనష్టపు రోజులు రచించారు.

**కర్రా సుబ్బలక్ష్మమ్మ కర్రా :** చంద్రకళావిలాసం ప్రబంధము వ్రాశారు. భర్త కర్రా రామశర్మ (కడపమండలం శేషమాంబాపురం) తో కలిసి లక్ష్మీ శారదాగీతాలు వ్రాశారు.కుమారీనీతి, లేఖదూత,కన్నీరు మొదలైన రచనలు చేశారు.

**కల్పన కోనేరు :** జన్మస్థలం కృష్ణాజిల్లా గన్నవరం. 7.11.1947న జన్మించారు. వచన కవితా రచయిత్రి, వ్యాయామ ఉపాధ్యాయిని. 'బ్రతుకు బండి మొదలైన కథలు రచించారు. స్వాతిముత్యాలు కవితల సంపుటి ముద్రించారు.

**కల్పనా రెంటాల :** ప్రముఖ రచయిత్రి మరియు జర్నలిస్ట్. అచ్చుపత్రికలతో పాటు వెబ్పత్రికలలో కూడా రచనలు చేస్తూంటారు. తండ్రి రెంటాల గోపాలకృష్ణ. నేను కనిపించే పదం (కవితలసంకలనం), తన్హాయి ( ఈ నవలపై విస్తృతంగా చర్చలు జరిగాయి). ఋతుభ్రమణం, టింకూ ఇన్ టెక్సస్, అయిదో గోడ, ఇట్స్ నాట్ ఓకే కథలు ప్రచురింపబడ్డాయి. సారంగ సాహిత్య వారపత్రిక సంపాదకవర్గంలో ఒకరు.

**కల్యాణి వేంపాటి (సోమరాజు) :** జన్మస్థలం తెనాలి. 13.3.1950న జన్మించారు. మబ్బులు తొలిగాయి, స్త్రీ హృదయం, జననీ జన్మభూమి మొదలైన 14 కథలు వ్రాశారు.

**కళావతి చిన్నలక్ష్మి.డా.** కవయిత్రి. కమలాపురం తాలూకా కడప జిల్లాలో పుట్టారు. తొలిసంధ్య, చిరుదివ్వె, రాగమాలిక గేయసంపుటాలు,కళాస్రవంతి వ్యాస సంపుటి కొన్ని సి.డిలు వెలువరించారు.సాహితీ సుధ, తెలుగు అకాడమీ శతవసంత పురస్కారం మొ.అందుకున్నారు. రేడియో ప్రసంగాలు చేస్తారు.

**కళ్యాణి.ఎస్. :** భాషోపాధ్యాయిని, జెడ్.పి.హెచ్.ఎస్. గోనెగండ్ల, కర్నూలు. 22.7.73న జన్మించారు. విద్యార్థులతో రామాయణం బుర్రకథలు వేయిస్తున్నారు. ఫోన్.9948436168.

**కవిత ఇచ్ఛాపురపు :** జన్మస్థలం తూ.గో. జిల్లా అనకాపల్లి. 1.9.1970న జన్మించారు. ఎమ్.ఏ., ఎం.కాం., ఎం.ఫిల్. చదివారు. టీచర్. కథ, నవలా రచయిత్రి కూడ. మొక్కగా వంచకు, తెలుగు బస్సు, మరో 11 కథలతో ఒక సంపుటిని వెలువరించారు.

**కాత్యాయని విద్మహే :** జన్మస్థలం ప్రకాశం జిల్లా మైలవరం (అద్దంకి) గ్రామం. 1955 నవంబర్ 3 న కేతవరపు ఇందిరాదేవి, రామకోటిశాస్త్రి దంపతులకు జన్మించారు. ప్రముఖ సాహితీ విమర్శకులు ప్రొఫెసర్. 12 ఏళ్ల వయసు నుంచే సాహిత్యంపై ఆసక్తి కనబర్చారు. 'చివరకు మిగిలేది మానసిక సామాజిక జీవన స్రవంతి నవలా మిమర్శ' అనే అంశంపై పీహెచ్డీ చేసి కాకతీయ విశ్వవిద్యాలయంలో డాక్టరేట్ పొందారు. మహిళా జనజీవన దృక్పథంతో సాహిత్య విమర్శనా వ్యాసాలు వ్రాశారు. మార్క్సిజం, స్త్రీవాద దృక్పథం, సామాజిక సిద్ధాంతాలు తదితర 285 వరకు వ్యాసాలు వ్రాశారు. 275 పరిశోధన పత్రాలు సమర్పించారు. సాహిత్యం 'సాహిత్యాకాశంలో సగం స్త్రీల అస్తిత్వ సాహిత్యం కవిత్వం, కథ అనే కథా కవిత్వం విమర్శనా గ్రంథానికి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారానికి ఎంపికయ్యారు.

**కామేశ్వరి గుడిసేవ :** 20-10-1957జన్మించారు, విజయవాడలో హిందీప్రవీణ ప్రచారక్ గా విద్య గరసి ఉపాధ్యాయినిగా పనిచేస్తూ1982లో తెలుగు పండితుడు, కవియైన డా. గుడిసేవ విష్ణుప్రసాద్‌ను వివాహమాడి. యం.ఎ, యం. ఇడి చేసి శిశువిద్యామందిరం, అవనిగడ్డలో ఉపాధ్యాయ వృత్తిలో ఉంటూ బాలసాహిత్య రచనలుచేశారు. విజయవాడ ఆకాశవాణిలో స్వీయకవితాగానం చేశారు. పుస్తక సమీక్షలు, చర్చాకార్యక్రమాలు ప్రసారమయ్యాయి. పలుపత్రికలలో, సంకలన గ్రంధాలలో వీరి కథలు, కవితలు, పుస్తక సమీక్షలు, గేయాలు, వ్యాసాలు ప్రచురిత మైనాయి. రచన "శ్రీ సుహితాభారతి" గేయసంకలనం. చిరునామా: పండితపురం అవనిగడ్డ-521 121, కృష్ణా. ఆం.ప్ర. ఫోను నం.9490340916.

**కామేశ్వరి వక్కలము :** జన్మస్థలము కృష్ణాజిల్లా గూడవల్లి గ్రామం. 1953లో జన్మించారు. రాజకీయ గ్రంథ రచయిత్రి. రాజకీయ రంగంలో మహిళాశక్తి అనే రచన ద్వారా 2007లో 'ఉమన్ ఆఫ్ ద ఇయర్' అవార్డును పొందారు.

**కామేశ్వరి సి.హెచ్ :** జన్మస్థలం పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురం. సికందరాబాదులో స్థిరపడ్డారు. గుండెల్లో గోదారి, గోదావరి ఘుమఘుమలు, 100పైగా కథలు, 200పైగా వ్యాసాలు, 150పైగా కవితలను సృజించారు. 4పుస్తకాలను వెలువరించారు.

**స్రవంతి ఐతరాజు.** సైకాలజీలో పి.హెచ్.డి,వీణలో డిప్లమో చేశారు. వృత్తిరీత్యా ఆం.ప్ర.సాంఘిక సంక్షేమశాఖ అధికారిణి, ప్రవృత్తిరీత్యా కౌన్సిలింగ్ అండ్ రీహాబిటలైజేషన్ సైకాలజిస్ట్, సైకాలజిస్ట్ ఇన్ శ్రవణం బధిరుల శాఖ. మనసు తలుపు తెరిస్తే కథాసంపుటి, సౌగంధిక జాజరలు కవితా సంపుటి, ది డిజైనర్ బేబి నవల, శ్రీ చందన స్వరాలు ఆడియో సీడి వెలువరించారు. మనసు తెలుసుకుందాం రా, మీరూ-మీ మనస్తత్త్వం,ఆనంద నిలయపు నీడలో విడుదలకు సిద్ధంగా ఉన్నవి. టీవి లో 301 మనోవిజ్ఞానశాస్త్ర కార్యక్రమాలు,190 రేడియో ప్రోగ్రాములు చేశారు. గానకోకిల,నాట్య మయూరి, లలితకళాప్రావీణ్య బిరుదులు, ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ అవార్డు, మహిళాశిరోమణి, కావ్యశిరోమణి, కావ్యశ్రీ, మనోవిజ్ఞాన రత్న, మనోవిజ్ఞానశ్రీ, కళామిత్ర మొ.పురస్కారాలు అందుకున్నారు. వీణకు యువపురస్కార్,సైకాలజీ కి నేషనల్ అవార్డ్ పొందారు. చిరునామా : 6-8-1001 , ఎన్ జి ఒ కాలని, తిరుపతి-చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, పిన్:517507

**కామేశ్వరి సిహెచ్. :** వ్యాపారం, పోయిరా తల్లీ పోయిరామ్మా, పాపం కోమలి, జీవితమే నాటకమయితే అనే కథలు రచించారు.

**కామేశ్వరి. డి. :** జన్మస్థలం కాకినాడ. 1935,ఆగష్టు 22వ తేదీన జన్మించారు. సీనియర్ కథారచయిత్రి. తూర్పుగోదావరి జిల్లా రామచంద్రాపురంలో చదువుకున్నారు. 11 కథా సంపుటాలు, 21 నవలలు, సుమారు 300 కథలు, 30 కవితలు, 1 కవితా సంపుటి రచించారు . కొత్తమలుపు నవల న్యాయం కావాలి సినిమాగా, కోరికలే గుర్రాలైతే నవల అదే పేరుతో సినిమాగా వచ్చాయి. కొన్ని నవలలు టెలీఫిల్ములుగా, టీవీ సీరియళ్ళుగా వచ్చాయి. నా విదేశీయాత్రానుభవాలు కూడా వ్రాశారు. పురస్కారాలు, గృహలక్ష్మి స్వర్ణకంకణము, మద్రాస్ తెలుగు అకాడమీ అవార్డు, మాదిరెడ్డి సులోచన అభినందన అవార్డు, తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ రచయిత్రి అవార్డు(3సార్లు), నంది పురస్కారం టీవీ చిత్రాల విభాగంలో ఉత్తమ కథారచయిత, ఎండమావులు నవలకు గోపీచంద్ అవార్డు, సుశీలా నారాయణరెడ్డి అవార్డులు పొందారు.

**కాశీరత్నం వాసిరెడ్డి :** జన్మస్థలం కృష్ణాజిల్లా నందిగామ తాలూక వీరులపాడు గ్రామం. 1932 వ సం.లో పాటిబండ్ల రామకృష్ణయ్య భ్రమరాంబ దంపతులకు జన్మించారు. 15సం. వయసు నుండీ కథలు, కవితలు రాయడం ప్రారంభించారు. మల్లాది సుబ్బమ్మగారి ప్రోత్సాహంతో మహిళా విజయ పత్రికను ప్రారంభించి, ఎడిటర్గా ఎంతో రచనానుభవాన్నిసంపాదించారు. మగువ మనసూ అనే 14 కథల సంపుటి; మనిషీ మనుగడ, దూరతీరాలు, చీకటి కోణాలు, అమెరికా యాత్ర, సృష్టి రహస్యం అనే నవలలు; వ్యాస సంకలనం; గేయ సంకలనం; కవితలు వ్రాశారు. మద్రాసు ఆకాశవాణిలో హిందీ పాఠాలు చెప్పేవారు, విజయవాడ ఆకాశవాణిలో వనితాజ్యోతికి ఏడు సంవత్సరాలు కరస్పాండెంటుగా పనిచేశారు. స్త్రీలను కథా వస్తువుగా పెట్టుకుని మహిళాభ్యుదయానికై పాటుబడ్డారు. శ్రీ.శే. ఎన్.టి.రామారావుగారి చేతుల మీదుగా నీలం కృష్ణారావుగారి అవార్డును అందుకున్నారు

**కాశీవిశాలాక్షిదేవి తెన్నేటి :** జన్మస్థలం విజయవాడ. తెన్నేటి కాశీవిశాలాక్షిదేవి ప్రసిద్ధ తెలుగు రచయిత్రి. తెన్నేటి అన్నపూర్ణమ్మ, తెన్నేటి సీతారామయ్య దంపతులకు జన్మించారు. విద్యాభ్యాసం మొత్తం విజయవాడలోని మాంటిస్సోరి విద్యా సంస్థల్లో జరిగింది. అర్థశాస్త్రంలో, ఆంగ్లంలో ఎం.ఎ., తరువాత ఎం.ఇ.డి చేశారు. భర్త వియోగి కలం పేరుతో రాసే ప్రముఖ రచయిత కోపల్లె విజయప్రసాదు, మామగారు శ్రీరాగి, ఆడపడుచు రమ్య మంచి రచయితలు. కవిత, కథానిక, నాటిక ప్రక్రియలలో రచనలు చేసింది. పిల్లలకు గేయాలు రాయటమే కాదు, వారితో గేయ నాటికలు వేయిస్తున్నారు. రచనలు రెండు నాలుకలు అనే కథా సంపుటిని, బంగారు భవిత అనే నాటికల సంపుటిని వెలువరించారు. కథలు, కవితలు వివిధ పత్రికలలో అచ్చయ్యాయి.

**కిరణ్మయి జంధ్యాల :** మధుర గాయని, కవయిత్రి, రిటైర్డ్ లెక్చరర్, మచిలీపట్నం. నాటక విశ్లేషకుడు జంధ్యాల రాధాకృష్ణమూర్తిగారి భార్య.

**కిరణ్మయి పి. :** రావి రంగారావు మినీకవితలు ఒక పరిశీలన (సాహితీ మిత్రులు, మచిలీపట్టణం,2009) అనే అంశంమీద పరిశోధన చేశారు.

**కుమారి నీరజ పి.డా. :** అసిస్టెంట్ ప్రొఫెసర్, గవర్నమెంట్ డిగ్రీ కాలేజి, పుత్తూరు. ఫోన్.9885248649.

**కుమారి మాదిరాజు బిందు వేంకట దత్తశ్రీ,** బి.టెక్ కవయిత్రి, గాయకురాలు, భగవద్గీతలో 300 లకు పైగా సభలలోను, దేశ, విదేశాల్లో12 అంతర్జాతీయ

సభలలోను పాల్గొనడం... ప్రస్తుతం టిసియస్‌లో ఉద్యోగం.. చిరునామా: యాకమూరు పోస్ట్, తోట్లవల్లూరు మండలం,ఉయ్యూరు (వయా), పిన్: 521165. కృష్ణా జిల్లా. ఫోన్: 8686609670.

**కుసుమ కుమారి కొండా :** జన్మస్థలం విజయవాడ. 10.1.1950న జన్మించారు. సుమ పేరుతో చాలా కథలు రాసారు. కొన్ని కథలకు బహుమతులు వచ్చాయి. ఇది రామరాజ్యం, రేపటిరోజు, ఆనందోబ్రహ్మ, ఓడిపోను మొదలైనవి.

**కుసుమ కుమారి పి. :** జన్మస్థలం గుంటూరుజిల్లా పెనుకుదురుపాడు. 14.4.1955న జన్మించారు. శిరీష, వాగ్దేవి పేర్లతో కథలు, నాటికలు, బాలల గేయాలు, వ్యాసాలు రచించారు. నావ మునిగింది, విలువలు, నర్సాపూర్ కుర్చీ మున్నగునవి వెలువరించారు.

**కృపాబాయి గొల్ల మేరీ :** జన్మస్థలం కృష్ణాజిల్లా మచిలీపట్నం. 1962 ఫిబ్రవరి 20న జన్మించారు. ఎం.ఏ.; బి.ఇడి.చేశారు. బందరు హిందూకళాశాలలో పొలిటికల్ సైన్స్ లెక్చరర్గా పనిచేస్తున్నారు. 200 కథానికలు; 50 వివిధవిషయాలపై వ్యాసాలు; 100 కథానికల కదంబం కథాంజలి; కృపాంజలి అనే చిరుగ్రంథం వెలువరించారు.

**కృపాబాయి టి. :** వ్యాసకర్త, విమర్శకురాలు. దొరోరి న్యాయం అనే కథ వ్రాశారు.

**కృపావరం కత్తి :** నరసం ప్రకాశం జిల్లా కార్యదర్శి, విశ్రాంత మహిళాభివృద్ధి శిశు సంక్షేమ శాఖ జిల్లా అధికారి. ఫోను నం. 9652286966.

**కృష్ణ కుమారి చెరుకూరి (రావాడ) :** జన్మస్థలం విశాఖ జిల్లా మాడుగుల. 3.6.1965లో జన్మించారు. ఉపాధ్యాయిని. కథలు, కవితలు, వ్యాసాలు, భక్తిపాటలు పత్రికలలో ప్రచురితమవుతున్నాయి. చిరునామా: ఇం.నం.110/ఎ, బోను వీధి, సాలూరు, విజయనగరం–535591.

**కృష్ణ కుమారి మాడుగుల :** జన్మస్థలం విజయవాడ. నవలా రచనలో సిద్ధ హస్తులు.

**కృష్ణకుమారి నాయని :** జన్మస్థలం గుంటూరు జిల్లా. 1930, మార్చి 14న జన్మించారు. నాయని కృష్ణకుమారి ప్రముఖ కవి నాయని సుబ్బారావు కుమార్తె. తల్లి హనుమాయమ్మ. గుంటూరు జిల్లాలో బి.యే. చదువుతున్న రోజులలో ఆంధ్రులచరిత్ర క్లాసులో రాసుకున్న నోట్సు ఆధారంగా18 ఏళ్ల వయసులో "ఆంధ్రులకథ" పుస్తకం రాసి ప్రచురించారు. ఆపుస్తకం ఆనాడు స్కూళ్లలో పాఠ్యపుస్తకంగా తీసుకున్నారు. విశాఖలో తెలుగు యం.ఎ. తరువాత, మద్రాసులో ఒక ఏడాది లెక్చరరుగా పనిచేసి, ఆపై హైదరాబాదు వచ్చి స్థిరపడ్డారు. తెలుగు

జానపదసాహిత్యంలో పరిశోధన చేసి, పి.హెచ్.డి. పట్టాపొందారు. "జానపదగేయగాథలు" వీరి సిద్ధాంతగ్రంథం, 1977లో అచ్చయ్యింది. ఉస్మానియా యూనివర్సిటీలో ఆచార్యులుగా, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్'ఛాన్సలర్గా పనిచేశారు. అగ్నిపుత్రి, ఆయాతా (కథల సంకలనం), ఏం చెప్పను నేస్తం? (కవితాసంకలనం), పరిశీలన (వ్యాససంకలనం), పరిశోధన (వ్యాససంకలనం. ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రచురణ), తెలుగు జానపద వాఙ్మయము. సంఘము, సంస్కృతి, సాహిత్యం. పరిశోధన గ్రంథం. (పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయము),జానపద సరస్వతి. (జానపద సాహిత్య పరిషత్), కృష్ణకుమారి సాహిత్య విమర్శలు, కాశ్మీర దీపకళిక (యాత్రాచరిత్ర) రచించారు. గృహలక్ష్మి స్వర్ణకంకణం, పొట్టి శ్రీరాములు తెలుగు యూనివర్సిటీ ఉత్తమ రచయిత్రి బహుమతి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ బహుమతి పొందారు . 2016, జనవరి 30 న మరణించారు.

**కృష్ణకుమారి పి.** : జన్మస్థలం పశ్చిమగోదావరిజిల్లా నర్సాపురం. 18.1.1952న జన్మించారు. రాసిన 10 కథలు ప్రముఖపత్రికలో ప్రచురించబడ్డాయి. చిత్రం, మెర్సీ కిల్లింగ్ మొదలైనవి రచనలు.

**కృష్ణజయంతి ఎస్వీ.** : జన్మస్థలం గుంటూరు. 1979, జనవరి 6న జన్మించారు. కథలు, కవితలు, వ్యాసాలు పలు దిన, వార, మాస పత్రికలలో ప్రచురించబడ్డాయి. ప్రస్తుతం హైదరాబాదులో స్థిరపడ్డారు. భర్త యస్వీకృష్ణ కూడా పేరొందిన రచయిత. రచించిన అనేక కథలు బహుమతులను గెలుచుకున్నాయి. దృష్టి కథాసంపుటి మీద నాగార్జున విశ్వవిద్యాలయంలో ఎం.ఫిల్ స్థాయి పరిశోధన జరిగింది. భారత ప్రభుత్వపు సాంస్కృతిక శాఖవారి ఫెలోషిప్ తెలుగు సాహిత్యంలో లభించింది. రచనలు 50వసంతాల తెలుగు కవిత... వస్తువు రూపం శిల్పం (విమర్శ), దృష్టి (కథాసంపుటి), అభిమాని (నవల), వ్యూహం (నవల), పడమటి సూర్యోదయం (కథాసంపుటి), మరీచిక (కవితాసంపుటి). ఇంకా 50 వరకు కథలు వివిధ పత్రికలలో ప్రచురింపబడ్డాయి, వివిధ సంస్థలచే బహుమతులు పొందారు. కొన్ని కథలు కన్నడంలోనికి అనువాదమయ్యాయి.

**కృష్ణప్రియ ఉపద్రష్ట** : జన్మస్థలం తూ.గో.జిల్లా కపిలేశ్వరపురం.. హాపీ న్యూ యియర్, అది గృహమ్, శివరంజని, గాయం, డొక్కు సైకిలు' అనే కథలు వ్రాశారు. అసలుపేరు సుబ్బలక్ష్మి.

**కృష్ణవేణమ్మ గంటి :** గిరిజా కళ్యాణము, జ్ఞానాప్రసూనాంబికా శతకము, సైరంధ్రి, నిర్వేదము, తెలుగుతల్లి రచించారు. 1950సం.లో గృహలక్ష్మి స్వర్ణకంకణ గౌరవాన్ని పొందారు. 1977లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ అవార్డును అందుకున్నారు.

**కృష్ణవేణమ్మ గంటి :** ప్రొద్దుటూరు పట్టణానికి చెందిన గంటి కృష్ణవేణమ్మ గొప్ప కవయిత్రి. తండ్రి కల్లూ రామశర్మ. తల్లి సుబ్బలక్ష్మమ్మ కవయిత్రి. చంద్రకళా విలాసము అనే ప్రబంధాన్ని రచించింది. ఈ గ్రంథం విద్వాన్ పరీక్షకు పాఠ్యగ్రంథంగా ఉండేది. గంటి కృష్ణవేణమ్మ భర్త గంటి వెంకటసుబ్బయ్య కూడా గొప్ప పండితుడు. హిందీ విద్యాపీఠం వార్ధా నిర్వహించే భాషాకోవిద వరకు చదివింది. ఇంగ్లీషు, కన్నడ భాషలలో కూడా కొంత ప్రవేశముంది. గృహలక్ష్మి, భారతి, త్రివిజ్ఞ పత్రికలలో పద్యఖండికలను ప్రచురించింది. గృహలక్ష్మి పత్రికాధిపతులు స్వర్ణకంకణం బహూకరించి 'సరసకవయిత్రి' అనే బిరుదుతో సత్కరించారు. తన 86వ యేట ప్రొద్దుటూరులో మరణించింది. రచనలు సైరంధ్రి (పద్యకావ్యము), గిరిజాకళ్యాణము, పవనద్యూతము, రాజరాజేశ్వరీ శతకము, కామాక్షీ శతకము, శ్రీ జ్ఞానప్రసూనాంబికా శతకము, తలపోత.

**కృష్ణవేణి పంచాగ్నుల :** భర్త హరిప్రసాద్ శర్మ, తెలుగు ఉపాధ్యాయులురాలు, రచయిత్రి. చిరునామా : అనిత అపార్టుమెంట్, టిఎఫ్-4, నాలుగుస్తంభాల సెంటర్, ఆంధ్రాభ్యాంకు దగ్గర, విద్యాధరపురం, విజయవాడ-1. సెల్ : 8522820396.

**కృష్ణా కొమాండూరు డా. :** రెండు దశాబ్దాలుగా తెలుగు అధ్యాపకత్వం. తెలుగు, తమిళ భాషలలో ప్రావీణ్యం. అనేక ఆధ్యాత్మిక, ధార్మిక కార్యక్రమాల నిర్వహణ శ్రీ సి. రాఘవచారిగారి విశాలాంధ్ర సంపాదకీయాలపై పరిశోధన చేసి ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం నుండి పిహెచ్‌డి పట్టా పొందారు.

**కృష్ణాజమ్మ :** 17 వ శతాబ్దం, విజయరాఘవుని ఆస్థాన కవయిత్రి. రావినూతల తిరుమలయ్య కుమార్తె.

**కోకిలాంబ గుత్తికొండ :** సాహిత్యాభిమాని, సంఘ సేవకురాలు కృష్ణాజిల్లా రచయితల సంఘంలో చురుకైన కార్యకర్త. పలు సమాజ సేవా కార్యక్రమాలు నిర్వహించినందుకు రోటరీక్లబ్, లయన్స్‌క్లబ్, ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ, ఆంధ్ర సారస్వత సమితి, ఇండియన్ డ్రమెటిక్ అసోసియేషన్ మొదలైన సంస్థలచే సత్కార స్వీకారం. పలువురు కవుల్ని, కవయిత్రుల్ని ఆర్థికంగా, హార్దికంగా ప్రోత్సహిస్తున్న వదాన్య శిరోమణి. చిరునామా : చిన్నకళ్లేపల్లి (పోస్టు), ఘంటసాల మండలం, కృష్ణాజిల్లా. చరవాణి : 8179515722.

**కోటేశ్వరమ్మ కొండపల్లి :** జన్మస్థలం కృష్ణాజిల్లా పామర్రు. 1920లో పుట్టారు. ఆత్మకథా రచయిత్రి. స్వశక్తితో తన కాళ్ళపై తాను నిలబడడానికి నిశ్చయించుకొని, పెద్దవయసులో మెట్రిక్ చదవడానికి ఆంధ్ర మహిళా సభలో చేరారు. ఫీజులకు డబ్బు సరిపోక రేడియో నాటకాలలోనూ, కార్యక్రమాలలోనూ పాల్గొంటూ, కథలు వ్రాస్తూ సంపాదించుకునేవారు. పరీక్షలు వ్రాసి మెట్రిక్ పాసయ్యారు. కాకినాడ గవర్నమెంట్ పాలిటెక్నిక్ కాలేజ్ గరల్స్ హాస్టల్లో మేట్రన్ ఉద్యోగంలో చేరారు. కాకినాడలో సాహిత్య సభలలో పాల్గొంటూ రచనావ్యాసంగం చేయటం మొదలుబెట్టారు. "నిర్జనవారధి" అద్భుతమైన ఆత్మకథ. వంద వసంతాలు చూసిన కోటేశ్వరమ్మ, మన చరిత్రలోని కొన్ని ముఖ్యఘట్టాలకు ప్రత్యక్ష సాక్షి. చాలా సరళంగా, నిజాయితీగా వ్రాసిన ఈ పుస్తకం వేగంగా చదివిస్తుంది. అనుబంధాలుగా సుందరయ్య, చంద్ర రాజేశ్వరరావు, మద్దుకూరి చంద్రశేఖరరావు, సుంకర సత్యనారాయణ, తాపీ రాజమ్మ, మోటూరు ఉదయం వంటి తొలితరం కమ్యూనిస్టు నాయకుల గురించి కోటేశ్వరమ్మ వ్రాసిన స్మారక వ్యాసాలు, వివిధ సందర్భాల్లో వ్రాసిన ఇతర వ్యాసాలు, 'చందు పెంచిన చెట్టు, మనది తెలుగు దేశమమ్మా' అనే కవితలు కూడా ఉన్నాయి. ఈ వ్యాసాలలో ఉన్న విషయాలు (ముఖ్యంగా ఉదయంగారి గురించిన వ్యాసం) చదువుతుంటే, కోటేశ్వరమ్మ ఈ పుస్తకంలో తన అనుభవాల్ని కొద్దిగానే చెప్పారనీ, ఆవిడకు తెలిసిన విషయాలన్నీ చెప్పి ఉంటే, ఇది నిజంగానే పెద్ద గ్రంథమే అయ్యేదనీ, ఆ కాలపు చరిత్రను మరింత క్షుణ్ణంగా తెలుసుకోవటానికి వీలయ్యేదనీ అనిపిస్తుంది.

**కోదండరెడ్డి దేవకి :** జన్మస్థలం అనంతపురం. జననం. 1.7.1951. ఆచార్య మహాసముద్రం. శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయ విశ్రాంతాచార్యులు. తెలుగు బాలసాహిత్యం మీద పి.హెచ్.డి.పరిశోధక గ్రంథం వెలువరించారు. తారంగం తారంగం, గోరుముద్దలు వంటి పలు బాలసాహిత్య పుస్తకాల రచయిత్రి. వీరి జాతిరత్నాలు ఆం. ప్ర. ప్రభుత్వ ప్రచురణగా 9వ తరగతి తెలుగు ఉపవాచకంగా ఉంది. జానపద వైద్యవిధానాలు, జానపద సాహిత్యం, దాక్షిణాత్య సాహిత్యం, ఇర్లచెంగి కథలు ప్రచురించారు. 10గ్రంథ సంకలనాలు వెలువరించారు. 149 వ్యాసాలు, 12 పీఠికలు రచించారు. 39 ఆకాశవాణి ప్రసంగాలు చేశారు. ఆం.ప్ర.ప్రభుత్వ ఉగాది పురస్కారం, తెలుగు విశ్వవిద్యాలయ ఉత్తమ రచయిత్రి పురస్కారం, భారత మహిళా శిరోమణి, విశిష్ట తెలుగు మహిళ, సీతామహాలక్ష్మి అవార్డ్, ఆచార్య బిరుదురాజు రామరాజు అవార్డ్, కళామిత్ర పురస్కారాలు పొందారు.

**కౌసల్యాదేవి(కోడూరి)ఆరెకపూడి :** జన్మస్థలం కృష్ణాజిల్లా దివిసీమలోని 'కోడూరు' గ్రామం. 1942 సం.లో జన్మించారు. సుప్రసిద్ధ కథ, నవలా రచయిత్రి. 1958లో 'దేవాలయం' అనే కథ ద్వారా రచనావ్యాసంగాన్ని మొదలుపెట్టారు. 1961లో తన 19యేట మొదటి నవల "చక్రభ్రమణం"ను వ్రాశారు. ఈ నవలకు ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక నవలల పోటీలో మొదటి బహుమతిని గెల్చుకున్నారు. ఈ నవలను "డాక్టర్ చక్రవర్తి" పేరుతో సినిమాగా తీసారు. "ప్రేమనగర్, చక్రవాకం, శంఖుతీర్థం" నవలలు కూడా అవే పేర్లతో సినిమాలుగా వచ్చాయి. నవలలు అనామిక, కళ్యాణమందిర్, చక్రభ్రమణం, చక్రనేమి, చక్రవాకం, ప్రేమనగర్, బదనిక, బృందావనం, శంఖుతీర్థం, సత్యం శివం సుందరం, స్వయంసిద్ధ మొదలైన 34 నవలలు వ్రాశారు. కథాసంపుటాలు కౌసల్యాదేవి కథలు, సుప్రభాతం, కల్పన, చెట్టూఛాయా, శోభకృతు, విద్య. కథలు 1+1=?, అందని ద్రాక్షపళ్లు, అమ్మమ్మగారూ ఆపిల్ చెట్టూ, శోభకృతు, సంకెళ్ళు' మొదలైన 44 కథలు రచించారు. పురస్కారాలు 1961 ఆంధ్రప్రభ నవలల పోటీలో మొదటి బహుమతి, 1967 గృహలక్ష్మి స్వర్ణకంకణము.

**గంగ్వార్కర్ కవిత :** తెలుగు ఉపాధ్యాయిని, చిరునామా: 1-7/5,టీచర్స్ కాలనీ, బ్రిల్లియంట్ స్కూల్ దగ్గర, షాద్ నగర్, రంగారెడ్డి జిల్లా, పిన్: 509216

**గాయత్రి పెండ్యాల :** తెలుగు ఉపాధ్యాయిని, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, కనిగిరి, ప్రకాశం జిల్లా. సాహిత్యాధ్యయనం, రచనలు చేయడం అభిరుచులు.

**గాయత్రి పెండ్యాల :** చిరునామా. ఎస్.ఎ.తెలుగు,ప్రభుత్వ ఉన్నత పాఠశాల, కనిగిరి, ప్రకాశం జిల్లా.

**గాయత్రి, వి. :** వార్తకవి(శ్రీపాద) గాయత్రి: జన్మస్థలం ఏలూరు. 28.9.1936న జన్మించారు. బి.ఏ.(ఆనర్స్) చదివి, సంగీతంలో కృషి చేశారు. మాజానీ, మా పొరుగింటి తపస్విని, గెలుపెవరిది?, పెంపకం అనే కథలు వ్రాశారు.

**గాయత్రీ దేవి వేదాల డా :** గోదా వాగ్వంశి, అభినవ మొల్ల బిరుదాంకితులు. శ్రీవ్రతం, గరుడాచల మాహాత్మ్యం, కవన మంజూషలు ముద్రించారు. తిరుప్పావై ప్రవచనాలు చేస్తారు. ఆకాశవాణి విశాఖలో రేడియో ప్రసంగాలు చేశారు. పలు కవిసమ్మేళనాలలో కవి సత్కారం పొందారు. చిరునామా : 5-76/ఎ, టీచర్స్ కాలనీ, తరిగొండ వెంగమాంబ సాహిత్య పీఠం, నక్కపల్లి, విశాఖ జిల్లా. ఫోను: 9885871464.

**గాయత్రీదేవి అల్లంరాజు :** పురాణపండ గాయత్రీదేవి 10-10-1960న జన్మించారు. ఆయుర్వేద వైద్యులుగా ప్రసిద్ధులు.

**గీత కె డా. :** జన్మస్థలం గోదావరి జిల్లా జగ్గంపేట. ప్రఖ్యాత స్త్రీవాదకవయిత్రి. అసలు పేరు గీతామాధవి. అమెరికాలో నివాసముంటున్నారు తల్లి శ్రీమతి కె.వరలక్ష్మి ప్రఖ్యాత రచయిత్రి. గీత, తన రచనా వ్యాసంగాన్ని 1988నుంచి కొనసాగిస్తున్నారు. కవిత్వంతో ప్రారంభించినా, కథలు, వ్యాసాలు, కాలమ్స్, ట్రావెలాగ్స్, సీరియల్స్ రాసారు. కవితా సంపుటులు ద్రవ భాష, శీత సుమాలు, శతాబ్ది వెన్నెల, గీతా కాలం, అనగనగా అమెరికా, 2013-14 లలో కాలమ్, నా కళ్లతో అమెరికా(నెలనెలా ట్రావెలాగ్స్), సిలికాన్ లోయ సాక్షిగా (కథలు), వెనుతిరగని వెన్నెల (ధారావాహిక నవల), ప్రచురితమైన కవితలు, కథలు, వ్యాసాలు అనేకం. పురస్కారాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు, అజంతా అవార్డు (ద్రవభాష ), సమతా రచయితల సంఘం అవార్డు, రంజనీ కుందుర్తి, దేవులపల్లి అవార్డులు పొందారు.

**గీత పసుపులేటి :** చిత్తూరుజిల్లా శ్రీకాళహస్తిలో 19.7.1964న జన్మించారు. కవయిత్రి, రచయిత్రికూడా. పిల్లల కోతి, గజీతగాడు, పసిరి మొగ్గ మొదలైన కథలు వ్రాశారు.

**గీతాదేవి కాశినేని :** 8.3.1950న జన్మించారు. కలం పేరు కె.జి.దేవి. అనేక పత్రికలలో కవితలు ప్రచురింపబడ్డాయి. ఆకాశవాణిలో, ఇతర వేదికలపై గాయనిగా అనుభవం ఉంది. చిరునామా: ఇం.నం. 4/396,4 వ రోడ్, అనంతపురము-515004. ఫోను నం. 9440230401.

**గీతామాధురి దీవి.** 27.8.1988న కృష్ణాజిల్లా గుడివాడలో జననం.మన దేశంలో ఇద్దరు రచయిత్రులు కలిపి ఒక నవలను ఇంగ్లీష్ లో రాసిన మొదటి రచయిత్రి. సైకలాజికల్ థ్రిల్లర్ "ఫ్రోజెన్ సమ్మర్" గా ప్రపంచవ్యాప్తంగా విడుదల అయిన ఆ పుస్తకం ఒక సంచలనం. ఇంకా 12 మంది ప్రపంచ రచయితలతో కలిసి ముద్రించిన మరో ఆంగ్ల కథల పుస్తకంలో టైంస్ లాస్ట్ అట్లాస్ కథ వ్రాశారు.అనేక ప్రముఖ పత్రికలలో వీరి ఇంటర్వ్యూలు ప్రచురితం అయ్యాయి. ప్రస్తుతం సాఫ్ట్ వేర్ ఉద్యోగిగా ఉంటూనే ఇండియామిస్టిక్.కాం అనే వెబ్ సైట్ నడుపుతున్నారు.యు ట్యూబ్లో వీరి పర్యావరణ సంబంధ వీడియోలు చూడవచ్చు.జాతీయ స్థాయి యువ రచయితల పోటీలో విజేతగా నిలిచారు.

**గురుజాడ రాజరాజేశ్వరి డా.:** బందరు పద్మావతీ మహిళా కళాశాలలో ఉపన్యాసకులుగా ఉన్నారు. రాజగోపాల విలాసము-ఒక పరిశీలన అంశంపై పరిశోధనకు ఎం.ఫిల్., తూమాటి దొణప్ప బంగారు పతకము పొందారు. గురుజాడ రాఘవ శర్మ రచనలు-ఒక పరిశీలన అంశంపై పరిశోధనతో పి.హెచ్.డి పట్టా పొందారు. పి.హెచ్.డి. గ్రంథం ముద్రింపబడింది. కథలు, కవితలు, పద్యాలు, సన్మాన పత్రాలు రాస్తారు.

**గౌరీలక్ష్మి అల్లూరి :** జన్మస్థలం తూ.గో.జి. అంతర్వేదిపాలెం. విజయవాడలో నివాసం. మనోచిత్రం, వసంత కోకిల, కొత్తచూపు కథాసంపుటాలు; అనుకోని అతిథి నవలిక; నిలువుటద్దం, నీరెండదీపాలు కవితాసంపుటాలు ప్రచురించారు. భావ వల్లరి, రంగుల హేలల కాలమిస్ట్ గా ఉన్నారు. ఎదలోపలి ఎద, అంతరగానం సీరియల్స్‌గా వచ్చాయి. రాజకీయ వ్యంగ్య రచనలు, వ్యాసాలు పత్రికలలో ప్రచురితమవుతున్నాయి.

**జ్ఞానాంబ(మాంబ) :** జన్మస్థలం కృష్ణాజిల్లా బెజవాడ. 5.5.1895 'శేషమాంబా సుబ్బరాయ' దంపతులకు జన్మించారు. తపస్విని, తత్త్వవేత్రి, కవయిత్రి, మోక్షమార్గ ప్రదర్శనావకాశాన్ని పేరులోనే ఇమిడించుకుని రచనలు చేశారు. ఇంటిపేరు తెలియదు. బెజవాడ కనకదుర్గాంబ వర ప్రసాదమైన ఈబిడ్డ అక్షరాభ్యాసము చేసిన పదిహేను రోజులకే చూచిన పుస్తకమెల్ల చదవడం, చెప్పిన దాని నెల్లా నిరాఘాటంగా రాయడం; విన్నది, చెప్పినదీ జ్ఞప్తిలో ఉంచుకోవడం ఇవన్నీ తెలిసినవారు ఆశ్చర్యపోయేవారు. ఏకసంథాగ్రాహిణిగా పేరొందింది. ధారణాశక్తి, ప్రకృతిపరిశీలనము, అన్నింటను మించిన పరమేశ్వర భావము నొండొంట తోడుపడి, ఉత్తమకవయిత్రిని జేసినవి. పిన్ననాడే తన తోటి వారికి, పెద్దలకు కూడా భక్తి జ్ఞాన విషయాల్ని బోధించేది. 12వ యేటనే శ్రీ సీతారామావధూత గారిని పరమ గురువులుగా భావించి శుశ్రూష చేసింది. సంసారజీవనం త్యజించి, సన్యాసం పుచ్చుకున్నారు. అపుడామె గురువులు నిజ్ఞనాధిక్యం వల్ల జ్ఞానాంబ అని నామకరణం చేశారు. (పూర్వనామం తెలియరాలేదు.) చివరిరోజుల్లో బ్రహ్మమత ప్రవిష్ట అయ్యారు. ఇంద్రకీలాద్రిపై కొన్నేళ్లు తపస్సు చేశారు కూడా. రచనలు శ్రీరంగావధూత, శ్రీసీతారామావధూతల చరిత్రలు పద్యకావ్యాలుగా; చంద్రమ్మ కథ, పాటలు రచించారు. ఇంకా దేవుడు, విజ్ఞానామృతం, కాళీ ప్రసాదిని, సత్ప్రభు శతకము, గార్గి మొదలైన రచనలు చేశారు. వీటిలో 'దేవుడు' గీతమాలికలతో, లలితపద శోభితంగా, ధారావేగ పూరితంగా దైవతత్త్వాన్ని నాస్తికులైనా కాదనలేని వాదనాపటిమతో ప్రతిపాదించారు. ఇక 'ఙ్ఞినామృతము' ఆటవెలది పద్యాలతో, శతకం లాగా రచించారు. 'జ్ఞానమాంబ' మకుటంతో రచింపబడింది. 'కాళీ ప్రసాదిని' మరొక శతకం, ఇందులో ఆధ్యాత్మిక హృదయ సంస్కారం వెదజల్లబడింది. బోధన కూడా ఇందలి ప్రధానాంశం. 1975 వ సం.లో పరమపదించారు.

**చంద్రకళ మూలింట :** జన్మస్థలం చిత్తూరుజిల్లా అరగొండ. 6.9.1969న జన్మించారు. కర్నూలులో ఉద్యోగం చేస్తున్నారు. చూపుడు వేలు, ఒక ప్రయాణం, బతుకు గంప అనే కథలు కూడా వ్రాశారు.

**చంద్రకళ వై :** విజయవాడ. తులసీదాస్ రామాయణం తెలుగులోకి అనువదించారు. కవితలు పత్రికల్లో వివిధ సంకలనాల్లో అచ్చయ్యాయి.

**చంద్రకళ.వై :** ఫ్లాట్ నుం.303, వసంత్ గోవింద్ అపార్ట్ మెంట్స్, తులసినగర్-4. కానూరు, విజయవాడ.

**చంద్రకాంతమ్మ, అనుపూజ :** నవలా రచయిత్రి.

**చంద్రలత :** జన్మస్థలం కోస్తా ఆంధ్ర. వ్యవసాయ కుటుంబం. తెలంగాణాలోని ఆంధ్రాక్యాంపులో పెరిగింది. నెల్లూరులో స్థిరపడ్డారు. రచయిత్రి, మరియు అధ్యాపకురాలు. 1997 లో రాసిన 'రేగడి విత్తులు' అనే నవలకు తానావారి బహుమతి పొందారు. ఇంకా పలు కథాసంకలనాలు వెలువరించారు. ప్రభవ అనే పేరుతో చిన్నపిల్లల బడి నిర్వహిస్తున్నారు. వర్ధని, దృశ్యాదృశ్యం నవలలు. నేనూ నాన్ననవుతా, ఇదం శరీరం, వివర్ణం కథా సంపుటాలు. విరిగిన అల, పిల్లన గ్రోవి, పట్టు పువ్వులు, ప్రియమైన అమ్మా నాన్నా!, సాగు బాల సాహిత్యం. ఇతర విషయాలు సస్యపథం, తెలుగు వ్యవసాయ శాస్త్రవేత్తల జీవన పథం, చేపలెగరా వచ్చు, ఇతనాల కడవకు ఈబూది బొట్లు, వచ్చే దారెటు, మడతపేజీ.

**చంద్రశ్రీ :** జన్మస్థలం ఖమ్మం జిల్లా మామిళ్లగూడెం. 1966 ఫిబ్రవరి 23న జన్మించారు. దళిత కళాకారిణి మరియు కవయిత్రి. పీపుల్స్ వార్ కార్యకర్తగా మారారు. ఏకలవ్య కళామండలి స్థాపించి దళిత, బహుజన రాజకీయ సాంస్కృతిక ఉద్యమ విస్తృతికి కృషి చేశారు. దళిత మహిళాగానం, అనగనగా ఒక నేను (శివసాగర్ఆత్మకథ) వెలువరించారు. సుదీర్ఘ రాగాలతో పౌరాణిక నాటకపద్యాలను హృదయరంజకంగా గానం చేసేవారు. హైమావతీ భీమన్న నిర్వహించిన ప్రతిష్ఠాత్మక సాహిత్య సదస్సులో రాష్ట్ర గవర్నర్నరసింహన్ అంబేద్కర్సు ప్రభాతం' ఆల్బమ్ను ఆవిష్కరించి చంద్రశ్రీని అభినందించారు. కేన్సర్తో బాధపడి 7.7.2012 న చీరాల రామకృష్ణాపురంలో చనిపోయింది.

**చానమాంబ :** రణతిక్కనగా ప్రసిద్ధుడైన ఖడ్గ తిక్కనార్యుని భార్య.కవిత్రయంలో ఒకరైన తిక్కనామాత్యునికి వదిన, కవయిత్రి. "వగరకు వెన్నిచ్చినచో, నగరే నిను మగతనంపునాయకులెందున్? ముగురాడువారమైతిమి:/వగ పేటికి జలకమాడ వచ్చినచోటన్?" అని యుద్ధభూమినుంచి పారిపోయివచ్చిన భర్తను ఎద్దేవాచేసి రణరంగానికి తిప్పిపంపిన ధీరవనిత.

**చాయాదేవి అబ్బూరి :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'విజయవాడ'.1933లో సంప్రదాయ కుటుంబంలో జన్మించారు. ప్రముఖ తెలుగు కథా రచయిత్రి, స్త్రీవాద రచయిత

శ్రీమతి ఛాయాదేవి భర్త అబ్బూరి వరదరాజేశ్వరరావు రాజమండ్రివారు. వీరు కూడా ప్రముఖ తెలుగు రచయిత. 1951-53 మధ్య నిజాం కళాశాల నుండి ఎం.ఏ. చదివారు. 1953లో కాలేజీ మాగజైన్ లో ప్రచురించిన 'అనుభూతి' వీరి మొదటి కథ. అప్పటి నుంచి ఛాయాదేవి గారు చాలా వరకు మధ్య తరగతి కుటుంబాలలోని స్త్రీలు ఎదుర్కొనే సమస్యల గురించి, పురుషాధిక్యతకు లోబడిన స్త్రీల గురించి చాలా కథలు రాసారు. కొన్ని కథలు హిందీ, తమిళ, మరాఠి, కన్నడ భాషలలోకి అనువదించబడ్డాయి. వీరి కథల్లో బోన్సాయ్ బ్రతుకు, ప్రయాణం సుఖాంతం, ఆఖరికి ఐదు నక్షత్రాలు, ఉడ్రోజ్ కథలు చాలా ప్రసిద్ధి పొందాయి. బోన్సాయ్ బ్రతుకు కథని 2000 సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 10వ తరగతి తెలుగు వాచకంలో చేర్చింది. 'సుఖాంతం' అనే కథ నేషనల్ బుక్ ట్రస్ట్ వారి కథాభారతి అనే సంకలనంలో 1972లో ప్రచురించబడింది. 20 వ శతాబ్దంలో తెలుగు రచయిత్రుల రచనలు సంకలన గ్రంథం ఛాయాదేవి సాహిత్య అకాడమీ ద్వారా 2002లో ప్రచురించారు. ఛాయాదేవిగారు న్యూఢిల్లీలోని జవహర్ లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో డిప్యూటీ లైబ్రేరియన్గా పనిచేసి, 1982లో స్వచ్ఛందంగా పదవీ విరమణ చేశారు. 1993లో వాసిరెడ్డి రంగనాయకమ్మ సాహిత్య పురస్కారం, 1996లో మృత్యుంజయ పుస్తకానికి తెలుగు విశ్వవిద్యాలయం నుండి ఉత్తమ రచయిత్రి అవార్డు అందుకున్నారు. 2000 సంవత్సరంలో 'కళాసాగర్, పందిరి' సాహితీ పురస్కారాలు అందుకున్నారు. 2005 సంవత్సరంలో 'తనమార్గం' అనే కథాసంకలనానికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గెలుచుకున్నారు.

**చిన్నమాంబాదేవి (ఆండాళ్ళమ్మ) (1895) :** వచన గ్రంథ రచయిత్రి అయిన పద్మనాయక వంశస్థురాలైన 'రాణీ చిన్నమాంబ' కృష్ణాజిల్లా నూజివీడు' ప్రభువైన మేకా వెంకట రంగయ్యప్పారావు ప్రథమపుత్రిక. అసలు పేరు 'ఆండాళ్ళమ్మ'. పిఠాపురం ప్రభువు సూర్యరాయ మహీపతి బహద్దూరువారిని 1906, ఏప్రిల్ 2 న వివాహం చేసుకున్నారు. పిఠాపుర సంస్థానాచారాన్ని బట్టి, ఆండాళమ్మ అత్తింటికి వచ్చిన వెంటనే 'చిన్నమాంబా దేవి'గా తన పేరును మార్చుకున్నారు. చిరకాల రచయిత్రి. భర్త శ్రీరామచంద్రరావు, బాపట్ల నివాసం. గృహలక్ష్మి, జనవరి 1933 సంచికలో సంక్రాంతి రచించారు .

**చెలికాని చెల్లాయమ్మ :** 17వ శతాబ్ది, పార్థసారధి శతకం రచించారు.

**చైతన్య పింగళి :** జన్మస్థలం విజయవాడ. 1979లో జన్మించారు. స్త్రీ చైతన్య రచయిత్రి. విజయవాడ నుండి వెలువడిన 'ఎన్కౌంటర్' పత్రిక ఎడిటర్ పింగళి దశరథరామ్

గారి కుమార్తె. తల్లిపేరు 'సుశీల'. చిట్టగాంగ్ విప్లవ వనితలు అనే పుస్తకం కేంద్ర సాహిత్య అకాడమీ నుండి 2016లో యువ పురస్కారాన్ని అందుకున్నది. ఫిదా సినిమాకి కో రైటర్గాను; ఊసుపోదు ఊరుకోదు, ఫిదా ఫిదా పాటలు; నేల టికెట్ సినిమాలో బిజిలి, విన్నానులే వంటి పాటలు రాసింది. మనసులో వెన్నెల ఇతర రచన.

**చౌదారాణి అట్లూరి :** కృష్ణాజిల్లా గుడివాడ. 1930లో, జన్మించారు. కథా, నవలా రచయిత్రి, అనువాదకురాలు,, ప్రముఖ సాహితీవేత్త, సంఘ సంస్కర్త త్రిపురనేని రామస్వామి గారి చిన్న కూతురు, అట్లూరి పిచ్చేశ్వరరావుగారి భార్య. 'శాంతి స్వగతం, కాల్ నంబర్ 222444' అనే కథలు; 'అగ్నిపూలు, నిశ్శబ్దతరంగాలు' అనే నవలలు వ్రాసారు. ఆనాటి చెన్నైలో తన సొంత పుస్తకాల విక్రయశాలను ప్రారంభించి నడిపారు. 1996లో కన్ను మూశారు.

**ఛాయ తిమ్మరాజు(అబ్బూరి) :** జన్మస్థలం విశాఖపట్నం. 25.11.1944న జన్మించారు. న్యూఢిల్లీలోనూ, హైదరాబాద్లోనూ లెక్చరర్గా పనిచేశారు. ఒక నవల సీరియల్గా వచ్చింది. అసలు సంగతి మొదలైన కథలు పత్రికలలో ప్రచురింపబడ్డాయి. ప్రస్తుతమ్ యు.ఎస్.ఏ.లో ఉంటున్నారు.

**జగదీశ్వరీమూర్తి :** జన్మస్థలం విజయనగరం. ముంబైలో నివాసం. కథలు, కవితలు రాస్తారు. పాటలు రాసి స్వయంగా కంపోజ్ చేసి ముంబైలో అనేక వేదికలమీద పాడి సి.డి.లుగా ఆవిష్కరించారు. శ్రీ సామవేదం షణ్ముఖశర్మగారు రెండు సి.డి.లు చేయించుకుని స్వయంగా వెలువరించడమేకాక రెండు పాటలు టైటిల్ సాంగ్స్ గా వేసి స్వయంగా సన్మానించారు.ముంబైలోని అనేక పత్రికల్లో కవితలు ప్రచురితమయ్యాయి. చిరునామా: విఘ్నహర్ సంకుల్,101, బిర్లా కాలేజీ రోడ్, కోటక్ బ్యాంక్ పక్కన, కళ్యాణ్, (పశ్చిమ), ఫోను నం. 8779488106, 8097622021.

**జమున సోమిరెడ్డి :** జమున నెల్లూరులో 23.9.1947న జన్మించారు. 17 కథలను ఒక సంకలనంగా మౌఢ్యమా వర్ధిల్లకు అనేపేరుతో ప్రచురించారు. ఇంకా చర్విత చరణం(కథ), ఎక్కడుందీ లోపం అని మరొక సంకలనం వ్రాశారు.

**జయ ఎస్. :** జన్మస్థలం కర్నూలుజిల్లా నందికొట్కూరు. 16.12.1954న జన్మించారు. బి.ఏ.; ఎంఎల్. చదివారు. కమ్యూనిస్ట్ కార్యకర్తగా పని చేశారు. విమోచన, నలుపు పక్ష పత్రికలలో పనిచేశారు. ప్రస్తుతం అన్వేషి సంస్థలో కోఆర్డినేటర్గా

పనిచేస్తున్నారు. 14 కథల సంపుటిగా రెక్కలున్న పిల్ల అనే కవితా సంపుటి వ్రాశారు. ఇంకా స్త్రీవాద కవితలు, వ్యాసాలు, కథలు వ్రాశారు.

**జయంతి పురాణపండ** : జన్మస్థలం విజయవాడ దగ్గరలోని పల్లెపాలెం. 7-7-1964న జన్మించారు. ఎం.ఏ. చదివి ఉద్యోగంచేస్తూ, రిసెర్చ్ చేస్తున్నారు. బ్రహ్మమాయ, పరామర్శ మొదలైన కథలు వ్రాశారు.

**జయంతి వల్లూరుపల్లి** : ప్రిన్సిపాల్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, విజయవాడ. ఆకాశవాణి బి.హై గ్రేడ్ కళాకారిణి. వివాహ వ్యవస్థ, వరకట్న సమస్య, బాలికలు వివక్షత, కుటుంబ సంక్షేమం. స్త్రీ అష్టావధానం రచించారు. టివి చానళ్ళ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. ఉత్తమ నటి, ఉత్తమ సేవాధర్మ అవార్డులు పొందారు. చిరునామా: 48-8-6బి, గరుడ క్రెస్ట్ అపార్ట్ మెంట్, బైబిల్ స్కూల్ రోడ్, ఫ్లాట్ నం.110, గుణదల, విజయవాడ-4.

**జయప్రద (పెళ్ళకూరు) సోమిరెడ్డి** : జన్మస్థలం నెల్లూరు. 22.1.1944న జన్మించారు. ఇదా నువ్విచ్చే తీర్పు, పరమపద సోపానం, ఛాయ(5కథలు), మెడికల్ కథలు(11కథలు), సృష్టిలో తీయనిది(12కథలు), ప్రమిద(17 కథలు) సంపుటాలు రచించారు.

**జయప్రదాదేవి ఆవుల** : జన్మస్థలం కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా, 'బొమ్మలూరు' గ్రామం. 1920 జూలై 18 తేదీన జన్మించారు. మహిళా ప్రగతికి విశేషంగా కృషిచేసిన వ్యక్తి. గుంటూరులో అంధుల, వికలాంగుల పాఠశాల మరియు శిక్షణా సంస్థను స్థాపించారు. 'సుధా మెమోరియల్ శిశు విహార్' ను స్థాపించి నిర్వహించారు. ఇప్పుడు అదే సంస్థ లైన్సు క్లబ్ వారి సహకారంతో విలువైన సేవలందిస్తోంది. సుభాషిణి అనే మాసపత్రికకు సంపాదకురాలిగా ఉన్నారు.

**జయప్రభ అనిపిండి** : జన్మస్థలం నాగపూర్, మహారాష్ట్ర. 1957 జూలై 29న జన్మించారు. ప్రసిద్ధ స్త్రీవాద కవయిత్రి, కథా రచయిత్రి. విద్యాభ్యాసం విశాఖపట్నంలో గడిచింది. తెలుగు సాహిత్యంలో ఎం.ఏ. చదివారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి తెలుగు నాటకంపై పరిశోధన చేసి పిహెచ్.డి. సంపాదించారు. ప్రస్తుతం సికిందరాబాదులో నివసిస్తున్నారు. తెలుగులో వచ్చిన మొదటి స్త్రీవాద కరపత్రికగా 1989లో హైద్రాబాదు నుండి వెలువడిన 'లోహిత' అనే పత్రికకు కొండవీటి సత్యవతితో కలిసి సంపాదకత్వం వహించారు. వ్రాసిన చూపులు, పైటని తగలెయ్యాలి అనే కవితలు సాహిత్యప్రపంచంలో

ప్రకంపనలను సృష్టించాయి. ఇవి పలుభాషలలోకి అనువదించబడ్డాయి. కవిత్వాన్ని మాజీ ప్రధానమంత్రి పి.వి.నరసింహారావు Unforeseen Affection and Other Love Poems అనే పేరుతో ఆంగ్లంలోకి అనువదించారు. ది పబ్ ఆఫ్ వైజాగపట్నం, యశోధరా వగపెందుకే, చింతల నెమలి, యుద్ధోన్ముఖంగా..., క్షణ క్షణ ప్రయాణం, భావకవిత్వంలో స్త్రీ, వామనుడి మూడోపాదం, నాలుగో గోడ రచించారు.

**జయలక్ష్మి దావులూరి :** జన్మస్థలం కృష్ణాజిల్లా నిడుమోలు. 24.9.1938న జన్మించారు. ఎం.ఏ., బి.ఇడి. చేసి ఉపాధ్యాయురాలుగా పనిచేసి, పదవీవిరమణ పొందారు. 40 కథలతో కథా సంపుటిని; 30 బాలల కథలను, 2 నవలలు, 21 శతకాలు రచించారు. వీరి ప్రసంగాలు ఆకాశవా ణిలో ప్రసారమయ్యాయి. 25 కథలతో మనసు ప్రశ్న అనే సంపుటి వ్రాశారు.

**జయలక్ష్మి పోలూరి :** జన్మస్థలం తూర్పు గోదావరి. 5.11.1950న జన్మించారు. రాజమండ్రిలో నివసిస్తున్నారు. ఆవేదన, కొత్త జీవితాలు మొదలైన కథలు వ్రాశారు.

**జయలక్ష్మిరాజు ఎ (అక్కిరాజు) :** జన్మస్థలం కర్నూలుజిల్లా ద్రోణాచలం. 14.12.1951న జన్మించారు. ఎస్.ఎస్.ఎల్.సి. చదివినా నవలారచయిత్రి అయ్యారు. 24 కథలతో పొగబండి నేస్తం సంపుటిని వ్రాశారు. ఇంకా వివిధ పత్రికలలో 12 కథలు వ్రాశారు.

**జయశ్యామల, (మోచర్ల) తురగా :** జన్మస్థలం కృష్ణాజిల్లా, కలిదిండి మండలం, కోరుకొల్లు. 1958లో జన్మించారు. కథా, నవలా రచయిత్రి. ప్రస్తుత నివాస ప్రాంతం ముంబై. తన 14వ యేటి నుండి రచనలు చేయడం ప్రారంభించారు. దాదాపు 45 నవలలు, 350 కథలు రచించారు. రచనలు వివిధ పత్రికలలో ప్రచురింప బడ్డాయి. కొన్ని కన్నడ, మరాఠీ భాషలలోకి అనువదించబడ్డాయి. ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుంచి కొన్ని ప్రసారమయ్యాయి. కొన్ని రచనలకు బహుమతులు లభించాయి. బాంబే ఆంధ్రమహాసభ మహిళాశాఖ కమిటీ మెంబరు నుండి అధ్యక్ష పదవి వరకు వివిధ హోదాలలో సేవలను అందించారు. మగరాజ్యంలో ఆడే బొమ్మ, స్వయంకృతం, ముళ్ళతోటలో పూలబాటలు, కృష్ణ ప్రేమ, కాలమిచ్చిన తీర్పు, పూర్ణిమ, ఇంద్ర ధనస్సు, దేవుడు నవ్వాడు(కథాసంపుటి), శంఖారావం(కథాసంపుటి), కరిగిపోయిన నీలిమేఘం, నివేదన, ప్రేమాలయం, ప్రియబాంధవి, సాగర తరంగాలు, వెలుగుతీరం, ఆశాసౌధాలు. కథలు అనుబంధం, చుక్కలు చూసేవేళ, దేవుడూ!నీకు దిక్కెవరు?, నడిఏటిలో నావ, స్త్రీ మొదలైన కథలు వ్రాశారు.

**జయశ్రీ మర్రి.** కవయిత్రి.తెలుగు ఉపాధ్యాయురాలు. అనేక పత్రికలలో కవితలు ప్రచురితం. అవధానాలలో పృచ్ఛకత్వ అనుభవం. 200కవితలు అముద్రితాలు. కవితా సంకలనాలలో కవితలు ముద్రితం. అనేక కవిసమ్మేళనాలలో పాల్గొని కవి సత్కారం పొందారు. చిరునామా. జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, ఖపురాయపల్లి, యాదాద్రి జిల్లా.

**జయశ్రీ మేకా :** జన్మస్థలం కృష్ణాజిల్లా విజయవాడ. 25.11.1954న జన్మించారు. నవలారచయిత్రి. రచనలు: ఇది కథ కాదు; బంధం అనుబంధం; అమ్మ; శృంగారమే భూషణం.

**జయశ్రీదేవి పి. :** స్వస్థలం ఒంగోలు, ప్రకాశం జిల్లా. ప్రభుత్వ మహిళా కళాశాలలో చరిత్ర అధ్యాపకులుగా పదవీవిరమణ. తెలుగులో వ్యాసాలు, కవితలు, కథలు, పాటలు అనేకం రచించారు. కవి సమ్మేళనాలలో పాల్గొన్నారు. సాహిత్య రూపకాలలో పాల్గొని పలు కవయిత్రుల ప్రాతధారణ చేశారు. రేడియో, టి.వి. కార్యక్రమాలలో పాల్గొన్నారు. వీరికి అనేక ఆధ్యాత్మిక సేవాసంస్థలలో సభ్యత్వం ఉంది.

**జయా బాలకృష్ణ, సి. (జయలక్ష్మి, చెరువు) :** జన్మస్థలం కృష్ణాజిల్లా విజయవాడ. 1911 సెప్టెంబర్ 15న జన్మించారు. నవలా రచయిత్రి. అనేక కథలు, కొన్నినవలలు రచించారు. ప్రస్తుతం హైదరాబాదులో ఉంటున్నారు.

**జల్లూరి రమాకుమారి :** అవనిగడ్డ. ఉపాధ్యాయిని. చిన్నతనం నుంచిసాహిత్యంపై మక్కువతో తల్లిదండ్రులు హరికథాగానం నేర్పించారు. వాసవీవనితాక్లబ్, క్రాంతిసేవాట్రస్ట్ విశ్వధర్మపరిషత్, మున్నగుసంస్థలలో పలుబాధ్యతలు నిర్వహిస్తూ అవనిగడ్డ గ్రంథాలయ అభివృద్ధికమిటీ కార్యదర్శిగా సేవలందిస్తున్నారు. వీరుపాడేపాటలు యూట్యూబ్ లో వినిపిస్తున్నాయి. కవిసమ్మేళనాలలో స్వీయకవితాగానం చేస్తుంటారు. చిరునామా: మార్కెట్ రోడ్డు 5-43అవనిగడ్డ-521121 కృష్ణా ఆం.ప్ర ఫోను నం. 9248035035

**జానకమ్మ గొడే :** ప్రముఖ రచయిత్రి మరియు సంఘ సంస్కర్త. విద్యా విశారద అని సమకాలీన కవులు మెచ్చుకొనేవారు. స్త్రీ విద్య కోసం పాటుపడింది. విశాఖపట్టణంలో ఆడపిల్లల కొరకు ఒక పాఠశాలను నెలకొల్పింది. జానకమ్మ కొన్ని గ్రంథాలను వ్రాయించింది. మరిగంటి వెంకటాచార్యులు అనే కవి "మల్లారి చరిత్ర" అనే కులపురాణం వ్రాశాడు. దీనిలోని కొన్ని నచ్చని విషయాలు వుండడం వలన ఎఱ్ఱమిల్లి పేర్రాజు గారిచేత సవరణలు చేయించింది.

**జానకమ్మ పోతం :** తెలుగులో ప్రప్రథమ పత్రికా రచయిత్రి, తమ విదేశయాత్రను వివరిస్తూ వీరు రాసిన వ్యాసం 1874 సం. లో వ్రాశారు .ప్రకాశం జిల్లా, లింగసముద్రం మండలంలోని మొగిలిచర్లలో 2015, మే 27 న మరణించారు.

**జానకి తమిరిశ :** జన్మస్థలం మచిలీపట్నం. 26.10.1946న జన్మించారు. స్వగ్రామమైన ప.గో.జిల్లా నరసాపురంలోనే పెరిగారు, విద్య కొనసాగింది కూడా అక్కడే. వీరు 'మూగ మనసులు(18 కథలు); మనసిది నీకోసం(15 కథలు) వెలువరించారు. ఇంకా సుమారు 50 కథలు వివిధ పత్రికలలో వచ్చాయి.

**జానకి ప్రభల డా. :** జన్మస్థలం తూ.గో.జి. ముమ్మిడివరం. ఢిల్లీలో స్థిరపడ్డారు. జాతీయ,అంతర్జాతీయ సదస్సులలో పత్రసమర్పణలు చేశారు. దేశవ్యాప్తంగా జరిగే సాంస్కృతిక ఉత్సవాలను సమీక్షించడం అభిరుచి. ఆకాశవాణి విశాఖపట్నంలో బి.హైగ్రేడ్ నాటక కళాకారిణి, ఢిల్లీలో న్యూస్ రీడర్. సంప్రదాయ, జానపద కళలపై ఆంధ్రమహాభారత ప్రభావం అనే అంశంమీద పరిశోధన చేశారు. 2016 చికాగో సభలోనూ, సింగపూర్ లో 5వ ప్రపంచ తెలుగు మహాసభలలోనూ ప్రసంగించారు. ఢిల్లీ తెలుగు అకాడమీనుంచి రాష్ట్రీయ వికాస శిరోమణి అవార్డు పొందారు. భక్తిపథంలో ప్రస్థానత్రయం, మహాభారత ప్రమదావలోకనం, సరస్వతీ నమస్తుభ్యం, విశ్వనాథ విషాదాంత నాటకాలు, పద్య, పద కవితా వారధి భక్త రామదాసు, కళలకాణాచి ఆంధ్ర మహాభాగవతం గ్రంథాలను వెలువరించారు.

**జానకీబాల ఇంద్రగంటి :** జన్మస్థలం రాజమండ్రి. డిసెంబరు 4, 1945న జన్మించారు. కవయిత్రి, రచయిత్రి, పరిశోధకురాలు. తల్లిదండ్రులు 'సూరి రామచంద్రశర్మ, లక్ష్మీనరసమాంబ'. విద్యాభ్యాసాన్ని తణుకులో పూర్తిచేశారు. 1966లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థలో సెక్షన్ గుమస్తాగా ఉద్యోగంలో చేరారు. తెలుగు సాహిత్యంలో సుప్రసిద్ధులైన కవి, విమర్శకుడు ఇంద్రగంటి శ్రీకాంతశర్మను వివాహం చేసుకున్నారు. ఉద్యోగరీత్యా 'విజయవాడ'లో పాతికేళ్లపాటు నివసించారు. 1991లో ఉద్యోగ విరమణ చేసి హైదరాబాద్లో స్థిరపడ్డారు. సాహిత్యరంగం సినీనేపథ్య గాయనుల జీవిత విశేషాలతో కూడిన పరిశోధన గ్రంథం "కొమ్మా కొమ్మా కోయిలమ్మా...." ను వెలువరించారు. ఆరు కథాసంపుటాలను, పన్నెండు నవలలను, ఒక కవిత్వసంకలనాన్ని ప్రచురించారు. నవలల జాబితా కరిగిన హరివిల్లు, విశాల ప్రపంచం, వెన్నలమట్టి, ఆవలితీరం, తరంగిణి (పుస్తకం), నీలిరాగం, నిజానికి అబద్ధానికి మధ్య, మాతృబంధం, సజలనేత్రి, కనిపించేగతం, రాగవల్లకి, పంజరం కోరిన మనిషి. కవితా సంపుటాలు

మనశ్శల్యాలు; ఇంకా 5 కథా సంపుటాలు, 3 ఇతర పుస్తకాలు రచించారు. సంగీత రంగం జానకీబాల ఆకాశవాణిలో లలిత సంగీత కళాకారిణిగా తమ గానం వినిపించారు. లలితగీతమాలిక, శివాక్షరమాల పాడి కేసెట్లుగా విడుదల చేశారు. ఈటీవీ 2 లో పాటలపాలవెల్లి కార్యక్రమాన్ని నిర్వహించారు. తెలుగు సినిమా పాటలపై పదలహరి సంగీత కార్యక్రమాన్ని రేడియో స్పందనలో నిర్వహించారు. 'కనిపించే గతం' నవలకు గాను పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుంచి 'ఉత్తమ రచయిత్రి' పురస్కారం. కథారచయిత్రిగా 'రంగాజ్యోతి' పురస్కారం. జ్యోత్స్నా పీఠం సంస్థ నుంచి కథారచయిత్రిగా జ్యోత్స్నాపీఠం పురస్కారం.

**జానకీరాణి తురగా :** జన్మస్థలం కృష్ణాజిల్లా బందరు. 1936 అగష్టు 31 న జన్మించారు. రచయిత్రిగా, కాలమిష్టుగా, నాటకకర్తగా, రేడియో ప్రయోక్తగా, సంఘసేవకురాలిగా బహుముఖీన ప్రజ్ఞను ప్రదర్శించి దివిసీమలోని "మందపాకల" గ్రామంలో బాల్యం గడిపారు. భరతనాట్యం, సంగీతం, ఆటలు, పాటలు, నాటికలు అన్నిటిలో పాల్గొనేవారు. ఆంధ్రా యూనివర్సిటీలో మొత్తం 4 సబ్జెక్ట్లో బంగారు పతకాలు వచ్చాయి. ఎం.ఏ. ఎకనమిక్స్ చేశారు. ఉస్మానియాలో పి.హెచ్.డి. చేస్తూ ఆపేశారు. న్యాపతి కామేశ్వరమ్మ తర్వాత రేడియో అక్కయ్య. రేడియోలో నాటికలు, నాటకాలు, నృత్యరూపకాలు, సెమినార్లు ఎన్నో నిర్వహించారు. పదిహేనేళ్ళ వయసులో 'భవిష్యత్' అనే కథ వ్రాశారు, కృష్ణా ఎక్స్ప్రెస్లో ప్రచురింపబడింది. సుమారు 100 కథలు వ్రాశారు, కొన్ని తమిళం, కన్నడం, బెంగాలీ భాషల్లోకి అనువదింపబడ్డాయి. మూడు నవలలు, అనేక నాటకాలూ వ్రాశారు, ఎక్కువ రచనలు స్త్రీల గురించే. రచనల్లో తనకిష్టమైన నాటిక పవిత్ర; ముసలివాళ్ళ కష్టనష్టాల్ని గురించిన 'ఆశ్రయం డాక్యుమెంటరీ; చెవిటి, మూగ వారిమీదచేసిన 'నిశ్శబ్దంలో ప్రేమనాదాలు' అనే డాక్యుమెంటరీ చేశారు. జాతీయ అవార్డు, మొత్తం 4 వచ్చాయి. మధ్య తరగతి ఆధునిక కుటుంబాలలో ఎదురయ్యే వివిధ సమస్యలపై అలవోకగా కథలు రాయగల రచయిత్రి.. అందుకు "జగన్మాత" సాక్షి. 1994లో రిటైరైనాక 'సేవ్ ది చిల్డ్రన్' అనే డాక్యుమెంటరీ చేశారు. ఇండియన్ ఎక్స్ప్రెస్ దినపత్రికలో, 'దేవయాని' పేరుతో, 'టి.వి. టాక్" నిర్వహించారు. అవార్డులు 2011 బాల సాహిత్య పరిషత్ ద్వారా "బాలసాహిత్య రత్న" అవార్డు. గృహలక్ష్మి స్వర్ణకంకణం. తెలుగు విశ్వవిద్యాలయ పురస్కారం (రెండుసార్లు). రాష్ట్ర ప్రభుత్వ ఉగాది పురస్కారం. పింగళి వెంకయ్య స్మారక సత్కారం. అరవిందమ్మ మాతృమూర్తి అవార్డు. సుశీల

నారాయణరెడ్డి సాహితీ పురస్కారం. ఆంధ్ర సారస్వత పరిషత్తులో పరిణితవాణి గౌరవం. 'ఈనాడు' అవార్డు. బాలబంధు, దక్షిణ మధ్య రైల్వే గౌరవ సత్కారం. జానకీరాణి అక్టోబరు 15, 2014 బుధవారం సాయంత్రం, పంజగుట్ట లోని తన నివాసంలో తుదిశ్వాస విడిచారు.

**జొన్నలగడ్డ శారదాదేవి (జంటకవయిత్రులు) :** లక్ష్మితో

**జోస్ మేరీ కృపాబాయి గుడిపాటి.** వర్ధమాన రచయిత్రి. కృష్ణాజిల్లా కథా రచయిత్రుల కథాసాహిత్యంపై ఎం.ఫిల్.చేసి పి. హెచ్.డి చేస్తున్నారు. చిరునామా. ఘంటసాల-521133. ఫోన్.9951103139.

**జ్యోతి అద్దేపల్లి :** జన్మస్థలం తూ.గోదావరిజిల్లా తణుకు. 12.9.1967న జన్మించారు. శ్రీచంద్ర, చన్ద్రశ్రీ అనే పేర్లతో రచనలు చేశారు. కాకినాడలో నివసిస్తున్న కవయిత్రి, వ్యాసకర్త్రి. మూడేళ్ళకో వసంతం, మరుపు మొదలైన కథలు రచించారు. పున్నమి హైకూలు, కథానందనం, తెలుగు కథనం కథాసంకలనాలు, పున్నమి హైకూల పుస్తకం వెలువరించారు. నాగభైరవ కోటేశ్వరరావు స్ఫూర్తి పురస్కారం పొందారు. ఆగస్ట్ 15 సినిమాకు పాట వ్రాశారు. టి.వి.షోలలో పాల్గొన్నారు. చిరునామా: సిటీ ఎంపోరియం, మెయిన్ రోడ్, కాకినాడ. తూ.గో.జిల్లా. ఘను నం. 9290441888.

**జ్యోతిర్మయి జంగం.** కలంపేరు సిం హాద్రి. తెలుగు లెక్చరర్, కవయిత్రి. పద్యం, గేయం, వచన కవిత, పేరడీలు రాస్తారు. శ్రీ విష్ణు కందం,భజగోవిందం,రాజశేఖర శతకం,గేయ రామాయణం,పాటల్లో పాఠాలు నా(రీ) అనుభూతులు,నా తొలి ఊహలు,పెళ్ళిపాటలు మొ. రచించారు. చిరునామా. టీచర్,ఒంగోలు పబ్లిక్ స్కూల్, గాంధీనగర్,మంగమూరు రోడ్డు,ఒంగోలు,ప్రకాశం జిల్లా, ఫోన్9866014619.

**జ్యోతిష్మతి పాలపర్తి :** చిరునామా : 32-103, శశాంక నిలయం, విశ్వభారతి రోడ్, వాసవీ నగర్, అద్దంకి -523201, ప్రకాశం జిల్లా, ఫోను. : 9701115600.

**జ్యోతి స్వరూపరాణి బందారు. డా. :** విశ్రాంత తెలుగు శాఖాధ్యక్షులు, తెనాలి. 100కు పైగా జాతీయ, అంతర్జాతీయ సదస్సులలో పత్రసమర్పణ. 200 రేడియో ప్రసంగాలు, 25 దృశ్య నాటికలు, 6 శ్రవ్య నాటికలు, 4 పుస్తకాలు రచించారు. ఆంధ్ర, నాగార్జున డిగ్రీ, పి.జి. దూరవిద్యకు పాఠ్యాంశ రచయిత. 98-2007వరకు ఇంటర్ పాఠ్యగ్రంథ సంపాదకమండలి సభ్యులు. 4 ఎం.ఫిల్., 2పి.హెచ్.డి డిగ్రీల పరిశోధన పర్యవేక్షకులు. జాతీయ అయాచి పురస్కారం, రాష్ట్ర ఉత్తమ

అధ్యాపకులు, రాష్ట్ర ఉత్తమ ఎన్.ఎస్.ఎస్.ఆఫీసరుగా బంగారు పతకం, 9దేశాల్లో జరిగిన తెలుగు సభల్లో ప్రసంగాలు. 180కవితలు, 60కథలు ప్రచురించారు. చిరునామా: 11-11-9 చెంచుపేట, సత్యనారాయణపురం, తెనాలి-522202. గుంటూరు జిల్లా. ఫోను నం: 9848211664.

**జ్యోత్స్నారాణి సవరం డా. :** విజయవాడ సప్తగిరి కళాశాలలో ఉపధాన్యాసకురాలు. డి.కామేశ్వరి కథలపై పరిశోధన చేశారు. అనేక సదస్సులలో పాల్గొని పత్ర సమర్పణ చేశారు. పలు పత్రికల్లో వ్యాసాలు ప్రచురితం. సెల్ : 9491498749.

**ఝాన్సీ కె.వి.కుమారి :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'కాకుల పాడు' గ్రామం. 1954లో జన్మించారు. కవితా సంకలన రచయిత్రి. 'నిశీధి' అనే కథన్ను 'నిశ్శబ్ద సంగీతం' అనే కవితా సంకలనాన్నీ రచించారు.

**ఝాన్సీ జొన్నలగడ్డ. :** ఉపాధ్యాయిని, కవయిత్రి, గాయని. బడిపాటలు-నవచైతన్యం ఆడియో సి.డి, పాటల పుస్తకం ఆవిష్కరించారు. చిరునామా.ఇం.నుం. 21-225/5, బచుపేట ఆర్.కె.రెస్టారెంటు ఎదుటి రోడ్డు, మచిలీపట్నం, కృష్ణాజిల్లా.

**ఝాన్సీ దీవి :** భారతీయ సాహిత్య పరిషత్ అవనిగడ్డ శాఖ ఉపాధ్యక్షురాలు. అవనిగడ్డ సబ్-డివిజన్ ఫ్యామిలీ కౌన్సిలర్. రాష్ట్ర స్థాయి కవిసమ్మేళనాలు, అవధానాలలో పాల్గొన్నారు. అవనిగడ్డ ఉపసర్పంచ్ గా రెండు పర్యాయాలు ఎన్నికయ్యారు.

**ఝాన్సీ దుర్గ. వి. :** 10.8.1956న విజయవాడలో పుట్టారు. గెజిటెడ్ ప్రధానోపాధ్యాయిని. వందల గేయాలను స్వరపరిచి దూరదర్శన్, ఆకాశవాణిలలో పాడారు. 350లకు పైన నాగభైరవ కవన విజయ ప్రదర్శన.

**ఝాన్సీరాణి సాజర్ల :** ప్రధానోపాధ్యాయిని కవయిత్రి. అనేక కవి సమ్మేళనాలలో పాల్గొన్నారు. పిల్లలలో సాహిత్యాభిలాషను పెంచటానికి పలు కార్యక్రమాలు నిర్వహిస్తుంటారు. చిరునామా : యస్.ఝాన్సీరాణి, 21/4/131 జైహింద్ పోల్ ప్రక్కన, కొత్త బస్టాండు. ఆదోని - 518 301.

**తరిగొండ వేంకమాంబ :** 1840. తరికుంద వెంగమాంబ అనికూడా పిలుస్తారు. తండ్రి కానలి కృష్ణార్యుడు: భర్త వేంకటాచలపతి:

**తాయారమ్మ, కె :** జన్మస్థలం విజయనగరం. 1.7.1940లో జన్మించారు. దాహం, సమాజ సేవ, పగిలిన అద్దం, నానమ్మ ఆత్మ, పండగొచ్చింది మొదలైన 20 కథలు వ్రాశారు.

**తిమ్మక్క తాళ్లపాక :** ప్రథమాంధ్ర భాషా కవయిత్రి.. మహాకవి, వాగ్గేయకారుడు అయిన అన్నమయ్య ఇల్లాలు. తిమ్మక్క అని వేటూరి ప్రభాకరశాస్త్రి గారి నిర్ణయం.

ఈమె సుభద్రా కల్యాణం అనే కావ్యాన్ని రచించింది. నన్నయ ఆదిపర్వంలో 135 గద్య పద్యాలలో విజయ విలాసం రచించాడు. అతనిని అనుసరిస్తూ తిమ్మక్క 1163 పాదాల ద్విపద కావ్యాన్ని రచించింది. కడుమంచి తేటపలుకులతో చెప్పిన పాటగా తన కావ్యాన్ని పేర్కొంది. కొన్ని కొన్ని ఘట్టాలలో నన్నయలాగానే మూలాతిక్రమణం చేసింది. అర్జునుడు తీర్థయాత్రలు చేస్తూ – అమర అహోబళంబా వెంకటాద్రి వరుస నాపై కంచి వరదుల గొలిచె–అని తిరుపతి వెంకటేశ్వరులకు అర్జునుని చేత మొక్కించింది.

**తిరుమలాంబ :** 16వ శతాబ్దపు సంస్కృత కవయిత్రి. విజయనగర చక్రవర్తి అచ్యుతరాయల భార్య. వరదాంబికా పరిణయమనే చంపూ కావ్యమును సంస్కృతములో రచించింది. తెలుగు వారు, కన్నడ వారు ఇరువురు మా కవియిత్రి అని చెప్పుకున్నా నిర్ధారణగా మాతృ భాష తెలియడం లేదు. బహు భాషా పాండిత్యము కలదని, కావ్యాలు, అలంకారాలు, నాటకాలు, కవితలు, పురాణాలు, వేదాలు ఒక్కసారి విని గుర్తుపెట్టుకోగల ఏకసంథాగ్రాహి అని తన కావ్యము 'వరదాంబికా పరిణయము' యొక్క కవిపరిచయములో చెప్పుకొన్నది.

**తుక్కాదేవి :** జగన్మోహిని లేదా తుక్కా ప్రతాపరుద్ర గజపతి కూతురు. శ్రీ కృష్ణదేవరాయల మూడవ భార్య. సంస్కృతములో తుక్కా పంచకమనే ఐదు పద్యాలు చెప్పినది. ప్రతాపరుద్ర గజపతి 1519 లో రాయలకు తన కూతురు జగన్మోహిని (తుక్కా) నిచ్చి వివాహము చేసి సంధి చేసుకున్నాడు. తుక్కా పంచకము మరియు కృష్ణరాయ విజయములలో పేరు తుక్కాగాను, రాయవాచకములో జగన్మోహినిగాను, కొండవీడు కైఫియత్'లో లక్ష్మీగాను ఈమె కనిపిస్తుంది. రాయలు విడిచిన కంభం పరిసర ప్రాంతాలలో ఒంటరి జీవితము గడిపిందని ప్రచారంలో ఉంది.

**తులశమ్మ జూలూరి :** 20 వ శతాబ్ది పూర్వార్థంలో అనేక రచనలు చేశారు. మార్చి1931 గృహలక్ష్మి పత్రికలో మోతీలాల్ నెహ్రూ పై స్మృతి పద్యాలను వ్రాశారు.

**తులసి చాగంటి :** జన్మస్థలం విజయనగరం. 5/11/1937న జన్మించారు..కథా రచయత్రి. చాగంటి సోమయాజులు (చాసో) కుమార్తె. కథకురాలిగా, అనువాదకురాలిగా తులసి తనదయిన వేరే దారిని నిర్మించుకున్నారు. రచనా, ఆలోచనా విశిష్ట వ్యకిత్వానికి అద్దం పడతాయి. హిందీలో "మహాదేవీకీ కవితామే సౌందర్య భావన్" అనే విషయంపై డాక్టరేట్ తీసుకున్న తులసి, ఒడిశా ప్రభుత్వ విద్యాశాఖలో రీడర్గా పనిచేశారు. తరువాత దక్షిణ కొరియా సియోల్లోని హాంకుక్ యూనివర్సిటీలో గెస్ట్ప్రొఫెసర్గా హిందీ బోధించారు. పదవీ విరమణ తరువాత

ప్రస్తుతం విజయనగరంలో వుంటున్నారు. "వలయం" "తిరోగామి" వంటి ఆలోచింపచేసిన కథలు వ్రాసారు. 1946 లో బాలపత్రికలో మొదటికథ వ్రాశారు. యాభయ్యవదశకం నుంచే పురోగామి దృక్పథంతో కథలు వ్రాస్తున్నారు. పరిమాణంలో తక్కువ అయినా గుణాత్మకమైన కథలు వి. పధ్నాలుగు కథలతో వచ్చిన "తులసి కథలు" కథాసంపుటి, "యాత్ర" చిన్న నవల, "సాహితీ తులసి" అనే వ్యాససంపుటి, "తులసి కథలు" ప్రచురణానంతరం వ్రాసిన కొన్ని కథలు, "తగవు" అనే నాటిక తెలుగు రచనలు కాగా, అనువాదాలు ఎక్కువ చేసారు. హిందీ, ఒరియా, ఇంగ్లీష్ భాషలనుంచీ తెలుగులోకి తెలుగు నుంచీ హిందీకి చాల గ్రంథాలు అనువదించారు. ప్రసిద్ధ తెలుగు కథలెన్నింటినో హిందీలోకి ఒరియాలోకి అనువదించి వివిధ పత్రికలలో ప్రచురించారు. తులసి విజయనగరం జిల్లా మాండలికంలో చెయ్యి తిరిగిన రచయిత. వ్రాసిన 'ఆడదాయికి నోరుండాలి, చోద, స్వర్గారోహణ' రెండూ ఆ మాండలికంలో వ్రాసిన ఉత్తమపురుష కథలే. మధ్యతరగతి జీవుల నెంత బాగా చిత్రిస్తారో బడుగు జీవుల్నీ అంతే సహానుభూతితో చిత్రిస్తారామె. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం సర్వోత్తమ కథారచయిత పురస్కారం, ఢిల్లీ తెలుగు అకాడమీ ఉగాది సమ్మాన్, కొండేపూడి శ్రీనివాసరావు పురస్కారం, తాపీ ధర్మారావు పురస్కారం, అరసం సత్కారం, నాళం కృష్ణారావు స్మారక సత్కారం, మొదలైన పురస్కారాలను అందుకున్నారు.

**త్రిపురసుందరమ్మ కిళాంబి :** హిందూసుందరి, 1913డిశంబరు సంచికలో కావ్యరాజము –కావ్యరాజము రచన వెలువడింది.

**దీవెన చిలుకూరి :** జన్మస్థలం అనంతపురం. 8.5.1965న జన్మించారు. బి.ఏ.తెలుగు సాహిత్యం చదివారు. చదువుకునేరోజుల్లోనే రచనా వ్యాసంగం ప్రారంభించారు. ఆటపట్టు, విషమ సంధ్య, రేపటి కిరణం మొదలైన కథలు రచించారు. దురాచారాలకు ఎదురు తిరిగిన వనిత.

**దుర్గ ఇ :** టీచర్, సి.బెళగళ్ మండల్ & గ్రామం, కర్నూలు జిల్లా. ఫోన్.9117763557. రచనలు చేయడం అభిరుచి.

**దుర్గమ్మ కొసరాజు :** గృహలక్ష్మి పత్రిక 1929 జూలై సంచికలో 'గౌరీసుందరి' అనే రచన చేశారు.

**దుర్గాంబ వడ్లమూడి :** గుంటూరుజిల్లాకు చెందిన దుర్గాంబ, పెద్దలూ మీరు మారాలి, మోహినీ...మోహినీ..., పట్టు పరికిణీ మొదలైన కథలు వ్రాశారు.

**దుర్గాదేవి కె.** : జన్మస్థలం విజయవాడ. శ్రీమతి దుర్గాదేవి 1948లో జన్మించారు. కథా రచయిత్రి. 'సీతాపతి కథ పడిండోయ్, రక్త మల్లిక' మొదలైన కథలను వ్రాశారు.

**దుర్గాబాయి దేశ్‌ముఖ్** : జన్మస్థలం ఆంధ్రప్రదేశ్లోని రాజమండ్రి, జూలై 15, 1909న కృష్ణవేణమ్మ, రామారావు దంపతులకు జన్మించారు. బాల్యం నుంచి ప్రతిభా పాటవాలను కనబరుస్తూ పది సంవత్సరాల వయస్సులోనే హిందీలో పాండిత్యాన్ని సంపాదించి, హిందీ పాఠశాలను నెలకొల్పి అన్ని వయసులవారికీ విద్యాబోధన అందించేవారు. బెనారస్ విశ్వవిద్యాలయం నుంచి మెట్రిక్యులేషన్, ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఏ (పొలిటికల్సైన్స్), 1942లో ఎల్.ఎల్.బి పూర్తిచేశారు. దుర్గాబాయి చిన్ననాటి నుండే స్వాతంత్ర్య పోరాటంలో పాలుపంచుకున్నారు. తెలుగుగడ్డ మీద మహాత్మా గాంధీ రాకను పురస్కరించుకుని 12 ఏళ్ళ వయసులోనే విరాళాలను సేకరించి ఆయనకు అందజేశారు. ఆధ్వర్యంలో 1937లో చెన్నైలో ఆంధ్ర మహిళా సభ స్థాపించబడింది. 1941లో ఆంధ్ర మహిళ పత్రికను స్థాపించి, సంపాదకత్వ బాధ్యతలను నెరవేర్చారు. 1958లో హైదరాబాదులో ఆంధ్ర మహిళా సభను స్థాపించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో మహిళా వసతిగృహ ఏర్పాటుకై పాటుపడటమేగాక రాష్ట్రమంతటా ఎన్నో కళాశాలలు, వసతిగృహాలు, నర్సింగ్ హోమ్‌లు మరియు వృత్తి విద్యాకేంద్రాలు నెలకొల్పారు. 1953లో ఆర్థికమంత్రి చింతామణి దేశ్ ముఖ్ తో వివాహం జరిగింది. 1971లో సాక్షారతా భవన్ ని ప్రారంభించారు. భారతదేశంలో సామాజిక సర్వీస్ మదర్ గా పిలిచేవారు. దుర్గాభాయి దేశముఖ్ ఒక భారతీయ స్వాతంత్ర్య సమరయోధురాలు, న్యాయవాది, సామాజిక కార్యకర్త మరియు రాజకీయ నాయకురాలు. భారతదేశం యొక్క రాజ్యాంగ సభ మరియు భారతదేశం యొక్క ప్రణాళికా సంఘం సభ్యురాలు. ఆంధ్ర విశ్వవిద్యాలయం దుర్గాబాయికి 1971లో గౌరవ డాక్టరేట్ ప్రదానం చేసింది. 1981 మే 9వ తేదీన హైదరాబాదులో పరమపదించారు. అవార్డులు :1975పద్మ విభూషణ్(అదే సంవత్సరం ఆవిడ భర్త సి.డి.దేశ్ముఖ్ కూడా పద్మ విభూషణ్) పొందారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి గౌరవ డాక్టరేట్స్మ 1971 నెహ్రూ లిటరసీ అవార్డు(వయోజన విద్యాసేవలకు గుర్తింపుగా వచ్చింది.); యునెస్కో నుండి పాల్ జి. హాఫ్మన్ అవార్డు.

**దుర్గావళి మాదుగుల** : జన్మస్థలం విజయవాడ. నవలా రచనలో సిద్ధ హస్తులు.

**దేవకి ఎం.కె.** : జన్మస్థలం చిత్తూరుజిల్లా వరిగెపల్లి. మహాసముద్రం కోదండరెడ్డి దేవకి 17 1951న జన్మించారు. ఎం.ఏ., పి.హెచ్.డి. చేశారు. శ్రీకృష్ణ దేవరాయ

విశ్వ విద్యాలయంలో తెలుగు తులనాత్మక శాఖలో ఆచార్యులుగా పనిచేశారు. అనంతపురంలో ఉంటున్నారు. 15 కథలతో ముళ్ళదోవ, 10 కథలతో మంటల ఒడిలో అనే కథాసంపుటాలను వ్రాశారు. దేశంలో పిల్లల చదువు, ఆర్థిక స్థాయి గురించి సమాచారం సేకరించి, 'బాల భారతం' అనే పుస్తకం; మహిళా ఉద్యమాల గురించి 'ఆదర్శదీపాలు' అనే పుస్తకం రచించారు.

**దేవి లక్కరాజు :** గుంటూరు జిల్లాలో జన్మించారు. న్యాయవాది. నెలవంక నెమలీక సాహిత్య మాసపత్రిక ఎడిటర్, పబ్లిషర్. 10సం. శుక్లపక్షం సామాజిక రాజకీయ పక్షపత్రికకి ఎడిటర్ & పబ్లిషర్. ఆలిండియా రేడియో ఎ1 ఆడిషండ్ ఆర్టిస్ట్. వివిధ సీరియళ్లకి డబ్బింగ్ కళాకారిణి. 25సం.గా కథలు, కవితలు, వ్యాసాలు, రేడియో నాటకాలు, దూరదర్శన్ నాటకాలకి సంభాషణలు రాస్తున్నారు. బెస్ట్ సోషల్ వర్కరుగా గవర్నర్ చేతులమీదుగా పురస్కారం అందుకున్నారు.

**దౌలత్ బేగం :** జన్మస్థలం కృష్ణాజిల్లా మచిలీపట్నం. 17.6.1937న జన్మించారు. కథా, నవల, గేయ రచయిత్రి.

**ధనలక్ష్మి దూబా :** గేయరచయిత్రి, విద్యాధరపురం, (విజయవాడ)నివాసముంటున్నారు.

నందుల సుశీలాదేవి,:

**నందనవనం సరస్వతి :** కవయిత్రి, హిందీ ఉపాధ్యాయుని. తెలుగు, హిందీ భాషలలో పలురచనలు చేశారు. శ్రీమతి భమిడిపాటి బాలా త్రిపురసుందరి రచన 'ముంగిట ముత్యాలు"ను "అంగన్‌కి మోతి" పేరుతో అనువదించగా ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ ప్రచురించింది. హిందీ పరీక్షలు వ్రాసే విద్యార్థులకు ఉపయోగపడే సూచనలతో ఒక కరదీపికను వెలువరించారు. సెల్ : 9490742908. శారదారామకృష్ణ విద్యాలయం, గాంధీనగరం, విజయవాడ-3.

**నగీనా షేక్ :** వీరు గొల్లనపల్లియోగి అయిన విశ్వనాగేశ్వర స్వామి జీవిత చరిత్ర రచించారు.

**నసీరా బేగం :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'విజయవాడ'. 1972 మే 17 న జన్మించారు. రచయిత్రి, అనువాదకురాలు. బి.ఏ. చదువుకుని, ఉర్దూ, తెలుగు భాషలలో బాగా పరిచయం సాధించారు. 1987లో తండ్రి ప్రోత్సాహంతో రచనా వ్యాసంగం ప్రారంభించారు. కొన్ని అనువాదాలు కూడా చేశారు. వివిధ పత్రికలలో వ్యాసాలు ప్రచురిత మయ్యాయి. ఈనాడు దినపత్రికలో "అంతర్యామి" శీర్షికలో వ్రాసిన వ్యాసాలు గుర్తింపు తెచ్చాయి. ఎక్కువగా ఉర్దూ నుంచీ తెలుగులోకి అనువాదాలు చేస్తున్నారు. ప్రస్తుతం హైదరాబాద్ లో నివసిస్తున్నారు.

**నాగ ఉదయలక్ష్మి శివలెంక :** జన్మస్థలం కృష్ణాజిల్లా గుడ్లవల్లేరు. నవలా రచయిత్రి.

**నాగజ్యోతి :** ఎం.ఎ, తెలుగు అధ్యాపకులు. 60 కవితలు వ్రాశారు. అక్షర హరివిల్లు ముద్రించే ప్రయత్నంలో ఉన్నారు. సందేశాత్మక రంగవల్లులు గీస్తారు.

**నాగపద్మిని పుట్టపర్తి డా. :** ప్రచురిత రచనలు: (తెలుగు) సాహితీమంజూష, సంగీతసాహిత్యస్రవంతి, వ్యాసవాటిక, వ్యాస రింఛోచోళి, వ్యాస సరసి, తెలుగింటిసిరుల పంట (సాహిత్య వ్యాసాలు) హద్దులు, కవితావలోకనం (కవితాసంకలనాలు) భాషాపరశేష భోగి - పుట్టపర్తి నారాయణాచార్య (పుట్టపర్తి జీవితం -సాహిత్యం) తెలుగు హిందీ రామకావ్యాల్లో సీత (పరిశోధనాత్మక గ్రంథం) (హిందీనుండి తెలుగుకు) రాజ్ కమల్ చౌధరీ కథలు (నేషనల్ బుక్ ట్రస్ట్ వారిచే) జాతీయ స్థాయిలో గోఎంకా అవార్డ్ అందుకోబోతున్న అనువాదం శ్రీకాంత్ వర్మ (సాహిత్య అకాడెమీకి అనువాదం - ఉత్తమ అనువాద పురస్కారం 2012 - పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం) నోబుల్ మహిళా గ్రహీతలు (పబ్లికేషన్స్ డివిషన్ వారికోసం - మూడుమార్లు పునర్ముద్రితం) హిందీలో ప్రచురిత రచనలు 1.సీతాయాశ్చరితం మహత్ (పీహెచ్‌డి పరిశోధనాగ్రంధం)2.తెలుగు ఔర్ హిందీ గీతి కావ్య్ (ఎంఫిల్ పరిశోధనా గ్రంథం 3.తెలుగు సాహిత్య సుష్మా (తెలుగు సాహితీప్రముఖులగురించి) 4.అన్నమాచార్య గీత్ మాధురీ (తి.తి.దేవ. ప్రచురణ - అన్నమాచార్య 108 సంకీర్తనల హిందీ అనువాదం) 5.భగవత్ ప్రేం కా పరిమల్ - తిరుప్పావై ( తి.తి.దే. ప్రచురణ- గోదా తిరుప్పావై హందీ అనువాదం) 6. బచాలీజియే మేరే బేటే కో (తెలుగు నుండీ హిందీలోకి అనూదిత కథలు) 7. మై భారత్ కా వాసీ హూన్ (తెలుగు దేశభక్తి కవితల హిందీ అనువాదం) ఇతర వివరాలు : శ్రీవారి బ్రహ్మోత్సవాల్లో హిందీ వ్యాఖ్యాతగా 1999 నుండీ కొనసాగటం, ఆంధ్ర, తెలంగాణా, ఖరగ్పూర్, అమెరికా (డల్లాస్, పెన్సిల్వేనియా, అట్లాంటా,వాషింగ్టన్, న్యూజెర్సీలలో సాహిత్యకార్యక్రమాల్లో సన్మానాలు) తెలుగు టీవీలో ఆధ్యాత్మిక ప్రసంగాలు

**నాగమంజరి వి.ఎస్.ఎస్.గుమ్మా :** ఉపాధ్యాయిని, పద్య కవయిత్రి. శ్రీ గణేశ చరిత్ర, విశ్వనాథ శతకం రచించారు. అష్టావధానాలలో పృచ్ఛకత్వం చేస్తారు.పద్యములు, కవితలు, వ్యాసములు పత్రికలలో ప్రచురిరించబడ్డాయి. చిరునామా: ఎం.పి.యు.పి.స్కూల్,శృంగ వరపు కోట-535145. ఫోను నం. 9985667500.

**నాగమణి ఎం(మలిరెడ్డి) :** జన్మస్థలం కృష్ణాజిల్లా గుడివాడ. 17.7.1947న జన్మించారు. తిరుపతిలో నివసిస్తున్నారు. పాపం పరంధామయ్య, ముఖపత్ర సుందరి, అంచనా, వాలంటరీ రిటైర్మెంట్ మొదలైన 9 కథలు వ్రాశారు.

**నాగమ్మ తాడి :** జన్మస్థలం తూర్పు గోదావరి జిల్లా మామిడికుదురు మండలం, మోరివారిపాలెం. 1908 జులై 6 న లో బల్లా పుల్లయ్య, మహాలక్ష్మమ్మ దంపతులకు జన్మించారు. తొలి దళిత తెలుగు కథారచయిత్రి. ఆధునిక భావాలతో కథలు, వ్యాసాలు రా శారు. దళిత, స్త్రీవాద సాహిత్యానికి తొలి మెట్టు వేశారు. తాడి నాగమ్మ పుట్టిననాటికే అక్కడ కొంత దళిత చైతన్యం పురుడు పోసుకున్నది. ఉత్తమ ఉపాధ్యాయిని అవార్డు అందుకు న్నారు. పిల్లలను ఉన్నత చదువులు చదివిస్తూ పలువిధాలుగా సమాజసేవ చే శారు. రాసిన తొలి కథ ఇంకెక్కడి జయము 1934లో 'గృహలక్ష్మి' పత్రికలో ప్రచురితమయ్యింది. ఒక దళిత వనిత రాసిన తొలి తెలుగు కథ అది. దాంతో పాటు భారతి పత్రికలో కూడా కథలు అచ్చయ్యాయి. ఇది మాములు విషయం కాదు. ఇలా సామాజిక సమస్యలు, స్త్రీల సమస్యలు, మనుష్యుల మధ్య సంబంధాలు, ఈర్ష, ఆసూయ, ద్వేషాల గురించి మంచి అవగాహనతో రచనలు చేశారు. ప్రేమ సమస్య, ఒక ముద్దు, సమాధులపై సౌధం నిర్మించ వద్దు, స్త్రీకన్నీరు, ప్రపంచ ఘోష మానవ విప్లవం లాంటి రచనలు చేశారు. 1990 సెప్టెంబర్13న కన్నుమూశారు.

**నాగరాజ్యలక్ష్మి వెలువోలు :** జన్మస్థలం గుంటూరు జిల్లా అమృతలూరు. ఆంధ్రవిశ్వవిద్యాలయ తెలుగు పాఠ్యభాగ నిర్ణాయక సభ్యురాలిగా, గుంటూరు రచయితల సంఘం ఉపాధ్యక్షురాలిగా, టి.టి.డి.ఆస్థాన పండిత పరిషత్ సభ్యురాలిగా ఉన్నారు. సహస్ర వ్యాసరచన లక్ష్యంగా 350 వ్యాసాలు పూర్తి చేశారు. ఆకాశవాణి, దూరదర్శన్ లలో సాహిత్య, ఆధ్యాత్మిక రూపకాలు ప్రసారం చెయ్యబడ్డాయి. మొల్ల, మధురవాణి కవయిత్రుల పాత్రలు స్వయంగా పోషించారు. సామాజిక అంశాలతో రూపకాలు రచించి వేదికలపై ప్రయోక్తగా ప్రదర్శించారు. చిగురుపొదలు వ్యాససంపుటి, అక్షరవృక్షం, ఎక్కడికీ పయనం? కవితా సంపుటిలు; గుంటూరు తిరుపతి వెంకటేశ్వరస్వామి చరిత్ర, భగవద్గీత-వ్యక్తిత్వ వికాసం, ముకుందమాల-మరందవ్యాఖ్య, ప్రకృతి విలాసం రూపక సంకలనం, మా తెలుగుతల్లికీ సంగీత సాహిత్య రూపకాలు వెలువరించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రచురించిన తెలుగు వ్యుత్పత్తి కోశం 6 సంపుటాలకు సహసంపాదకత్వం వహించారు. రాయప్రోలు సుబ్బారావు సాహిత్య పురస్కారం వంటి అనేక పురస్కరాలు, సారస్వత కళానిధి బిరుదుని పొందారు. చిరునామా. ఫ్లాట్ నం.301,రామన్న టవర్స్, రామన్నపేట,1వ లైన్,గుంటూరు-522007. ఫోన్.9394113848.

**నాగలక్ష్మి పుట్టి :** రచయిత్రి, కవయిత్రి, ఫిలాటెలిస్ట్, విశ్రాంత ప్రధానోపాధ్యాయిని. గుడివాడలో నివాసం. అన్ని దిన, వార, పక్ష, మాస, త్రైమాసిక పత్రికలలోనూ వ్యాసాలు, కవితలు, జాతీయ నాయకుల జీవిత చరిత్రలు ప్రచురితం అయ్యాయి. ఆకాశవాణి విజయవాడ కేంద్రం లో కథలు ప్రసారం అయినాయి.

**నాగలక్ష్మి వారణాసి :** జన్మస్థలం కృష్ణాజిల్లా నూజివీడు. 1962 జూన్ 15 న జన్మించారు. కథకురాలు.ఎం.ఎస్.సి., ఎంఫిల్. చేశారు. ఫ్రీలాన్స్ రచయిత్రి, ఆర్టిస్ట్ కూడా. చిత్రం అంతర్జాతీయ పోటీలకు ఎంపికై లండన్ లో ప్రదర్శితమైంది. వీరు 'వాన చినుకులు(లలిత గీత మాలిక), ఆలంబన(కథా సంపుటి), అందమె ఆనందం, అంతాన్ని సాధించు, చిన్నబోదా చిన్నప్రాణం' రచించారు. వీరికి 2005 లో తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం; శ్రీమతి అబ్బూరి రుక్మిణమ్మ పురస్కారం, లేఖిని మహిళాచైతన్య పురస్కారం' లభించాయి.

**నాగవర్ధని సాధనాల :** జన్మస్థలం కృష్ణాజిల్లా నూజివీడు. 19.2.1945న జన్మించారు. ప్రస్తుతం హైదరాబాదులో ఉంటున్నారు. అమ్మాయి నవ్వింది, నిరీక్షణ, తర్వాతేమిటి?, జే.డా.హీ. మొదలైన 7 కథలను రచించారు.

**నాగవాణి అయాచితం(కొండవీటి) డా. :** జన్మస్థలం కృష్ణాజిల్లా దివిసీమలోని 'బందలాయి చెరువు' గ్రామం. 1958లో జన్మించారు. పరిశోధకురాలు. ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ఎం.ఏ.తెలుగులో గోల్డ్ మెడల్ సాధించి, ఎం.ఫిల్., పి.జి. డిప్లొమా చేసి; కాకతీయ విశ్వవిద్యాలయంలో పి.హెచ్.డి. చేశారు. అనర్గళ వాగ్ధాటిగల వ్యక్తి. 'ప్రతి వ్యక్తి ఒక భాగీరధుడు కావాలి' అనే గ్రంథాన్నిరచించి ప్రచురించారు. అనేక వ్యాసాలు, కథలు, రేడియో ప్రసంగాలు, రూపకాలు వంటి రచనలు చేశారు.

**నాగావళి పెంకి :** ఉపాధ్యాయిని, బాల సాహిత్య రచయిత్రి, కవయిత్రి. ఢిల్లి సాంస్కృతిక సంస్థ నిర్వహించిన సభలో ఆంధ్ర ప్రదేశ్ ప్రతినిధిగా పాల్గొన్నారు. రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ అవార్డ్ గ్రహీత. చిరునామా: ఎల్.ఐ.జి – 175, అలకనంద కాలనీ కంటోన్మెంట్, విజయనగరం – 535003. ఫోను నం: 9491206689.

**నాగేశ్వరి తటవర్తి :** జన్మస్థలం ప.గో,జిల్లా, గవరవం గ్రామం. ఆ.ప్ర.గ్రామీణ వికాశ్ బ్యాంక్ ఆఫీసర్. అన్ని ప్రముఖ పత్రికల్లో కథలు ప్రచురింపబడ్డాయి. కొన్ని బహుమతులు పొందినది. మమజీవన హేతునా నవల ప్రచురణకు స్వీకరించబడినది. చిరునామా: ఇంటి నెం: 10-11-30, గౌతమి నగర్, కొవ్వూరు- 534350, ప.గో.జిల్లా., ఫోన్: 9989773549.

**నిఖిల చలమలశెట్టి :** జన్మస్థలం విజయవాడ. 7.5.1993న జన్మించారు. ద డే ఐ స్టార్టెడ్ ఫ్లయింగ్  అనే ఇంగ్లీష్ మోటివేషనల్ బుక్ వ్రాశారు. మోటివేషనల్ స్పీకర్ కూడా. గ్లోబల్ గుడ్ విల్ అంబాసడర్  ఫర్ లింక్డ్ ఇన్ రిప్రజెంటింగ్ ఇండియాగా ఉన్నారు. చిరునామా: ఎఫ్321, శ్రీప్రకాశ టవర్స్, శిఖామణి సెంటర్, ప్రజాశక్తినగర్, మొగల్రాజపురం, విజయవాడ-10. కృష్ణా జిల్లా.

**నిర్మల ఘంటసాల :** స్త్రీవాద రచయిత్రి. జన్మస్థలం విజయవాడ. 'జుగల్ బందీ, ఏ కాల్ గర్ల్స్ మొనోలాగ్' వీరి రచనలు.

**నిర్మల తమ్మారెడ్డి. డా. :** జన్మస్థలం కృష్ణాజిల్లా విజయవాడ. 26.8.1940 న జన్మించారు. పరిశోధకురాలు, వ్యాసరచయిత్రి. శ్రీ వేంకటేశ్వరా విశ్వవిద్యాలయం, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయాలలో ఆచార్యులుగా ఉద్యోగం చేశారు. 1967లో 'కుమార సంభవ విమర్శనము' అనే సిద్ధాంత వ్యాసం సమర్పించి, ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండీ పి.హెచ్.డి. పట్టా పొందారు. ఇది 12వ శతాబ్దికి చెందిన 'నన్నెచోడుని' రచన. సిద్ధాంత వ్యాసం గ్రాంధిక భాషలో రచించారు. అనువాద పద్ధతి, పాత్ర పోషణ, సంభాషణా నైపుణ్యం, భావనా పటిమ, శైలీ విశేషాలు, శిల్ప విశేషాలు  జాను తెలుగు, దేశిమార్గ భేదాలు, వస్తు కవితా స్వరూప స్వభావాలు వివరించారు. ఇతని భాషపై తమిళ కన్నడ భాషా ప్రభావం పరామర్శించారు. 'గౌరీ కళ్యాణ' రచనా సమయంలో నన్నెచోడశ్రీనాథ రచనల తారతమ్య పరిశీలన చేశారు.  కుమారసంభవమే ప్రథమాంధ్ర ప్రబంధమనే విషయం నిరూపించారు.

**నిర్మల పారనంది :** జన్మస్థలం విశాఖపట్నం. 11.12.1951న జన్మించారు. ఎం.ఏ.(హిందీ) చదివి అధ్యపకురాలిగా పనిచేశారు. పెక్కు తెలుగు కథలను హిందీలోకి అనువదించారు. ఉత్తమ అనువాదకురాలుగా 2002లో కేంద్రప్రభుత్వ అవార్డు అందుకున్నారు. మే గాడ్ బ్లస్ యు, గమ్యమ్ ఏది? దసరా మామూలు, గుణపఠం మొదలైన 12 కథలు వ్రాశారు.

**నిర్మల ప్రభావతి పవని :**  జన్మస్థలం ఒంగోలు. 1933, మార్చి 12వ తేదీన జన్మించారు. కథా, నవలా రచయిత్రి.  కథాసంపుటాలు: అనాథ, ఎదలో ముల్లు, నాగరికత నవ్వుతోంది, స్త్రీ, హనీమూన్; నవలలు  శలభాలు, శాపగ్రస్తులు, రాలినపూలు.

**నిర్మల మద్దాలి :** జన్మస్థలం కృష్ణాజిల్లా విజయవాడ. 20.12.1951న జన్మించారు. అహల్యా శాప విమోచనం, (అ)న్యాయం, త్రిశంకు స్వర్గం, తల్లిలేని పిల్లాడు మొదలైన 14 కథలు వివిధ పత్రికలలో ప్రచురింపబడ్డాయి. విశ్రాంత

ఆదాయపన్ను అధికారి. క్షమయా ధరిత్రి కథాసంపుటిని వెలువరించారు. అనేక పత్రికలలో కథలు ప్రచురిత మయ్యాయి. కొన్ని కథలు బహుమతులు పొందాయి. చిరునామా: 14-240, ఫ్లాట్ నం.67, ఫేస్ 1, మహదేవపురం కాలనీ, అశోక్ నగర్, విజయవాద-7. ఫోన్. నం. 9440895011.

**నిర్మల(తుమ్మల నళిని) :** జన్మస్థలం విశాఖపట్నం. 15.10.1954న జన్మించారు. నిర్మల, వందన్, అరుణ పేర్లతో రచనలు చేశారు. ఎం.బి.బి.ఎస్. చదివి, వైద్య వృత్తిలో ఉన్నారు. బాలసాహిత్యాన్ని సృష్టించారు. మోతుబరి, నిశ్చయం, బతుకుభారం మొదలైన కథలు వ్రాశారు.

**నిర్మల, కొండేపూడి :** జన్మస్థలం విజయవాడ. "సందిగ్ధ సంధ్య" పుస్తకానికి ఫ్రీవర్స్ ఫ్రంట్ పురస్కారం 1988లో వచ్చింది. ఉమ్మడిశెట్టి సాహిత్య రజతోత్సవ పురస్కారం-2012 కోసం 'నివురు' కవిత్వం ఎంపికైంది. స్త్రీవాద కవయిత్రి. సందిగ్ధ సంధ్య, నడిచే గాయాలు, బాధాశప్తనది, మల్టీనేషనల్ ముద్దు, నివురు, లేబర్ రూమ్, మాతృదేవత, ఆడజన్మే మధురమని..., మొదలైన కవితా సంపుటాలనూ; 'శత్రుస్పర్శ' అనే కథా సంపుటినీ రచించారు. తాపీ ధర్మారావు స్మారక బహుమతి, ఫ్రీవర్స్ ఫ్రంట్ అవార్డు, నూతలపాటి గంగాధరం అవార్డ్, కుమారన్ ఆశాన్ జాతీయ బహుమతి, దేవులపల్లి కృష్ణశాస్త్రి అవార్డ్, బి.ఎన్. రెడ్డి సాహితీ అవార్డు, ఎస్.బి.ఆర్ అవార్డ్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం అవార్డ్ వంటి పురస్కారాలు పొందారు

**నిర్మలస్వాతి భాగవతుల :** జన్మస్థలం శ్రీకాకుళంజిల్లాలోని సీలేరు. 7.12.1977న జన్మించారు. రిటైర్మెంట్, అన్నా రాఖీకి రావా? మొదలైన కథలు వ్రాశారు.

**నిర్మలా ప్రియదర్శిని యం.(మోతివత్రా) :** జన్మస్థలం కడపజిల్లా పోరుమామిళ్ళ. 11.12.1951న జన్మించారు. కృష్ణాజిల్లా ఇబ్రహీంపట్నంలో నివసిస్తున్నారు. వ్యాసాలు, కథలు రచిస్తున్నారు. ఉన్నత స్నేహమ్, ఎదురుదెబ్బ, మనసే మందిరం, ప్రేమమైకమ్ మొదలైన కథలు వ్రాశారు.

**నిర్మలారాణి గుజ్జర్లమూడి :** జన్మస్థలం రేపల్లె. 27.10.1950న జన్మించారు. కృష్ణాజిల్లాలో విద్యాభ్యాసం చేశారు. అనంతపురంలో నివసిస్తున్నారు. 11కథలతో గాజుకళ్ళు అనే కథల సంపుటిని ప్రచురించారు. ఇంకా భ్రమ, అమ్మ అన్నది, చాపక్రింద నీరు, ఓన్లీ ఫర్ అడల్ట్స్ అనే విడి కథలు వివిధ పత్రికలలో వచ్చాయి.

**నీరజా చంద్రన్ చౌటపల్లి :** కాస్మటాలజిస్ట్, రచయిత్రి. అమలాపురంలో జన్మించారు. ముదినేపల్లిలో నివాసం. చిరునామా: ఇం.నం. 2-152, పెయ్యేరు, ముదినేపల్లి-521325., కృష్ణాజిల్లా. ఫోను నం. 8500878869.

**నీలవేణి పూడిపెద్ది :** నీలవేణి ఒరిస్సాలో తెలుగువారింట పుట్టి, విద్యాబుద్ధులు నేర్చి, సామర్లకోటలో ప్రభుత్వోద్యోగం చేశారు. భావం ఒక్కటే, మమత, నిర్ణయం మొదలైన కథలు వ్రాశారు.

**నీలిమ పసుపులేటి :** తెలుగు ఉపాధ్యాయురాలు, కవయిత్రి. ఆధ్యాత్మిక ప్రసంగాలు, సేవా కార్యక్రమాలు. చిరునామా. 40-802/1బి,నెహ్రూనగర్,కర్నూలు. ఫోన్.9849407593.

**పంకజ కుమారి :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'గుడివాడ'. 1956 జనవరి 24 న జన్మించారు. సంగీత ఉపాధ్యాయురాలు. వచన కవయిత్రి. 2006 శ్రీపొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో "రాగం యోగం" అనే పరిశోధనాత్మక వ్యాసం సమర్పించి, ప్రథమ స్థానం పొందారు, మొగలి రేకులు, అక్షర భారతి, ఉగాది కవితా స్రవంతి(కవితా సంపుటి ) రచించారు.

**పద్మ కుప్పిలి :** జన్మస్థలం విశాఖపట్నం. ప్రస్తుతం హైదరాబాద్లో నివసిస్తున్నారు. ఓవర్సీస్ ఎంటర్టైన్మెంట్ కంపెనీలో క్రియేటివ్ డైరెక్టర్గా పనిచేస్తున్నారు. [2] అమృత వర్షిణి అనే పుస్తక ప్రచురణతో సాహిత్య ప్రస్థానాన్ని ప్రారంభించిన అనేక కథలు వ్రాశారు. తన రచనల్లో సంభాషణలను క్లుప్తంగా, సూటిగా, పదునుగా, కళాత్మకంగా, వ్యంగ్యపూరితంగా చెప్పడం ప్రత్యేకత. కథా ప్రక్రియలోనే కాకుండా కాలమిస్టుగా కూడా సుపరిచితురాలు. 2009లో చాసో ట్రస్టు ప్రతియేటా అందించే ప్రతిష్ఠాత్మక చాగంటి సోమయాజులు చాసో సాహితీ పురస్కారాన్ని పొందారు. విహంగ వెబ్ పత్రికలో సంపెంగపూలవాన పేరుతో ఒక కాలమ్ నడుపుతున్నారు. పుస్తకాలు: మంచుపూలవాన కథా సంపుటం; మనసుకో దాహం కథా సంపుటం; ముక్త కథా సంపుటం; సాలభంజిక. పురస్కారాలు: ప్రతిష్ఠాత్మకమైన చాగంటి సోమయాజులు (చాసో) స్ఫూర్తి 16వ సాహితీ పురస్కారం.

**పద్మ దాసరి :** 1.8.1969న జన్మించారు. న్యాయవాది. ఆత్మీయ న్యాయస్థానం పుస్తకం వ్రాశారు. రేడియోలో మనోవర్తి మీద కథానిక ప్రసారం అయింది. చిరునామా. ఇం.నం. 14-1/2-18, పల్లి వీధి, విజయనగరం. ఫోను నం: 9490623523.

**పద్మ పాలడుగు.** ఎస్.జి.టి.టీచర్, ఎం.పి.యు.పి.స్కూల్, దొండపాడు, నరసరావుపేట మండలం, గుంటూరు జిల్లా.ఫోన్.9492906436.ఇం.నం.4-227, కొత్తపేట, నూజివీడు- 521201.

**పద్మ మందరపు :** పద్మ , లలిత అనే కలంపేరుతో రచనలు చేశారు. ఆశయం ఆచరణ, కలిసిరాని కన్నీరు, కట్నం తెచ్చిన పేచీ, రసన మొదలైన 14 కథలు వ్రాశారు.

**పద్మ మొదలి :** విజయవాడ వాస్తవ్యురాలు. మౌనంలోని స్వరం(కవితాసంపుటి), కథలు, వ్యాసాలు. తెలుగు బాషాదినోత్సవం సందర్భంగా శతకవుల సన్మానంలో సన్మానం పొందారు.

**పద్మ సింహాద్రి :** జన్మస్థలం కృష్ణా జిల్లా అవనిగడ్డ. పలు పత్రికలకు కవితలు వ్రాశారు. కవిసమ్మేళనాలలో పాల్గొన్నారు. అవధానాలలో పృ చ్ఛకురాలిగా కూడా వ్యవహరిస్తుంటారు. 'చింతల చెట్టు" అనే కవితల సంకలనాన్ని వెలువరించారు. చిరునామా: సింహాద్రి పద్మ, ఉపాధ్యాయిని, గాలిగోపురం గుడిదగ్గర, అవనిగడ్డ-521121, కృష్ణాజిల్లా. ఫోన్. 9290174624.

**పద్మజ కె.టి.వి.ఎస్.ఆర్.పి.పి. డా :** రచయిత్రి, పరిశోధకులు, తెలుగు అధ్యాపకులు, అమలాపురం. వివిధ వార, మాసపత్రికలలో కవితలు, సాహిత్య వ్యాసాలు ప్రచురించబడ్డాయి. శ్రీమద్రామాయణం-ప్రశ్నోత్తరమాలిక వెలువరించారు. ప్రముఖులచే సత్కారాలు పొందారు. భారత్, ఆంధ్రా బుక్ ఆఫ్ రికార్డ్స్ లో స్థానం సాధించారు. చిరునామా: నడవపల్లి-533212, తూ.గో.జిల్లా, ఫోన్ నం. 9248701457.

**పద్మజ దేవులపల్లి.డా. :** సంస్కృత, తెలుగు అధ్యాపకురాలు. 250కవితలు, 40కథలు, 105వ్యాసాలు, 3వచన సాహిత్య శతకాలు రచించారు. 8ముద్రితాలు, 4 అముద్రితాలు. విశ్వశ్రీ, సాహిత్యశ్రీ, సమన్వయశ్రీ పురస్కారాలు పొందారు. అనేక సంస్థలచే గౌరవింపబడ్డారు. ఆకాశవాణిలో 35ప్రసంగాలు. 100పైగా దేశవిదేశ సభలలో ప్రసంగాలు, పత్ర సమర్పణలు. చిరునామా: ఫ్లాట్ నం.102, ఇం.నం. 31-14-3, శ్రీసాయినివాస్, శాతవాహన నగర్, కూర్మన్నపాలెం, విశాఖపట్నం-530046. ఫోను నం. 9849692414.

**పద్మజ సబ్బినేని :** నాగాయలంక. కవిసమ్మేళనాలలోకవితాగానం చేశారు. కవితలు పత్రికలలో ప్రచురితమయ్యాయి ముద్రితగ్రంథం "హృదయవిపంచి". చిరునామా: పెదకమ్మవారిపాలెం(పోస్టు)-521120, నాగాయలంక మండలం. ఫోను నం. 9649667093

**పద్మలతా జయరాం నందివాడ :** జన్మస్థలం విజయవాడ. 6.10.1965న జన్మించారు. హైదరాబాద్లో నివసిస్తున్నారు. అనేక వ్యాసాలు, నాటికలు వ్రాశారు. రూబీ, కిట్టూ ఆత్మకథ, పురోహితం, కేబులూ కొత్తకాపురమూ మొదలైన కథలు 13 రచించారు.

**పద్మావతమ్మ పసుపులేటి :** జన్మస్థలం కడపజిల్లా ప్రొద్దుటూరు. 20.3.1944న జన్మించారు. మెట్రిక్యులేషన్ చదివారు. నమ్మకం, ఆడపిల్లలు, వేలం అనే కథలు వ్రాశారు.

**పద్మావతి కొప్పుల :** జన్మస్థలం విశాఖపట్నం. 28.10.1966న జన్మించారు. స్వయంకృతం, (వి)నయ వంచకులు, విముక్తి మొదలగు కథలు వ్రాశారు.

**పద్మావతి కొమ్మూరి :** జన్మస్థలం రాజమండ్రి. 1908లో జన్మించారు. ప్రఖ్యాత రంగస్థల నటీమణి, ప్రముఖ పత్రికలకు మహిళలకోసం శీర్షికలు నిర్వహించారు. సినిమాలలో నటించారు. ఆ రోజు దీపావళి, అభ్యుదయం, ఎందుకీ బతుకు, పొగడదండ మొదలైన కథలు వ్రాశారు.

**పద్మావతి తాటికోల.** తెనాలి తాలూకా నందివెలుగులో జన్మించారు. 400 కవితలు,150 కథలు, 6సీరియల్స్,40 పిల్లల కథలు,100వ్యాసాలు పత్రికలలో ప్రచురితం అయినవి. రేడియోలో కవితలు,కథలు ప్రసారం. 70కవిసమ్మేళనాల్లో పాల్గొని సత్కారం పొందారు.కవితా కుసుమాలు కవితా సంపుటి,గులాబిరేకులు,అంతర్ముఖం కథల సంపుటాలు వెలువరించారు. చిరునామా.ఇం.నం.5-54-49,బ్రాడీపేట 5/18.గుంటూరు-2. ఫోన్. 9441753376.

**పద్మావతి పొట్లూరి :** ఆధ్యాత్మిక రచయిత్రి. కృష్ణాజిల్లా 'విజయవాడ'లో 1965 మే 20 న జన్మించారు. తెలుగు ఉపాధ్యాయురాలు. రచనలు: శ్రీలలితా సహస్రనామ భాష్యం; శ్రీ సుందర కాండ; శ్రీవారి బంగారు మేడ.

**పద్మావతి మల్లాది :** జన్మస్థలం బాపట్ల. బి.ఏ, బి.ఇడి., హిందీ విశారద చదివారు. విద్యారంగంలో ఎం.ఇ.ఓ.గా రిటైరయ్యారు. 1995లో పద్మావతి కథా మంజరి అనే 16 కథల సంపుటిని విడుదల చేశారు.

**పద్మావతి శర్మ పొట్లూరి. డా. :** 20-05-1965 న జననం. ఉపాధ్యాయిని, ఆధ్యాత్మిక ప్రవచకురాలు, రచయిత్రి, జానపద గాయని, వ్యాఖ్యాత. 60 ఆధ్యాత్మిక పుస్తకాలు ముద్రించారు. మొత్తం 1,40,000 పుస్తకాలు భక్తులకు ఉచితంగా అందచేశారు. అమెరికాలోని బర్కెలీ విశ్వవిద్యాలయం నుంచి గౌరవ డాక్టరేట్ పొందారు. రచనా గాన శిరోమణీ, సేవారత్న, ధార్మిక సాహితీ సేవారత్న, పురస్కారాలు పొందారు. తెలుగు బుక్, వండర్ బుక్, భారత్ బుక్, జీనియస్ బుక్, గోల్డ్ స్టార్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డుల్లో స్థానం. చిరునామా:ఇంటి నెం: 103,కృష్ణ సాయి టవర్స్, శిఖామణీ సెంటర్, మొగల్రాజపురం, విజయవాడ – 520010 ఫోను నం: 9291468295.

**పద్మావతీదేవి.కె.ఎస్.ఎల్. డా.** 1.12.1963న కృష్ణా జిల్లా మచిలీపట్నంలో జననం. తెనాలిలో ఉపన్యాసకులు.రేడియో నాటక సాహిత్యంపై ఎం.ఫిల్.పట్టా, పుట్టపర్తి సత్యనారాయణాచార్యులు ప్రబంధ సాహిత్యంపై పరిశోధనకు పి.హెచ్.డి పొందారు. తెనాలిలోని శారదా సాహితీ సాంస్కృతిక సేవా సమితి అధ్యక్షురాలు. అనేక సదస్సుల్లో పత్ర సమర్పణలు, పత్రికల్లో వ్యాసాలు. చిరునామా. ఫ్లాట్ 203,3వ ఫ్లోర్, సింధు పేరడైజ్, గోలిడొంక రోడ్,లింగారావు సెంటర్, ఐతానగర్, తెనాలి- 522201, గుంటూరు జిల్లా. ఫోన్. 9492449540.

**పద్మిని చిలంకుర్తి :** 'యండమూరి వీరేంద్రనాథ్ సాహిత్యం అనుశీలన' అనే సిద్ధాంత గ్రంథం 2006లో రచించారు.

**నందిని నల్లఘట్ల :** జన్మస్థలం విజయవాడ. "శ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ వారి రచనలు సామాజిక దృక్పథం" అనే అంశంపై వ్యాసం రచించి, ఎం.ఫిల్ పట్టాను; "శ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ సాహిత్యం ఒక పరిశీలన" అనే పరిశోధనా వ్యాసం సమర్పించి పి.హెచ్.డి. పట్టాపొందారు. నందిని విజయవాడ లోని 'మాంటిసోరీ డిగ్రీకళాశాల'లో తెలుగు అధ్యాపకురాలుగా పనిచేస్తున్నారు. "ప్రవృత్తి" అనే కవితా సంకలనం ప్రచురించారు. తరచుగా కవితలు రాస్తుంటారు. వివిధ పత్రికలలో సాహిత్య సంబంధ వ్యాసాలు ప్రచురించ బడ్డాయి.

**పద్మినీ ప్రియదర్శిని భావరాజు :** జన్మస్థలం పశ్చిమగోదావరి జిల్లా నరసాపురం. తెలుగు సాహిత్యంలోని అన్ని ప్రక్రియలలోనూ అభినివేశం ఉంది. 30 కథలు, 3 నవలలు, అహోబిల నృసింహ శతకం, హాస్య వ్యంగ్య రచనలు, కవితలు, హాస్య కవితలు, గజల్స్, పత్రికలు, వెబ్ పత్రికలలో ప్రచురితమయ్యాయి. వ్యంగ్యాస్త్రం హాస్య వ్యాస సంపుటి, వెలుగు పూలు, అచ్చంగా తెలుగు కథలు ప్రచురించారు. అచ్చంగా తెలుగు వెబ్ పత్రిక స్థాపకులు, సంపాదకులు. దూరదర్శన్ యాదగిరి వారి సాహితీ సౌరభాలు నిర్వాహకులు, మైండ్ మిడియా ఆన్ లైన్ రేడియో ప్రోగ్రాం డైరెక్టర్. పలు సాంఘిక సమూహాలను నిర్వహిస్తున్నారు. చిరునామా: H.no. 12-5-32/14c, Flat no. 402, Sri Mahalakshmi Pride, Vijayapuri colony, South Lalaguda, Tarnaka, Secunderabad, Telangana - 500017.

**పద్మినీదేవి హోతా :** జన్మస్థలం తూ.గో.జిల్లా పెద్దాపురం. 28.5.1960న జన్మించారు. రాజమండ్రిలో నివసిస్తున్నారు. దాదాపు ఇరవై నవలలు వ్రాశారు . గౌతమి, ముడుపు, చెల్లి కావాలి, చుక్కలచీర, రాంగ్ నమ్బర్ మొదలైన 33 కథలు వ్రాశారు. నాటికలు వ్రాశారు.

**పరిపూర్ణ నంబూరి :** జన్మస్థలం కృష్ణాజిల్లా, 'బండారుగూడెం' గ్రామం. 1931లో జన్మించారు. కథకురాలు. 'మాకురావు సూర్యోదయాలు, పొలిమేర' అనే నవలలు; 'ఉంటాయి మాకూ ఉషస్సులు' అనే కథలసంపుటినీ వెలువరించారు.

**పార్వతి అడవికొలను :** జన్మస్థలం కొవ్వూరు. 22.3.1931న జన్మించారు. మఱ్రిపాలెంలో నివసిస్తున్నారు. వలయంలో బానిస అనే కథల సంపుటిని 9కథలతో; పద్మాలు పారిజాతాలు 6కథలతో; మందారాలమాల 10కథలతో వెలువరించారు.

**పార్వతి ఉప్పులూరి :** జన్మస్థలం పార్వతీపురం. 15.7.1952న జన్మించారు. తండ్రి, సర్కస్, జరిగినకథ మొదలైన కథలు వ్రాశారు.

**పార్వతి ఏలూరి :** జన్మస్థలం మచిలీపట్నం. 'సిగ్గు సిగ్గు' కవితతో ప్రసిద్ధులు.

**పార్వతీదేవి పూడిపెద్ది :** జన్మస్థలం మాచెర్ల. 24.12.1928న జన్మించారు. 9వ తరగతి చదివారు. సరస్వతీ నమస్తుభ్యం; దాహం, పత్నిభాగం మొదలగు కథలు రచించారు.

**పుల్లమాంబ, (గడ్డవరపు)పేరాల :** జన్మస్థలం బాపట్ల. మాయబజారులోని ఉమ్మారెడ్డి వీధి. 1931 ఆగస్టు 6వ తేదీన కోన సత్యనారాయణ, శ్రీలక్ష్మమ్మలకు జన్మించారు. రచయిత్రి మరియు స్త్రీల సాహిత్య వేదిక స్థాపకురాలు. 15వ ఏట తండ్రి మృతి చెందారు. అప్పటి నుంచి ట్యూషన్లు చెప్పుకుంటూ వచ్చిన సంపాదనతో ప్రైవేటుగా బి.ఎ., బి.ఇడి. చదివి 1954లో స్థానిక సరస్వతి మెమోరియల్ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయురాలుగా ఉద్యోగంలో చేరారు. అనంతరం ఎం.ఎ. చేసి 1958లో రాజమండ్రిలోని ప్రభుత్వ కళాశాలలో అధ్యాపకురాలిగా చేరి 1989లో కడపలోని ప్రభుత్వ జూనియర్ కళాశాలలో ప్రిన్సిపల్‌గా పదవీ విరమణ చేశారు. మనము మన మనస్సు, సమస్యలను ఎదుర్కోండి, ది రెడ్అనే ఆంగ్ల కథలను తెలుగులో అనువదించారు. శ్రీశ్రీ సాహిత్యంలోని సాంప్రదాయం, చలం స్త్రీలకు చేసిన మేలు, విశ్వనాథ రచన శిల్పం వంటి రచనలు చేశారు. రవీంద్రనాథ్ ఠాగూర్ రాసిన ఏక్లాగ్చెలో అనే గేయాన్ని తెలుగులో ఒకడినే నేనొక్కడినే అనే గేయంగా, గార్డెనర్ అనే గేయాల సంపుటిని తోటమాలిగా అనువదించారు. 'మనస్సులోని పొరలు' అనే కథకు అమెరికాలోని సాహితీ అకాడమీ 2001 అవార్డు వచ్చింది. 1984లో విశ్వనాథ నాటకాలపై పరిశోధన వ్యాసం వ్రాశారు. విశ్వనాథ సాహిత్య పీఠం వారి నుంచి అవార్డును అందుకున్నారు

**పుష్పలీల :** జన్మస్థలం బందరు. గేయరచయిత్రి

**పుష్పాంజలి ఆడె :** జన్మస్థలం నెల్లూరు. 28-10-1950న జన్మించారు. ఇంటింటికథ్మ పాకశాస్త్రోపాఖ్యానమ్మ ప్రేమోమీటర్; టెర్కోసా శారీ; కలలో రాకుమారులు మొదలైన 7 కథలు రచించారు.

**పుష్పాదేవి కోపూరి :** జన్మస్థలం గుంటూరుజిల్లా 'తెనాలి'. 10-10-1955 న జన్మించారు. 'విజయవాడ' లో నివాసం. వచన గేయ కవయిత్రి. 'స్నేహమయి, మరో కోణం, పరిమళం' అనే కథల సంపుటాలు; పూల రేకులు నానీలు; 'వాడని పూలు' అనే కవితా సంపుటిని ప్రచురించారు. చాలా కథలు, అనేక కవితలు దిన, వార పత్రికలలో ప్రచురింపబడ్డాయి. చిరునామా. 1-3/24-6సి, సంకావారి వీధి, విద్యాధరపురం, విజయవాడ-12. ఫోను నం. 9440766375.

**పుష్పావతి కందాళై :** జన్మస్థలం విజయవాడ. వచన రచనలో ప్రఖ్యాతి గాంచారు.

**పెబ్బిలి హైమవతి :** 16-2-1953న జన్మించారు. విశాఖపట్నంలో ఉంటున్నారు.

**ప్రతిమ వి :** జన్మస్థలం నెల్లూరుజిల్లా నాయుడుపేట. 27.8.1955న జన్మించారు. బి.ఎస్సి. చదివారు. సాంస్కృతిక సంస్థల నుంచి బహుమతులందుకున్న రచయిత్రి. పక్షి (18కథలు); యముడికి హాలిడే మొదలైన విడికథలు కూడా వ్రాశారు. ప్రభాకరశాస్త్రి గారి నిర్ధారణ. విష్ణుపారిజాతము ఇంకా పలు యక్షగాన రచనలు చేశారు.

**ప్రఫుల్ల మాడ్గుగుల డా. :** 11.9.1963న కర్నూలుజిల్లా నంద్యాల లో జన్మించారు. అనంతపురంలో నివాసం. అసోసియేట్ ప్రొఫెసర్, తెలుగు, సంస్కృత విభాగాలు. శ్రీమద్రామాయణ కల్పవృక్షం-రసానుశీలనం అంశంపై పిహెచ్‌డి. పట్టా పొందారు. సంస్కృతంలో శ్రీ కంస సంహార వీరకృష్ణ విజయ కావ్యయో సమగ్రానుశీలనం పై పరిశోధన చేసి పిహెచ్‌డి పొందారు. 32 పత్ర సమర్పణలు, 36ఆకాశవాణి ప్రసంగాలు చేశారు. శ్రీ సత్యసాయి స్త్రీ ధర్మ బోధిని రచించారు. చిరునామా : అసోసియేట్ ప్రొఫెసర్, శ్రీ సత్య సాయి ఇన్స్టిట్యూట్ ఆఫ్ హయ్యర్ లెర్నింగ్, అనంతపురం.

**ప్రభావతి యల్లకర :** జన్మస్థలం నెల్లూరుజిల్లా వెంకటగిరి. నవంబర్ 1927లో జన్మించారు. యుగధర్మం అనే 15 కథల సంపుటిని వెలువరించారు.

**ప్రభావతి వాసా :** జన్మస్థలం తూర్పు గోదావరి జిల్లా ఆత్రేయపురం. 1941లో జన్మించారు. సరోజినీనాయుడు వనితా మహావిద్యాలయలో రీడర్‌గా పనిచేసి పదవీ విరమణ చేశారు. సంఘం చేసిన భిక్షుకి, పరివర్తన, దేశబాంధవి. 50 నవలలు; 5 ఇతర రచనలు చేశారు.

**ప్రభాశాస్త్రి జోస్యుల :** జన్మస్థలం ప.గో.జిల్లా మండపాక. మైసూరులో నివాసం. 64సం. వయస్సులో రెండో ఎం.ఏ చేసి గోల్డ్ మెడల్ అందుకున్నారు. నీ కోసం పుస్తకం ప్రచురించారు. తెలుగు, కన్నడ భాషల్లో కవిత్వాన్ని రాసి ఎన్నో కవిసమ్మేళనాల్లో సత్కారాలు, హాస్య కవివతంస బిరుదుని పొందారు. చిరునామా. 13/1,1వ ఫ్లోర్,వాగ్దేవి నగర సెకండ్ స్టేజ్,టి.కె.లే ఔట్,మైసూర్-9.కర్నాటక. ఫోన్. 7349392037.

**ప్రమీల చిల్లరిగె :** విశ్రాంత ఉపాధ్యాయిని. సమైక్య కిరణాలు కవితా సంకలనానికి సంపాదకత్వం వహించారు. అనేక కవిసమ్మేళనాలలో కవితలు చదివి సత్కారం పొందారు. తిరుపతి, ఉడిపి, మంత్రాలయాల్లో పురందర దాసు కీర్తనలు పాడారు. ద్విశత, అష్టావధానాలలో పృచ్ఛకురాలిగా పాల్గొన్నారు. చిరునామా: 3/304, చాకిరేవు పాలెం, సురేఖా ప్యారడైజ్, పీర్ల పంజా ఎదురుగా, మచిలీపట్నం-521001. ఫోను నం: 9247216090.

**ప్రమీలాదేవి మంగళగిరి :** జన్మస్థలం కృష్ణాజిల్లా మచిలీపట్నంలో 1942 జులై 1 న జగదంబ, రాధాకృష్ణమూర్తి దంపతులకు జన్మించారు. ఎం.ఏ.; ఎం.ఫిల్ పట్టాలను అందుకున్నారు. బందరు హిందూకళాశాలలో చేశారు. రచనలు: తెలుగులో పద్యగేయ నాటికలు (ఆం.ప్ర. సాహిత్య అకాడమీ అవార్డ్); క్షేత్రయ్య(తె.వి.వి.ప్రచురణ); మన ప్రకాశం. పురస్కారాలు: ఉత్తమ గ్రంథ రచయిత్రి పురస్కారం; ఉత్తమ ఉపాధ్యాయిని, ఉపన్యాసకురాలు పురస్కారం; ఎల్మేర్ కూ అవార్డ్ అందుకున్నారు. వ్యాసకర్త్రి, జీవితచరిత్ర రచయిత్రి.

**ప్రమీలారాణి ఈరంకి :** జన్మస్థలం తూ.గో.జిల్లా తుని. 29.7.1959న జన్మించారు. సద్యోగం, యవనిక, తేలుకుట్టిన దొర మొదలైన కథలు వ్రాశారు.

**ప్రశాంతకుమారి జొన్నకూటి :** జన్మస్థలం గుంటూరు. 29.11.1969న జన్మించారు. పెక్కు బాలల కథలు వ్రాశారు. బుజ్జాయి, బాలమిత్ర, బాలతేజం పత్రికలలో కథలు వచ్చాయి.

**ప్రియదర్శిని యల్లాప్రగడ :** జన్మస్థలం గుంటూరుజిల్లా బాపట్లలో. గ్రాడ్యుయేషన్ చదివారు. జర్నలిస్టుగా పనిచేశారు. మానభంగం, గాడ్ ఫాదర్, గ్రూప్ డ్యాన్సర్, మొగలిపువ్వు మొదలైన కథలు వ్రాశారు.

**ప్రోలమాంబ :** 13వ శతాబ్ది, కవిబ్రహ్మ తిక్కనకు, అన్నగారైన ఖడ్గతిక్కన మాతృమూర్తి. ఫిబ్రవరి నెలలో జన్మించారు.గృహలక్ష్మి పత్రికకు ప్రబోధము రాట్నపునాదము మొదలైన రచనలు చేశారు.

**బంగారమ్మ చావలి (1897-1970) :** జన్మస్థలం తూర్పుగోదావరిజిల్లా, మోడేకుర్రుగ్రామం. జన్మించిన కవయిత్రి. ప్రముఖ కవి కొంపెల్ల జనార్ధనరావు సహోదరి. రచనలు ఆ కొండ, కప్పతల్లి పెళ్లి,తపస్సు, కార్తీక పూర్ణిమ, కాంచన విపంచి.

**బాపమ్మ బండి :** 17వ శతాబ్ది, మీనాక్షీ శతకం, బంధకవిత్వంలో పద్యాలు వ్రాశారు.

**బాపమ్మ :** ఈమె తల్లిదండ్రులు అద్దంకి పట్టాభిరామయ్య మరియు కొండమాంబ. రెండవకాన్పు సమయంలో తల్లి చనిపోగా, మేనమామ వెన్నేటి వేంకటరత్నం గారి వద్ద పెరిగింది. ఈమె 8వ యేట కందుకూరి వీరేశలింగంగారితో వివాహం జరిగింది. అప్పటికి వీరేశలింగంగారి వయసు 12 సంవత్సరాలు. ఈమె చిన్నతనంలో చదివిన చదువుల వల్ల, మేనమామ నేర్పిన సంస్కారం వల్ల తన భర్త సంఘసేవ కార్యక్రమాలలో చేదోడు వాదోడుగా నిలిచింది. భర్త స్థాపించిన వితంతు శరణాలయంలో వితంతువులకు విద్యాబుద్ధులు నేర్పి ఆదరించింది. వారికి తగిన వరులు దొరికి వివాహం జరిపినపుడు పెళ్ళి పీటలపై ఈ దంపతులు కూర్చుని కన్యాదానం చేసేవారు. ఈమె తను నివసించే ఆనందాశ్రమ ఆరామంలో వితంతువుల కొరకు ఒక ప్రార్థనా సమాజాన్ని స్థాపించారు. 1910, ఆగష్టు 11వ తేదీన మరణించారు.

**బాలపాపాంబ :** 16 వ శతాబ్దం, శైవ సాహిత్య రచయిత్రి: వీర వసంత వసుమతీశుని పుత్రిక. అక్కమహాదేవి చరిత్రను యక్షగానరీతిలో రచించారు.

**బాలసరస్వతి శ్రీపతి :** జన్మస్థలం కృష్ణాజిల్లా మచిలీపట్నం. 16.7.1964న జన్మించారు. ఎం.ఏ.(తెలుగు) చేశారు. కథకురాలు,కవయిత్రి, వ్యాసరచయిత్రి. రచనలు: వీనస్; అగుపించని అదృష్టం; మానవ శ్రేయస్సు(కథలు). పురస్కారాలు: విశ్వసాహితి ఉత్తమ బహుమతి; సాహితీ కిరణం కన్సొలేషన్ బహుమతి.

**బాలాత్రిపురసుందరి భమిడిపాటి :** జన్మస్థలం తూర్పుగోదావరి జిల్లా రాజోలు గ్రామం. నివాసం విజయవాడ. ముంగిటిముత్యాలు బాలల గేయకావ్యం తెలుగుభాషోద్యమ కోణంలోంచి చేసిన ప్రసిద్ధ రచన. 116 మహర్షుల చరిత్రలు, అవతారాల కథలు, అనే పరిశోధనాత్మక రచనలు, యోగి వేమన జీవిత చరిత్ర, బంగారుకలలు, కొత్తబంగారులోకం వంటి 15 పుస్తకాలు వెలువడ్డాయి. కృష్ణాజిల్లా రచయితల సంఘం ద్వారా అనేక జాతీయ సదస్సులకు సహకరించారు. కనకదుర్గ ప్రభ, భక్తిసుధ, చిత్సుధ మొదలైన ఆధ్యాత్మిక పత్రికలలో కూడా తరచూ కనిపిస్తూ ఉంటాయి. ఉయ్యూరు సరసభారతి వారు, కైకలూరు సాహితీ మిత్రులు,

దుర్గామల్లేశ్వరస్వామి దేవస్థానం వారు ఉగాది ఉత్తమ కవయిత్రి పురస్కారాన్ని అందించి గౌరవించారు. విజయవాడ సిద్ధార్థ మహిళా కళాశాల వారు సత్కరించారు. వృత్తిరీత్యా విజయవాడ బిఎస్ఎన్ఎల్ లో సీనియర్ సూపర్ వైజర్ గా పనిచేసి పదవీ విరమణ చేశారు.

**బీనాదేవి :** 1935లో జన్మించారు. ప్రసిద్ధిచెందిన తెలుగు రచయిత్రి. అసలు పేరు భాగవతుల త్రిపురసుందరమ్మ. భర్త భాగవతుల నరసింగరావుతో కలిసి అనేక రచనలు చేశారు. వీరిపై రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి ప్రభావం ఎక్కువ. భర్త మరణం తర్వాత 1990 నుండి స్వయంగా కథలూ, వ్యాసాలూ రాస్తూ బీనాదేవి కథలూ కబుర్లూ సంపుటిని వెలువరించారు. 1972 లో వీరికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది.

**భాగ్యలక్ష్మి జె. :** జన్మస్థలం చిత్తూరు జిల్లా మదనపల్లె. 1940 ఫిబ్రవరి 2 న జన్మించారు. ఇంగ్లీషు, తెలుగు భాషలలో గుర్తింపు పొందిన రచయిత్రి. దేశ రాజధాని ఢిల్లీలో స్థిరడ్డారు. ఆంగ్లసాహిత్యం అధ్యయనం చేసి కమ్యూనికేషన్లో శిక్షణ పొందారు. అడ్వాన్స్ మేనేజ్మెంట్, పబ్లిక్ రిలేషన్స్, బుక్ పబ్లిషింగ్ విషయాలలో దేశ విదేశాల డిప్లొమాలను సంపాదించారు. జర్నలిస్టుగా పేరుపొందారు. ఇంగ్లీషు తెలుగు భాషలలో రచయిత్రిగా 45కు పైగా పుస్తకాలను రచించారు. తొలిరోజులలో జానకి అనే కలంపేరుతో రచనావ్యాసంగం సాగించారు. ప్రచురణలలో కథాసంకలనాలు, కవితాసంకలనాలు, సాహిత్య విమర్శ, అనువాదాలు ఉన్నాయి. వివిధ విషయాల గ్రంథాలకు సంపాదకత్వం వహించారు. రఫీ అహమ్మద్ కిద్వాయి బహుమతి, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ రచయిత్రి అవార్డు, జ్యేష్ఠ లిటరరీ అవార్డు, ఆర్.కె.నారాయణ్ అవార్డు, సిద్ధార్థ కళాపీఠం విశిష్టవ్యక్తి పురస్కారం, గృహలక్ష్మి స్వర్ణకంకణము పొందారు.

**భాగ్యలక్ష్మి. పింగళి.** రచయిత్రి. విజయవాడ వాస్తవ్యులు. 40వ్యాసాలు, 5కథలు, 150వంటలు కొన్ని కవితలు, జోక్స్ ప్రచురింపబడినవి.వ్యాసాలు, కవితలు, వంటల పోటీలలో బహుమతులు పొందారు.టి.వి.చానల్స్ లో 10గేం షోలలో పాల్గొన్నారు.టి.వి.లో 25 వంటల ప్రోగ్రాములు చేశారు. చిరునామా. ఇం.నం. 29-5-585, బ్రాడ్ వే జిం పక్కన, 2/14, బ్రాడీపేట, గుంటూరు-522002. ఫోన్.9398163836.

**భాగ్యశ్రీ కె.కె..** వివిధ దిన, వార, పక్ష,మాస పత్రికలలో 300 కథలు, 23 నవలలు, కొన్ని కవితలు ప్రచురింపబడ్డాయి. అయిదారు కథలు ఆకాశవాణిలో

ప్రసారమయ్యాయి.కొన్ని రచనలు బహుమతులు పొందాయి. పలు సాహితీ సంస్థల ద్వారా సత్కారాలు పొందారు. వీరు ప్రముఖ రచయిత శ్రీ కె.కె.రఘునందన భార్య. చిరునామా: 23-4-2, ఫ్లాట్ నం. 413,రాజ్యలక్ష్మి టవర్స్, లింగధారిపేట, విజయనగరం-2. ఫోను నం. 8096738953.

**భానుమతీ రామకృష్ణ :** జన్మస్థలం ప్రకాశం జిల్లా, ఒంగోలు. 1926 వ సంవత్సరము సెప్టెంబరు 7న జన్మించారు. ప్రముఖ దక్షిణ భారత సినిమానటి, నిర్మాత, దర్శకురాలు, స్టూడియో అధినేత్రి, రచయిత్రి, గాయని మరియు సంగీత దర్శకురాలు. ఎంతో ధైర్యంగా పదమూడేండ్ల చిరుత ప్రాయంనాడే 1939 లో విడుదలైన వరవిక్రయం అనే సినిమాలో నటించారు. భరణీ స్టూడియో నిర్మించి, అనేక చిత్రాలు ఈ దంపతులు నిర్మించారు. బహుముఖ ప్రజ్ఞా విశేషాలతో ఎన్నో సాధించి, ఎందరికో ఆదర్శంగా నిలిచారు. భానుమతి రచనలు అత్తగారి కథలు, నాలో నేను, అత్తగారూ నక్సలైట్లూ. ఇంకా కొన్ని కథానికలు కూడ రచించారు. 2005 డిసెంబర్ 24 న చెన్నై లోని తన స్వగృహంలో భానుమతీ రామకృష్ణ పరమపదించారు.

**భానుమతీ రామారావు మంథా :** జన్మస్థలం తూర్పు గోదావరిజిల్లా, అమలాపురం. 1946 జనవరి 11న వడ్లమాని సుభద్ర, సత్యనారాయణమూర్తి దంపతులకు జన్మించారు. ప్రముఖ రచయిత్రి. 22 నవలలు, 75కు పైగా కథలు వ్రాసింది. గుంటూరులో బి.హెచ్.ఉన్నత పాఠశాలలో మాధ్యమిక విద్య, ప్రభుత్వ మహిళా కళాశాలలో బి.ఎస్సీ చదివారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి రసాయన శాస్త్రంలో ఎం.ఎస్సీ చదివి అక్కడే ఫోటో కెమిస్ట్రీలో పిహెచ్‌డి. పట్టాను సంపాదించింది. అమెరికాలోని డెన్వర్ యూనివర్సిటీ నుంచి ఎం.ఎస్. పట్టా స్వీకరించారు. కథాసంపుటాలు: అనంతవాహిని, 'మంథా'రమాల, జీవనవాహిని. పురస్కారాలు లేఖిని సంస్థ వారి మాతృదేవ పురస్కారం, కళాసాగరం వారి జీవితకాల సాఫల్య పురస్కారం, బోయి హైమవతి గారిచే భీమన్న సాహితీనిధి నుంచి కొత్తూరి సుబ్బయ్య దీక్షితులు జీవిత పురస్కారం మొదలైన 13 అవార్డులు అందుకున్నారు.

**భానుశ్రీ :** జన్మస్థలం విశాఖపట్టణం. 31.7.1955లో జన్మించారు. కవిత్వం, వ్యాసాలు రచించారు. అనేక రేడియో ప్రసంగాలు చేశారు. కారుణ్యపు కాంతి కిరణం, కూర తగూ, నీహారిక మొదలైన 10కథలు వ్రాశారు. బొమ్మారెడ్డిపల్లి వెంకట శకుంతలా భానుశ్రీ.

**భారత సరోజినీదేవి పులపకూరి :** జన్మస్థలం తూ.గో.జిల్లా పిఠాపురం. 10.12.1956లో జన్మించారు. అద్దింటి గోల మొదలైన కథలు వ్రాశారు.

**భారతి ముక్తేవి డా. :** జన్మస్థలం కృష్ణాజిల్లా పెదన. 10.6.1941న జన్మించారు. విశ్రాంత అసోసియేట్ ప్రొఫెసర్, హైదరాబాద్. ప్రముఖ రచయిత్రి. రచనలు: 52నవలలు, కథానికా సంపుటాలు, వ్యాస సంపుటాలు, మోనోగ్రాఫ్ లు. 300పైగా వివిధ పత్రికలలో కాలమ్స్. జాషువా, గురజాడ, సి.పి.బ్రౌన్, సుశీలానారాయణరెడ్డి అవార్డులు, ఆం. ప్ర. ప్రభుత్వ ఉగాది పురస్కారం, తెలుగు విశ్వవిద్యాలయ ఉత్తమ రచయిత్రి పురస్కారం, అమెరికాలో జీవన సాఫల్య పురస్కారం అందుకున్నారు. చిరునామా: ఫ్లాట్ 258, రోడ్ 4, త్రిమూర్తి కాలనీ, మహేంద్ర హిల్స్, సికంద్రాబాద్–26. ఫోను నం. 9989640324.

**భారతీదేవి దేశిరాజు :** జన్మస్థలం బాపట్ల. 1914 జూలైలో జన్మించారు. 'స్త్రీలకు నీతిసౌశీల్యములే ప్రధానములు. అవిలేని విద్య విద్య కాదు. సుందరులందరికీ భావములు తప్పక అనుసరణీయములు.' అని తన అభిప్రాయము తెలిపారు. ఆకాశవాణిలో ప్రసంగాలు; కాళిదాసు శకుంతల, ఉత్తరకాండ సీత, సూరన ప్రణీతమైన కళాపూర్ణోదయంలో సుగాత్రి పాత్ర మీద విమర్శనము; "కవిత్రయ కవితారీతులు–తరువాతి కవులపై వారి ప్రభావము" రచనా పాటవానికి మచ్చుతునకలు. రచనలు: కాంతాశతకము (కందపద్యములతో) ముక్తాంబ, సత్యాప్రతిజ్ఞ అను ఏకాంకికలు; శ్రీకృష్ణ మహిమార్ణవము అనే వచన గ్రంథము; ముద్దుకృష్ణ అనే గీతపద్య శతకము. 1958లో గృహలక్ష్మి స్వర్ణకంకణము పొందారు.

**భాస్కర బాలభారతి,** రిటైర్డ్ ప్రిన్సిపాల్,అనంతపురం. నిర్మల్ పెయింటింగ్స్ వేస్తారు, కవయిత్రి. 150 కవితలు, కొన్ని కథలు పత్రికలలో ప్రచురితం. ఐకాన్ మదర్ అవార్డ్ తీసుకున్నారు. ఫోన్. 9491353544.

**భువనేశ్వరీదేవి పరుచూరి :** తనసోదరి పరుచూరి అన్నపూర్ణాదేవితో కలిసి జంటగా రచనలు చేశారు. 20వ శతాబ్దపు పూర్వార్థంలో పేరెన్నికగన్న జంటకవయిత్రులు, వీరాభిమన్యు, తెలుగుబిడ్డ, దైవమహిమ ఖండకావ్యాలు, 'కర్షకా!' గేయకావ్యం, "కృషీవలా!" పద్యకావ్యం వ్రాశారు. హరిజనోద్యమంలో పాల్గొన్నారు. ఖడ్గపాయసము, వీరబలివేదిక లాంటి ప్రయోగాలు పేరెన్నికగన్నాయి.

**భూలక్ష్మి కాకుమాను. డా.** 29.9.1967న జననం.కొర్లపాటి శ్రీరామమూర్తి చిత్రశాల అనుశీలనంపై ఎం.ఫిల్.,ఆంధ్ర మహాభాగవతం–మహిళల మహనీయత పై పిహెచ్‌డి పొందారు. 10 పత్ర సమర్పణలు చేశారు. 2 స్వర్ణ పతకాలు, భాగవతరత్న

అవార్డు పొందారు. శ్రీ రాఘవ యాదవీయం సంస్కృత శ్లేష కావ్యానికి శ్రీ భావనాలోచనం పేరుతో వ్యాఖ్య వ్రాశారు. చిరునామా. తెలుగు ఉపన్యాసకురాలు, ఎస్.ఎన్.ప్రభుత్వ జూనియర్ కళాశాల, చేబ్రోలు, గుంటూరు.

**భూలక్ష్మి కేతా :** హిందీ ఉపాధ్యాయురాలు. వర్ధమాన రచయిత్రి. బాలసాహిత్య రచనలు విశిష్టత.

**భ్రమరాంబ గంజాం :** తిరుపతి వాస్తవ్యులు. భౌతిక రసాయనశాస్త్ర ఉపాధ్యాయిని. 2800 కవితలు, వందలసంఖ్యలో పద్యాలు, 60కథలు, 100 వ్యాసాలు, లేఖలు వ్రాశారు. వీరి రచనలు అన్ని ప్రధాన పత్రికలలో ప్రచురింపబడ్డాయి. సహస్ర కవి చక్రవర్తిని, సహస్ర కవిభూషణ, గురజాడ జాతీయస్థాయి పురస్కారం, గుర్రం జాషువా స్మారక పురస్కారం, స్వీయగానకోకిల బిరుదు వంటి అనేక సత్కారాలు అందుకున్నారు.

**మంగమణి పురిటిపాటి :** జన్మస్థలం కృష్ణాజిల్లా కౌతరం. 1.7.1942లో జన్మించారు. ప్రేమాయణం, నేటి బాలలే రేపటి విప్లవకారులు మొదలైన 6 కథలు రచించారు.

**మంగమ్మ జె (జోలెపాళ్యం) డా. :** జన్మస్థలం చిత్తూరు జిల్లా మదనపల్లె. 1925, సెప్టెంబరు 12న జన్మించారు. ఆల్ ఇండియా రేడియోలో మొట్టమొదటి మహిళా న్యూస్ రీడర్‌గా ప్రసిద్ధురాలు. ఎం.ఎ., బి.ఎడ్ చదివారు. ఢిల్లీ విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేట్ పట్టాను పొందారు. తెలుగు, ఇంగ్లీషు, ఫ్రెంచ్, ఎస్పరాంటో, తమిళ, హిందీ భాషలలో ప్రావీణ్యం ఉంది. ఆలిండియా రేడియో న్యూఢిల్లీలో 10 సంవత్సరాలు ఎడిటర్‌గా, న్యూస్ రీడర్‌గా పనిచేశారు. 1962 నుండి నేషనల్ ఆర్కీవ్స్, ఢిల్లీలో పరిశోధనలు చేశారు. బోధనా రంగంలో సుమారు పాతిక సంవత్సరాల అనుభవం సంపాదించారు. కేంద్ర సమాచారశాఖ, విదేశాంగ శాఖలలో కీలకమైన పదవులను నిర్వహించారు. రచనలు : ఆంధ్రదేశంలో క్రైస్తవ మిషనరీల సేవ, ఇండియన్ పార్లమెంట్, శ్రీ అరబిందో, విప్లవవీరుడు అల్లూరిసీతారామరాజు, అనిబీసెంట్ లను తెలుగులోను; 'ప్రింటింగ్ ఇండియా, అల్లూరి సీతారామరాజు, లాస్ట్ పాలెగార్ ఎన్కౌంటర్ విత్ ది బ్రిటిష్ ఇన్ ది సీడెడ్ డిస్ట్రిక్ట్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, 18461847, ది రేట్ స్కూల్స్ ఆఫ్ గోదావరి' అనే పుస్తకాలను ఇంగ్లీషులోను రచించారు. న్యూఢిల్లీ తెలుగు అకాడమీ ఉగాది పురస్కారం, కుప్పం రెడ్డమ్మ సాహితీ పురస్కారం, సిద్ధార్థ కళాపీఠం (విజయవాడ) విశిష్ట అవార్డు మొదలైన సత్కారాలను పొందారు. ఆంధ్రానైటింగేల్ అనే బిరుదును సంపాదించారు. మదనపల్లెలోని స్వగృహంలో 2017, ఫిబ్రవరి 1న తన 92వ యేట మరణించారు.

**మంగాదేవి చొంగా :** జన్మస్థలం ప.గో.జిల్లా నరసాపురం. 2.9.1962న జన్మించారు. రచించిన 2 కథలకు బహుమతులు వచ్చాయి.

**మంగాదేవి నన్నపనేని డా. :** తన జీవితాన్ని అంకితభావంతో మహిళలకు, బాలలకు అంకితం చేశారు. శ్రీ వెంకటేశ్వర బాలకుటీర్ మరియు చేతనా చారిటబుల్ ట్రస్ట్ ద్వారా గత 50 ఏళ్ళుగా పనిచేశారు. 'లెనిన్, హెలెన్ కెల్లర్ జీవితా గాథ, రాణి రుద్రమ దేవి' మొదలైన రచనలు బాలల కోసం చేశారు. బాల సాహిత్య పురస్కారం పొందారు. 1955 మార్చి 15 గృహలక్ష్మి పత్రికలో వ్రాసిన కవిత "ఎన్నటికో సుఖాప్తి/ఈ దుఃఖమహాసమాప్తి/ ఎన్నాళ్లని స్త్రీజనాళి/వహిస్తుంది కొఱకొఱలను/ఎన్నాళ్లని కంటినీరు కురిపిస్తుంది బొటబొట...???" ఇలా ఆమె ఆ రోజుల్లో అభ్యుదయభావాలతో కూడిన రచనలు చేశారు.

**మంగామణి సాలిపల్లి :** కలంపేరు శ్రీమణి. విశాఖపట్నం. చిగురాకులు, కవితాంతరంగాలు, కవితాసంపుటులు వెలువరించారు. పందూరు చెరువుగట్టు బ్లాగుకు 2017లో తెలుగులో ఉత్తమబ్లాగుగా ఇండీబ్లాగర్ అవార్డు. చిరునామా: 54-4-29, ఫ్లాట్ నం.9, సాయి స్రవంతి రెసిడెన్సీ, ఇసుకతోట, విశాఖపట్నం. ఫోన్. నం 8639145603.

**మంజు యనమదల :** జన్మస్థలం కృష్ణాజిల్లా నరసింహాపురం. విజయవాడలో నివాసం. మనసులో భావాలను అక్షరాలుగా "కబుర్లు-కాకరకాయలు" బ్లాగులో రాస్తుంటారు. అక్షరాల సాక్షిగా నేను ఓడిపోలేదు, చెదరని శి(థి)లాక్షరాలు అనే కవితా సంపుటాలు, సడిచేయని (అ)ముద్రితాక్షరాలు అనే లేఖల వ్యాససంపుటి, అంతర్లోచనాలు వ్యాససంపుటి, వాణి కొరటమద్దితో కలిసి రాసిన కవితలు గుప్పెడు గుండెసవ్వడులు అనే పేరుతో కవితాసంపుటిగా వెలువరించారు. పలు పత్రికలలో వీరి కవితలు, వ్యాసాలు ప్రచురితమవుతుంటాయి. చిరునామా: మంజు యనమదల సీతారామ రెసిడెన్సీ, ఫ్లాట్ నెంబర్ 202, పటమటలంక, ఈనాడు వెనుక, విజయవాడ-520010, చరవాణి 9490769585.

**మంజుల అయినవోలు. డా.** విశిష్టాద్వైత సిద్ధాంతంలో స్తోత్ర సాహిత్య వైభవం అంశంపై పిహెచ్‌డి చేశారు. పలు జాతీయ,అంతర్జాతీయ సదస్సుల్లో పత్ర సమర్పణలు చేశారు. కథ,కవితలు రాయడం అభిరుచి. చిరునామా. తెలుగు ఉపన్యాసకురాలు, శ్రీ దుర్గా మల్లేశ్వర సిద్దార్థ మహిళా డిగ్రీ కళాశాల, విజయవాడ. ఫోన్. 9348809264.

**మంజులత ఆవుల :** 1948లో జన్మించారు. ఎం.ఏ.(తెలుగు) చదివారు. శ్రీపొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో ఉపకులపతిగా చేశారు. తెలుగు

అకాడమీ సంచాలకులుగా పనిచేశారు. చిన్నారి ప్రేమలేఖ, డామేజ్, నిన్ను ప్రేమించలేదు మొదలైన 4 కథలు వ్రాశారు.

**మంజులా శివానందం :** జన్మస్థలం చిత్తూరుజిల్లా దామాల్ చెరువు గ్రామం. 23.1.1963లో జన్మించారు. ప్రకృతివికృతి, ఎదురు దెబ్బ మొదలైన కథలు వ్రాశారు.

**మంజువాణి కాటూరు :** జన్మస్థలం నెల్లూరుజిల్లా ఎరువూరు గ్రామం. 13.11.1965లో జన్మించారు. స్పృహ అనే కథా సంకలనం రచించారు.

**మణి కోపల్లె.** కలంపేరు మణినాథ్. జన్మస్థలం గుంటూరు. హైదరాబాదులో స్థిరపడ్డారు. దేశాభిమాని, త్యాగశీలి కోపల్లె హనుమంతరావు జీవితచరిత్ర ను వెలువరించారు. పత్రికలకి, ఆకాశవాణికి కథలు, వ్యాసాలు రచించారు. ఫ్రీలాన్స్ జర్నలిస్ట్ గా ప్రముఖులతో జరిపిన ఇంటర్వ్యూలు పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. దేశంలోని ప్రముఖ ఆలయాల గురించి వ్యాసాలు; చలనచిత్రాలు, సాహితీసాంస్కృతిక కార్యక్రమాలు, పుస్తకసమీక్షలు చేశారు. రెండు నాటకాలు ప్రదర్శింపబడ్డాయి. అవధానాలలో పృచ్ఛకురాలిగా పాల్గొన్నారు. మాతృదేవోభవ పురస్కారం అందుకున్నారు.

**మణి గోగినేని :** జన్మస్థలం రాజమండ్రి. 19.7.1946లో జన్మించారు. బి.ఎస్‌సి. చదివారు. తొలిచూపు, గెలుపు నీది, తానొకటి తలిస్తే మొదలైన 35 కథలు వ్రాశారు.

**మణి వడ్లమాని :** కథా రచయిత్రి. 75కు పైగా కథలు రచించారు. అన్ని ప్రముఖ వార, మాస పత్రికల్లో వీరి కథలు ప్రచురితం. చతుర మాసపత్రికలో వీరి నవల 'జీవితం ఒక ప్రవాహం' అచ్చయింది. అమెరికా తెలంగాణా సంఘం, వంగూరి ఫౌండేషన్ ఇంకా ఇతర అంతర్జాతీయ సంస్థల బహుమతులు పొందారు.

**మదమంచి అనంతమ్మ :** 20వ శతాబ్దపు పూర్వార్ధ కవయిత్రి. గుంటూరుజిల్లా పెదకూరపాడు వాస్తవ్యురాలు. మాంచాల పద్యకావ్యం; నాయకురాలు, సీతమ్మపెండ్లి వచనకావ్యాలు; వర్షర్తువు ఖండకావ్యం వ్రాశారు. భావకవితా రీతుల్లో వ్రాసిన పద్యకావ్యాలు ఈమెవి. పల్లెపదాలు కూడా వ్రాశారు.

**మనోరంజని కప్పల :** ఉపాధ్యాయిని, గోపాలపట్నం, విశాఖపట్నం. పునీతులు శ్రీ తోమాసువారి చరిత్ర ప్రచురించారు. కథలు, కవితలు, వ్యాసాలు రాస్తున్నారు. చిరునామా. 2-79,వేదిక కిడ్స్ ప్లే స్కూల్, బాజీ జంక్షన్, గోపాలపట్నం-530027.విశాఖపట్నం. ఫోన్.7799030405.

**మనోరమ యడవల్లి :** తెలుగు అధ్యాపకురాలు, నరసరావుపేట. శ్రీమాతా వైభవం గ్రంథాన్ని రచించారు. చిరునామా: ఆంజనేయ స్వామి గుడి దగ్గర, ఇస్సపాలెం గ్రామం, ములకలూరు పోస్టు, నరసరావుపేట మండలం. ఫోను నం. 9515849440.

**మనోహర ఆదూరి :** ఉపాధ్యాయిని, కవయిత్రి. ప్రకాశం జిల్లా ఒంగోలు వాస్తవ్యులు. ఫోను నం. 9985783550.

**మమత ఐల :** తెలుగు ఉపాధ్యాయిని. హైదరాబాద్. కథలు,కవితలు,పద్యాలు రాయడం అభిరుచి. చిరునామా: ఇం.నం.4-35-379/17, ఆల్విన్ కాలని, కూకట్ పల్లి, హైదరాబాద్. ఫోన్. 9247593432.

**మలయవాసిని కోలవెన్ను :** 1944 అక్టోబరు 8న జన్మస్థలం విజయవాడ. 1944 అక్టోబరు 8న జన్మించారు. 1964లో ఆంధ్రవిశ్వవిద్యాలయం నుంచి బ్యాచిలర్ ఆఫ్ ఆనర్స్, 1965లో ఎం.ఎ డిగ్రీని, 1971లో తత్త్వశాస్త్రంలో డాక్టరేట్ పొందారు. విజయవాడ లోని మేరీస్ స్టెల్లా కళాశాలలో అధ్యాపకురాలిగా పనిచేశారు. తరువాత 1970-71 ల మధ్య కందుకూరి రాజ్యలక్ష్మి మహిళా కళాశాలలో అధ్యాపకులుగా పనిచేశారు. వీరు అహమ్మదాబాదులో పోస్టు స్కాలర్ చేశారు. ఆంధ్రా విశ్వవిద్యాలయంలో అధ్యాపకురాలిగా, రీడరుగా, ప్రొఫెసరుగా కొనసాగారు. 1987-90 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు విభాగానికి అధిపతిగానూ, 1992-95 లలో బోర్డ్ స్టడీస్ కు చైర్ పర్సన్ గానూ పనిచేసారు. 60 రేడియో చర్చలను ప్రసారం చేసారు. ముద్రిత రచనలు ఆంధ్ర జానపద సాహిత్యము రామాయణము, ఆంధ్ర వాఙ్మయము రామాయణము, వివిధ భారతీయ భాషలలో రామాయణము, శ్రీరామనవమి, పువ్వులు మినిస్ట్రీ ఆఫ్ ఎడ్యుకేషన్ గవర్నమెంట్ ఆఫ్ ఇండియా, ఆంధ్ర కవయిత్రులు అంధ్రవిశ్వకళాపరిషత్ ప్రచురణ, ఆంధ్ర బాలల వికటకవితా వినోదిని, ఆంధ్రసాహిత్య చరిత్ర (బాలలకోసం), భారతవాణి, పౌరాణిక పురంధ్రులు (టి.టి.డి.ముద్రణ).

**మస్తానమ్మ.డి. డా.** 15.7.1981న జన్మించారు. కడపజిల్లా బద్వేల్ స్వస్థలం. తిరుపతిలో పోస్ట్ డాక్టరల్ ఫెలో.వ్యాసచంద్రిక, గమనం, చేతన మరో 2 పుస్తకాలు వెలువరించారు. 50పైగా పత్రసమర్పణలు, 50 పరిశోధక వ్యాసాలు. కలహంస, తెలుగు భాషాసేవ పురస్కారాలు మొ॥ పొందారు. చిరునామా.18-5-279, సప్తగిరి నగర్, కె.టి.రోడ్, తిరుపతి-517507.

**మహాలక్ష్మమ్మ గొట్టిపాటి :** జన్మస్థలం కృష్ణాజిల్లా దివితాలూక 'ఘంటసాల పాలెం'. మల్లిపెద్ది గొట్టిపాటి బాపనయ్యగారితో వివాహమైంది. స్త్రీజన సంక్షేమం కోసం, 'ఆధ్యాత్మిక జ్ఞాన సమాజం' స్థాపించారు. సామాన్యులకు అర్థమయ్యే రీతిలో శంకరాచార్య మండనమిశ్రుల సంవాదాన్ని' నవల రూపంలో రచించారు. ఇంకా 'భగవద్గీతా బాలబోధిని, భగవద్గీతా కథాజ్యోతి' అనే గ్రంథాలు రచించారు.

**మహాలక్ష్మమ్మ వాజపేయాజుల :** భారతనీతులు, పోతన భక్తి వైరాగ్యములు మొదలైన రచనలు చేశారు. భర్త రామసుబ్బరాయశాస్త్రి

**మహాలక్ష్మి. వి.కె.టి.** స్వస్థలం ప.గో.జిల్లా సిద్ధాంతం గ్రామం. ప్రస్తుతం విశాఖ జిల్లా ఎలమంచిలిలో తెలుగు ఉపన్యాసకురాలు. తెలుగు సాహిత్యంలో గల్పికలు-ఒక పరిచయం అంశంపై పరిశోధన చేసి పిహెచ్‌డి. పొందారు. 1 కథ, వ్యాసాలు, పుస్తక సమీక్షలు పత్రికలలో ప్రచురితం. వక్త. చిరునామా: శ్రీ గురజాడ అప్పారావు ప్రభుత్వ డిగ్రీ కళాశాల, ఎలమంచిలి, విశాఖ జిల్లా, పిన్. 531055. ఫోన్. 9701132864.

**మహెజబీన్ :** జన్మస్థలం నెల్లూరు. 1961లో జన్మించారు. పూర్తి పేరు మహెజబీన్ మహ్మద్. 20 వ శతాబ్ది చివరి దశకంలో అత్యంత ప్రభావశీలంగా కవితలల్లిన కవయిత్రి. సమకాలీన కవుల, విమర్శకుల మన్నన పొందిన అతికొద్ది మంది కవయిత్రులలో ఒకరు. తెలుగు స్త్రీవాద కవయిత్రులలో చెప్పుకోదగిన వారిలో జబీన్ ఒకరు. 1991 నుండి కవిత్వం రాస్తున్నారు. ఓల్గా తదితరులతో కలిసి 'నీలి మేఘాలు' ను వెలువరించారు. 1997లో తన తొలి కవితా సంకలనం "ఆకురాలు కాలం" ను వెలువరించారు. ఇందులో 26 కవితలు ఉన్నాయి. కవిత్వంలో మనకు స్త్రీవాద దృక్పథం, విప్లవ సానుభూతి కనిపిస్తుంది. రమణ సుమనశ్రీ అవార్డు (1999), జ్యోత్స్న కళాపీఠం అవార్డు, రాజీవ్ గాంధీ మానవ సేవా అవార్డు, స్త్రీ శక్తి పురస్కార్, తెలుగు భాషా పురస్కారం అందుకున్నారు.

**మాధవి బొమ్మిశెట్టి :** తెలుగు ఉపాధ్యాయురాలు. 2 వ్యాసాలు, 1 కవిత ప్రచురింపబడ్డాయి. సంఘ సంస్కరణలో వేమన, ఆంధ్రుల చరిత్ర పూర్వ దశ వ్యాసాలు వ్రాసారు. అనేక కవిసమ్మేళనాలలో పాల్గొని సత్కరింపబడ్డారు. చిరునామా: పడమటి వీధి, సీతారామపురం పోస్ట్, నెల్లూరు జిల్లా - 524310, ఫోను నం: 9440507830.

**మాధవి శిష్టా :** రచయిత్రి, కవయిత్రి, వ్యాఖ్యాత్రి. 3 కవితా సంపుటాలు వెలువరించారు. దూదర్శన్, రేడియో, కవిసమ్మేళనాలలో కవితా గానం చేశారు.

దూరదర్శన్ ధర్మ సందేహాలు, అక్షరాలు అంతర్యాలు లో వ్యాఖ్యాత్రి. పలు సంస్థల పురస్కారాలు అందుకున్నారు. ఫోను నం. 7382183258.

**మాధవీలత. గల్లా.** 21.1.1975న పుట్టారు. చిత్తూరులో నివాసం. తెలుగు ఉపాధ్యాయిని, కవయిత్రి. జ్ఞానభారతి, సాహితీవిద్యారత్న, వాగ్గేయరత్న బిరుదులు కలవు. రేడియోలో పిల్లలచే కదంబ కార్యక్రమాలు వేయిస్తారు. ఫోన్. 9573802406.

**మారుతీ కుమారి కొమాండూరు :** విశ్రాంత ఆంధ్రోపన్యాసకురాలు, పరిశోధకురాలు, తెలుగు మరియు చరిత్ర అధ్యాపకురాలు. ఆధ్యాత్మిక సాహిత్య ఉపన్యాసాలు చేస్తారు. సూక్తి సుధాతరంగాలు, సాహితీ సౌరభం గ్రంథాలు వెలువరించారు. చిరునామా : 201 గ్రేస్‌రెసిడెన్సీ, కె.ఆర్.నగర్, బళ్లారి క్రాస్ రోడ్, కర్నూలు-518003. సెల్ : 8639063324.

**మాలతి నిడదవోలు :** ఆంగ్లభాష మరియు సాహిత్యాలలో మాస్టర్స్ డిగ్రీలు చేసారు. లైబ్రరీ సైన్స్ లోనూ ఎం.ఎ. చేసారు. లఘు కథా రచయిత్రిగా సుపరిచితురాలు. 9 సంవత్సరాల పాటు తిరుపతిలో లైబ్రేరియన్‌గా 1964-1973 మధ్య పనిచేసారు. 1973 నుండి అమెరికాలో ఉంటున్నారు. ప్రముఖ తెలుగు రచయిత్రి, కథకురాలు, సాహిత్య విమర్శకురాలు, తెలుగు ఉపాధ్యాయులు. పంథొమ్మిది వందల యాభైల్లో కథలు వ్రాయడం మొదలు పెట్టి ఇప్పుడు తన స్వంత వెబ్ పత్రికలు తెలుగు, ఇంగ్లిష్ తూలికలు నిర్వహిస్తూ, దాదాపు వంద తెలుగు కథల్ని ఇంగ్లీష్ లోకి అనువదించి, ఇంగ్లిష్ లో మూడు అనువాద కథా సంకలనాలు. The Spectrum of My People ( జైకో బుక్స్) "From My Front Porch" (సాహిత్య అకాడెమీ ప్రచురణ) All I wanted to Read and other stories వెలువరించారు. నవలలు (నాలుగు భాగాలు), చాతకపక్షులు. కథా సంకలనాలు: కథామాలతి 1, కథామాలతి 2, కథామాలతి 3, కథామాలతి 4, కథామాలతి 5, ఎన్నెమ్మకతలు మొదటి భాగం, ఎన్నెమ్మ కతలు రెండో భాగం. వ్యాస సంకలనాలు : వ్యాసమాలతి మొదటి సంపుటము, వ్యాసమాలతి రెండవ సంపుటము, వ్యాసమాలతి మూడవ సంపుటము. ఆంగ్ల రచనలు Telugu Women Writers, 1950-1975, Analytical study, Eminent scholars and other essays (anthology of articles published on thulika.net.), All I Wanted was to Read (short stories), My Little friend (short stories) వెలువరించారు.

**మాలతీ చందూర్ :** జన్మస్థలం కృష్ణాజిల్లా, 'నూజివీడు'. 1930లో 'జ్ఞానాంబ, వెంకటేశ్వర్లు' దంపతులకు జన్మించారు. రచయిత్రి, కాలమిస్టు, సాహిత్య అకాడమీ బహుమతి గ్రహీత. ఏలూరు లోని సెయింటె థెరిస్సా స్కూల్లో ఇంగ్లీషు మీడియంలో

చదివారు. 1947లో మద్రాసు చేరుకున్నారు. 1949లో వారి రచనా వ్యాసంగం ప్రారంభమైంది. అప్పట్లో రేడియోలో రచనలను చదివి వినిపించేవారు. అక్కడే ఆచంట జానకిరాం, బుచ్చిబాబు, జనమంచి రామకృష్ణ, పి.వి.రాజమన్నార్, మునిమాణిక్యం నరసింహారావు వంటి వారిని దగ్గరగా గమనించే అవకాశం కలిగింది. 1952 నుంచి రచనా వ్యాసంగంలో తీరిక లేకుండా గడిపారు. ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో 1952 నుండి ఆడవారి కోసం 'ప్రమదావనం, డియర్ అబ్బీ' వంటి శీర్షికలను రెండు దశాబ్దాలకు పైగా నడిపారు. తెలుగులో పాతిక దాకా, మహిళా ప్రధాన నవలలు రాయటమే కాక 300 కు పైగా ఆంగ్ల రచనలను తెలుగులోకి అనువదించారు. ఇవి 'పాత కెరటాలు' శీర్షికన స్వాతి మాసపత్రికలో ప్రచురించారు. నవలా రచయిత్రిగా, మహిళా వృత్తాలపై కాలమిస్టుగా అనేక పురస్కారాలు అందుకొన్నారు. అనేక తమిళ రచనలను కూడా తెనిగించారు. రచనలు: వంటలు పిండి వంటలు, అందాలు అలంకారాలు, మహిళలకు మధుర జీవనం, పాత కెరటాలు, జాబులు జవాబులు, ప్రశ్నలు జవాబులు, చంపకం చెదపురుగులు (కథల సంపుటి), కాంచన మృగం, వైశాఖి, మనసులోని మనసు, ఆలోచించు, ఏమిటీ జీవితాలు, భూమిపుత్రి, మధుర స్మృతులు, ఓ మనిషి కథ, రాగరక్తిమ, మేఘాల మేలిముసుగు, కలల వెలుగు, బ్రతక నేర్చిన జాణ, జయలక్ష్మి, కృష్ణవేణి, శతాబ్ది సూరీడు, శిశిర వసంతం వీరి నవలలు. 2013 ఆగస్టు 21 న చెన్నైలో కన్ను మూసారు.

**మాలతీరావు :** జన్మస్థలం విశాఖపట్టణం. 26.6.1937న జన్మించారు. వీరి కథలకు అనేక బహుమతులు వచ్చాయి. రాద్ధాంతంపై సిద్ధాంతం, రాద్ధాంతం, బ్రోకర్ శేఖర్, వకుళాదేవి డైరీ, ప్రాప్తం మొదలైన 46 కథలు రచించారు. మాలిక అనే పేరుతో పుస్తకంగా వెలువడ్డాయి.

**మాశశి యు. :** జన్మస్థలం పశ్చిమ గోదావరిజిల్లా, తణుకు. 25.11.1938న జన్మించారు. ఎం.ఏ.(సైకాలజీ), ఎం.ఏ.(తెలుగు) చేశారు. లెక్చరర్గా తిరుపతి మహిళా డిగ్రీకళాశాలలో పనిచేసి, రిటైరయ్యారు. అనేక నవలలు వ్రాశారు. పసిహృదయాలు, నటన సూత్రధారి మొదలైన 15 నవలలు పత్రికలలో వచ్చాయి.

**మిసెస్ డ్రైడన్ :** తెలుగులో పత్రికా సంపాదకత్వం వహించిన ఆంగ్ల వనిత.

**మీనాకుమారి మాచిరాజు :** 30స్కెచ్ లు, వందల సంఖ్యలో కవితలు వ్రాశారు. లలిత గీతాలు, సినీ గీతాల విభావరులలో పాడుతూ ఉంటారు. చిరునామా : ఇం.నం. 58-6-14/1, కరణంగారి వీధి, పటమట, విజయవాడ-10. ఫోను నం. 9246418222.

**మీనాకుమారి ములుకుదుటి. డా. :** పరిశోధకురాలు, వ్యాసరచయిత్రి. జన్మస్థలం గుంటూరుజిల్లా, బాపట్ల తాలూకా, 'ములుకుదురు' గ్రామం. 1.7.1952లో జన్మించారు. పొన్నూరులో భాషాప్రవీణ, 1977లోఎం.ఏ.(గోల్డ్ మెడలిస్ట్)చేసి, 'కరుణశ్రీ కృతుల సమాలోచన' అనే సిద్ధాంత వ్యాసం సమర్పించి, పి.హెచ్.డి. పట్టా పొందారు. వీరు విజయవాడ శారదా కళాశాలలో లెక్చరర్గా పనిచేస్తున్నారు. వీరు 'ఉద్యోగ పర్వం, చెన్నకేశవ శతకం రచించారు. కళాశాల వార్షిక సంచికలో వ్యాసాలు, కవితలు వ్రాశారు. ఆకాశవాణి ప్రసంగాలు చేశారు, దూరదర్శన్ చర్చలలో పాల్గొన్నారు.

**మీనాక్షి సౌరంబాకం :** జన్మస్థలం విజయవాడ. 14.2.1985లో జన్మించారు. వ్యాసరచయిత్రి. ఎం.ఏ. సామాజిక శాస్త్రం అభ్యసించారు. 'ఆర్ట్స్ వెల్ఫేర్ సొసైటీ' ఛైర్మన్గా ఉన్నారు. చాలా పత్రికలకు వివిధ కళలపై అనేక వ్యాసాలు రచించారు.

**మీనాక్షీ శ్రీనివాస్ :** విశ్రాంత ఆంధ్రా బ్యాంక్ మేనేజర్, కాకినాడ. 4రేడియో నాటికలూ, కొన్ని కవితలూ, 100 కథలు ప్రచురితం. నిశీధిలో నక్షత్రం 22 కథల సంపుటి వెలువరించారు. 4నవలలు పత్రికలలో ప్రచురితం. చిరునామా : ఇం.నం.67-7-1/1, అశోక్ నగర్, కాకినాడ-533003. తూ.గో.జిల్లా.

**మీనాక్షీదేవి వేదుల :** 25.6.1917లో జన్మించారు. దినదిన గండం, ప్రమోషన్ మొదలైన కథలు వ్రాశారు.

**మీరాబాయి కల్లే :** జన్మస్థలం అనంతపురం. 2.9.1944లో జన్మించారు. ఎమ్.ఏ., పి.జి. పిహెచ్.డి., డి.టి.ఇ. చదివారు. రీడర్ ఇన్ ఇంగ్లీష్ గా పనిచేశారు. ఆంగ్ల సాహిత్యంపై పరిశోధనా వ్యాసాలు వ్రాశారు. పసి మనసులు, పూల రథం వాడిపోయింది, గుడ్ బై మై ఫ్రెండ్ మొదలైన 16 కథలు వ్రాశారు.

**ముంతాజ్ బేగం :** కథానికా రచయిత్రి. జన్మస్థలం కృష్ణాజిల్లా "విజయవాడ". 1955 ఫిబ్రవరి 15 న జన్మించారు. హిందీ ప్రధానంగా బి.ఏ. ఉత్తీర్ణులై, ఉపాధ్యాయురాలిగా ఉద్యోగం చేసి, పదవీ విరమణ చేశారు. 1979 'గీటురాయి'లో "అందం ఆత్మసౌందర్యం" వ్యాసం రాయడంతో, రచనావ్యాసంగం ఆరంభమై, 'కథానికలు, వ్యాసాలు విరివిగా రచించారు. ఇస్లాం సందేశ ప్రచారమే లక్ష్యంగా ప్రస్తుతం విజయవాడ లబ్బీపేటలో నివసిస్తున్నారు.

**ముదిగొండ సీతారామమ్మ :** మచిలీపట్నం నివాసి అయిన సీతారామమ్మ కందపద్యాలతో శివ శతకం, ఉయ్యూరు, సువర్చలాంజనేయ స్వామిపై చంపక మాలలతో మరొక శతకం రచించారు. ముఖపుస్తకంలో నిరంతరాయంగా

పద్యాలు రాస్తూనే ఉన్నారు. బాలకవి. మధురకవి బిరుదాంకితులైన శ్రీ.శే. భర్త ముదిగొండ నాగ మల్లికార్జునరావుగారు.

**ముద్దుపళని (1730-1790) :** జన్మస్థలం కృష్ణాజిల్లా దివిసీమలో, దేవదాసీల కుటుంబం. ముద్దుపళని 18వ శతాబ్దానికి చెందిన తెలుగు కవయిత్రి. 1739 నుండి 1763 వరకు తంజావూరు నేలిన మరాఠనాయక వంశపు రాజు ప్రతాపసింహ యొక్క భోగపత్ని. ప్రతాపసింహుని ఆస్థానంలో నెల్లూరు శివరామకవితో పాటు ఆస్థాన కవయిత్రి కూడా. ముద్దుపళని యొక్క గురువు తిరుమల తాతాచార్యుల వంశానికి చెందిన వీరరాఘవ దేశికుడు. ముద్దుపళని తల్లి పోతిబోటి, అమ్మమ్మ తంజనాయకి కూడా కవియిత్రులని, తండ్రి పేరు ముత్యాలు అని రాధికా స్వాంతనముకు రాసిన ప్రవేశికలో తెలుస్తున్నది. ముద్దుపళని రాసిన రాధికా సాంత్వనము ఒక గొప్ప శృంగార ప్రబంధ కావ్యం. అలిగి కోపంతో ఉన్న రాధను కృష్ణుడు బుజ్జగించడం ఈ కావ్య ఇతివృత్తం. దీనికి యిళా దేవీయము అని కూడా పేరు. చిన్ని కృష్ణుడికి అకింతమైన ఈ గ్రంథంలో నాలుగు భాగాల్లో 584 పద్యములు ఉన్నాయి.

**మేరీ లీలా కుమారి బిట్ల :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'శంకరంపాడు'. 1969లో జన్మించారు. దళిత సాహిత్య రచయిత్రి. వీరు 'గుడిసె ఏసోబు(దళిత సాహిత్యం), His thoughts first, మహాత్మా జ్యోతి బాపూలే' వంటి రచనలు చేశారు.

**మైథిలి, (అబ్బరాజు) చీమలమర్రి డా. :** 27.7.1966 లో జన్మించారు. అంతర్జాలంలో ప్రసిద్ధి చెందిన రచయిత్రి. గుంటూరు వైద్య కళాశాలలో ఎంబిబిఎస్ చదివారు. ఎన్.టి.ఆర్ వైద్య విశ్వవిద్యాలయంలో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేశారు. 1988 జనవరి 24తేదీన ఎముకల వైద్యనిపుణులు డాక్టర్ చీమలమర్రి శ్రీనివాస్ ను వివాహం చేసుకున్నారు. ఇరవై ఏళ్ళకు పైగా పశ్చిమ గోదావరి జిల్లాలోని తాడేపల్లిగూడెంలో అమృత హాస్పిటల్స్ ను విజయవంతంగా నిర్వహించి 2014 లో విరమించుకొని బెంగుళూరులో స్థిరపడ్డారు. ఆంధ్ర మహాభారత నిఘంటువును రచించిన అబ్బరాజు సూర్యనారాయణ తాతగారు. 19 వ శతాబ్దంలో నెల్లూరు నుంచి అముద్రిత గ్రంథ చింతామణి అనే పత్రికను నడిపిన ప్రసిద్ధ సాహిత్య వేత్త పూండ్లరామకృష్ణయ్య ముత్తాత. ఆంగ్ల సాహిత్యంలో కూడా అభినివేశం ఉంది. సాహిత్యంతో పాటు సంగీతం, చిత్రలేఖన పట్ల అభిరుచి, అవగాహన ఉన్నాయి. 2016 లో ' నిమగ్న ' సారస్వత వ్యాసాల సంపుటాన్ని ప్రచురించారు. వ్యాసాలు, అనువాదాలు, కథలు అన్నిటిలోనూ కృషి చేస్తున్నారు. అంతర్జాలంలో ఏడువేలమందికి పైగా సభ్యులున్న సాహిత్యం సమూహాన్ని నిర్వహిస్తున్నారు. క్షీరసాగరం కథకు జ్యోతి పురస్కారం 2014లో అందుకున్నారు.

**మొల్ల ఆతుకూరి (14401530) :** 16వ శతాబ్దపు తెలుగు కవయిత్రి. కడప జిల్లా గోపవరం మండలం గోపవరం గ్రామం ఈమె స్వస్థలం. ద్విపదలో మొల్ల రామాయణం వ్రాశారు. మొల్ల రామాయణము ఆరు కాండములలో 138 పద్యములతో కూడుకున్నది.ఈ కావ్యమును మొల్ల కేవలం ఐదు రోజులలో రాసినదని ప్రతీతి. కృష్ణదేవరాయల సమకాలీనురాలు. మొల్ల రచన ఆనాటి ప్రబంధ పద్ధతికి విరుద్ధంగా వాడుక భాషకు దగ్గరగా ఉంది.

**మొల్ల ఆతుకూరి :** కడప జిల్లా గోపవరం మండలము గోపవరం గ్రామం. ఈ గ్రామం కడప పట్టణనికి 56 కి.మీ దూరములో ఉంది. బద్వేలుకు 5 కిలోమీటర్ల దూరంలో ఉంది. ఈ ప్రాంతానికి చెందినదని మొల్ల రామాయణంలోని ఈ క్రింది పద్యం ద్వారా తెలుస్తోంది. 'గావ్య సంపద క్రియలు నిఘంటువులును గ్రామము లేవియు నెఱుఁగ, విఖ్యాత గోపవరపు శ్రీ కంతమల్లేశు వరముచేత నెఱిఁ గవిత్వంబుఁ జెప్పఁగా నేర్చుకొంటి", 'సన్నుత సుజ్ఞాన సవివేకి వాల్మీకి' దగ్గరనుంచి 'తిక్కకవిరాజు భోజు' వరకూ మొల్ల నుతించింది. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవుల్లో ఒకళ్లని కూడా తనపద్యంలో పేర్కొనని కారణంగా రాయలవారి సమయానికే కవయిత్రి అయి ఉండాలని భావిస్తున్నారు. చరిత్ర పరిశోధకులు 1525సం. ప్రాంతమని నిర్ణయించారు. ఆజన్మబ్రహ్మచారిణి అని చెప్తారు. మొల్ల రామాయణం ఆరు కాండల్లో 138 పద్యాలతో ఉంటుంది. ఈ కావ్యాన్ని మొల్ల కేవలం ఐదు రోజుల్లో రాసిందని చెప్తారు. మొల్ల రచన ఆనాటి పద్ధతికి విరుద్ధంగా వాడుక భాషకు దగ్గరగా ఉంది.

**మోహన పింగళి :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'చల్లపల్లి'. 24-12-1958 లో సీతాదేవి, శ్రీనివాసరావు దంపతులకు జన్మించారు. ఉపాధ్యాయురాలుగా పనిచేస్తున్నారు. భక్తి కవయిత్రి. రచనలు రుక్మిణీకళ్యాణం, సత్యసాయి సూక్తి.

**మోహనాంగి :** 16వ శతాబ్ది. శ్రీకృష్ణదేవరాయల కుమార్తె.మరీచీ పరిణయం కావ్య రచయిత్రి. ఇది ఉపలబ్దము. కానీ ఈ మధ్యనే ఈ కావ్య పీఠిక మాత్రము లభించి ప్రచురింపబడింది.

**మోహిత కౌండిన్య :** 12.6.1987 న గుంటూరులో జన్మించారు. ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో ట్రాన్స్మిషన్ ఎగ్జిక్యూటివ్. తెలుగు రేడియో ప్రపంచంలో మొదటిసారిగా తెలుగమ్మాయి కార్యక్రమ రూపకల్పన, నిర్వహణ. ఆకాశవాణి బి.గ్రేడ్ నాటక కళాకారిణి. రేడియోకి, పత్రికలలో 25 కథలు,15కవితలు వ్రాశారు. వ్యాసాలు రాస్తున్నారు. ఆంధ్రప్రభ ఆదివారంలో వైబ్రేషన్స్ కాలం నిర్వహిస్తున్నారు.

**యామిని కోడే :** కవయిత్రి తెలుగువెలుగు కవయిత్రి. నవమల్లెతీగ, ప్రస్థానం, కౌముది, ప్రజాశక్తి లాంటి అనేక దిన, వార, మాస పత్రికలలో వీరి కవితలు ప్రచురితం. కెనడా పత్రిక వారి తెలుగుతల్లి పోటీలో బహుమతి, తొలకరి 'ముఖ పుస్తకం' వారి పోటీలో ఉత్తమ కథ బహుమతి పొందారు.

**యోగ ప్రభావతీదేవి గోగినేని :** 36సం.గా అధ్యాపకురాలు. దూరవిద్యాకేంద్రంలో విద్యావిషయక సలహాదారు. 36 పి. హెచ్ డి డిగ్రీలు, 23 ఎం.ఫిల్ డిగ్రీలకు పరిశోధక పర్యవేక్షకులు. జాతీయ అంతర్జాతీయ సదస్సుల్లో 162 పత్ర సమర్పణలు, 45 సాహితీ ప్రసంగాలు. 225పరిశోధనావ్యాసాలు ప్రచురితం. 4గ్రంథాలు ముద్రించారు. 20గ్రంథాలకు సంపాదకత్వం వహించారు. సాధునిర్మలాదేవి విశిష్ట సాహితీ పురస్కారం అందుకున్నారు. చిరునామా. ఫ్లాట్ 41, లక్ష్మీపురం కాలనీ, పోరంకి-521137. విజయవాడ రూరల్. ఫోన్. 9908073543.

**రంగనాయకమ్మ ముప్పాళ్ళ :** జన్మస్థలం పశ్చిమ గోదావరి జిల్లా బొమ్మిడి గ్రామం. 1939లో జన్మించారు. సుప్రసిద్ధ మార్క్సిస్టు, స్త్రీవాద రచయిత్రి. రచనల్లో రామాయణాన్ని మార్క్సిస్టు దృక్పథంతో విమర్శిస్తూ రాసిన రామాయణ విషవృక్షం ఒకటి. స్త్రీవాద రచయిత కావడం వల్ల 'పురుష వ్యతిరేకి'గానూ, రామాయణ విషవృక్షం రాయడం వల్ల 'బ్రాహ్మణ వ్యతిరేకి' గానూ పేరు. వ్రాసిన నవల స్వీట్ హోం. నీడతో యుద్ధం పుస్తకంలో గోరా, జయగోపాల్, సి.వి., ఎమ్.వి. రామమూర్తి వంటి నాస్తిక రచయితల్ని విమర్శిస్తూ వ్యాసాలు వ్రాయడం వల్ల విశాఖపట్నం నాస్తికులు ఈ సీరియల్ ని నిలిపి వెయ్యాలని కోరుతూ పత్రిక ఎడిటర్లకి ఉత్తరాలు వ్రాసారు. ఆధునిక తెలుగుసాహిత్యంలో తీవ్ర సంచలనం కలిగించిన యండమూరి వీరేంద్రనాథ్ నవల 'తులసిదళం'ని విమర్శిస్తూ 'తులసిదళం కాదు గంజాయి దమ్ము' అనే వ్యాస సంకలనం వ్రాసారు. వాటిలో యండమూరితో బాటు ఆ నవలకు ముందుమాట వ్రాసిన డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావును కూడా విమర్శించడం వల్ల అతను పరువు నష్టం దావా వేసి గెలిచాడు. తాడేపల్లిగూడెంలో ఉన్నత పాఠశాలలో చదివి 1955లో ఎస్.ఎస్.ఎల్.సీ ఉత్తీర్ణురాలయ్యారు. 12 నవలలు; రామాయణ విషవృక్షం, అసమానత్వం నుంచి అసమానత్వం లోకే, నీడతో యుద్ధం నిశిత పరిశీలనా, దగాకోరు పరిశీలనా?, జన సాహితితో మా విభేదాలు, కాపిటల్ 3 ఇతర రచనలు చేశారు.

**రంగాజమ్మ :** 17వ శతాబ్దం, ఉషాపరిణయం, ప్రబంధం: మన్నారుదాసవిలాసం యక్షగాన ప్రబంధం. విజయరాఘవుని ఆస్థానం.

**రజని పాటిబండ్ల :** జన్మస్థలం తిరువూరు. స్త్రీవాద కవయిత్రిగా, రచయిత్రిగా సుప్రసిద్ధురాలు. సమాజంలోని అణచివేత, వివక్షతలకు వ్యతిరేకంగా 'అపరిచిత అతిథి' అనే మొదటి కథ వ్రాశారు. 'ఎర్ర జాబిల్ళ ఎరీనా' కవితా సంపుటినీ; ఎక్స్ట్రా గ్రోత్, బరి' మొదలైన 9 కథల్నీ; 'జేబు, మామగారి కథలు' అనే 2 కథా సంపుటుల్ని వెలువరించారు. రాసిన అబార్షన్ స్టేట్మెంట్ గురించి సాహిత్యలోకంలో చాలా చర్చలు జరిగాయి. స్త్రీవాదుల నొకచోట చేర్చి, ధైర్యాన్నిచ్చి, 'అస్మిత' అనే సదస్సు ఏర్పాటు చేయడం తృప్తినిచ్చిన అంశం. గ్రామీణ మధ్యతరగతి మనస్తత్వాల జీవితాల గురించి కవిత్వము, కథలు చాలా వ్రాశారు. రచనలు కొన్ని హిందీ, ఇంగ్లీష్, ఒరియా భాషల్లోకి అనువదింపబడ్డాయి. పూర్తి గ్రామీణ నేపథ్యంలో రజనీ రాసిన 'మామగారి కథలు' విలక్షణంగా ఉండి ప్రత్యేక స్థానాన్ని పొందాయి. పురస్కారాలు : కుమారి రచనా సాహితీ పురస్కారం; నూతలపాటి గంగాధరం సాహితీ పురస్కారం; తెలుగు విశ్వ విద్యాలయ సాహితీ పురస్కారం.

**రజనీ శకుంతల ముచ్చర్ల :** జన్మస్థలం విశాఖపట్నం. 2-11-1960లో జన్మించారని చెప్తారు. ఉపాధ్యాయినిగా పనిచేశారు. నవలాకారిణి కూడా. టి.వి.లలో నటించారు, రచనలు కూడా చేశారు. ముహూర్తబలం, నటించండి ప్లీజ్, బెడ్ లైట్, మొదలైన 31 కథలు రచించారు.

**రజిత కొండసాని.** పుట్టపర్తి అనంతపురం జిల్లా. మహిళా శిశు సంక్షేమశాఖ ఉద్యోగి, కవయిత్రి, తెలుగు రక్షణ వేదిక జిల్లా అధ్యక్షులు.ఒక కల రెండు కళ్ళు కవితా సంపుటి రచించారు. 200కవితలు వ్రాశారు. పలు కవిసమ్మేళనాలలో పాల్గొని కవిసత్కారం పొందారు. చిరునామా. సుబ్బరాయనిపల్లె 8-3ఎ, పెదపల్లి పోస్ట్, పుట్టపర్తి మండలం, అనంతపురం జిల్లా. పిన్:515231. ఫోన్.9652838920.

**రత్నకుమారి అడిదం :** బందరు. విశ్రాంత తెలుగు ఉపాధ్యాయిని, మహిళా కవిసమ్మేళనాలలో వచన కవితా గానం చేశారు. అనేక సంకలనాలలో కవితలు ప్రచురింపబడ్డాయి. రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయిని అవార్డ్ గ్రహిత. ఫోను నం: 9032340596.

**రత్నాంబ :** 17వ శతాబ్ది. వేంకటరమణ శతకం రచించారు.

**రమణమ్మ ఆదిమధ్యం :** జన్మస్థలం రాజమండ్రి. 1927లో జన్మించారు. హైస్కూల్ విద్య అభ్యసించారు. ఆరు నవలలు, 70కి పైగా కథలు, వ్యాసాలు, గేయాలు,

కవితలు వివిధ పత్రికలలో ప్రచురితమయ్యాయి. 1996లోమరణించారు. తిలకరి, కాటు, పెళ్ళాన్ని ప్రేమిస్తా మొదలైన 8 కథలు వ్రాశారు.

**రమణీ వరప్రసాదు శ్రీధరాల :** దాదాపు 100 కవితలు, కొన్ని కథలు పత్రికల్లో, వెబ్ పత్రికల్లో ప్రచురణ. పలు కవితా సంకలనాల్లో కవితలు ప్రచురణ. కొన్ని కవి సమ్మేళనాల్లో కవితా గానం. హారం వెబ్ పత్రిక వారు నిర్వహించిన సంక్రాంతి 2012 కవితల పోటీల్లో ప్రథమ బహుమతి. పేక్ట్ సంస్థ వారు నిర్వహించిన జాతీయ కవితల పోటీ 2017 లో ప్రోత్సాహక బహుమతి. కళా స్రవంతి 2018 వారు నిర్వహించిన కవితా పోటీల్లో మూడవ బహుమతి . నలభై అయిదు మంది రచయిత/త్రులు కలిసి వ్రాసిన గొలుసుకట్టు సస్పెన్స్ థ్రిల్లర్ నవల (నీహారిక) లో భాగస్వామ్యం. ఈ నవల డిసెంబరు, 2018 లో ఆంధ్రభూమి మాసపత్రికలో ప్రచురితమైంది. కెనడా తెలుగు తల్లి 2018 కవితా పోటీల్లో శ్రీమతి ఉపాధ్యాయుల దుర్గాంబా కుమారస్వామి గారి స్మారక బహుమతి, కెనడా తెలుగు తల్లి 2018 కథల పోటీల్లో శ్రీమతి రాయవరపు లక్ష్మీ రాజారావు గారి స్మారక బహుమతి, విశ్వ సాహితి సంస్థ, హైదరాబాదు వారు కళాప్రపూర్ణ డా.పోతుకూచి సాంబశివరావు గారి ప్రథమ వర్ధంతి (2018) సందర్భంగా నిర్వహించిన కథల పోటీలలో ప్రథమ బహుమతి. చిరునామా:ప్లాటు నెం 81, గణేష్ నగర్, మధురవాడ, విశాఖపట్నం - 530041 . ఫోను నం 7416317653.

**రమాదేవి చేలూరు :** జన్మస్థలం అనంతపురం జిల్లా పాలచర్ల గ్రామం. మానవి నవలానుశీలం, జాత్యహంకారి హిట్లర్, స్వేచ్ఛాగానం (నల్లజాతి స్త్రీ సోజర్నర్ ట్రూత్ బయోగ్రఫీ) పుస్తకాలు, వ్యాసాలు, కథలు వ్రాశారు. స్వేచ్ఛాగానం నల్లజాతి నిప్పుకణిక పేరుతో రెండవ ముద్రణ పొంది కన్నడభాషలోకి అనువదించబడింది.

**రమాదేవి రాగతి :** జన్మస్థలం విశాఖపట్నం. 26.7.1962లో జన్మించారు. ఎం.ఏ. (హిందీ) అభ్యసించారు. పిహెచ్.డి. చేశారు. హిందీ లెక్చరర్గా పనిచేశారు. వ్యాస రచయిత్రి, నటి కూడా. అమ్మాయిలూ జాగ్రత్త(18 కథలు); గుడ్ గరల్, పరువు, చతుర, మనిషి మనసు మొదలైన 18 కథలను వ్రాశారు.

**రమాదేవి వాడ్రేవు :** జన్మస్థలం రాజమండ్రి. 10.6.1955 లో జన్మించారు. గుణపాఠం, ఒకటికి రెండు, కొడుకు, అల్లుడుగారూ జిందాబాద్ మొదలైన 10 కథలు రాసారు.

**రమాదేవి వి.ఎస్ :** జన్మస్థలం పశ్చిమగోదావరి జిల్లా చేబ్రోలు. 1934, జనవరి 15 తేదీన జన్మించారు. తల్లిదండ్రులు వి.వి. సుబ్బయ్య మరియు వి. వెంకట

రత్నమ్మ.భారతదేశపు మొట్టమొదటి మహిళా ప్రధాన ఎన్నికల కమీషనరు; హిమాచల్ ప్రదేశ్, కర్ణాటక రాష్ట్రాల గవర్నరు. భారతదేశం గర్వించతగ్గ అడ్మినిస్ట్రేటర్ గా ఖ్యాతికెక్కారు. ఏలూరు మరియు హైదరాబాదు నగరాలలో ఎమ్.ఎ., ఎల్.ఎల్.ఎమ్. పూర్తిచేశారు. వీరు 1959లో ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టులో న్యాయవాదిగా పనిచేయడం మొదలుపెట్టారు. తరువాత గ్రూప్ ఎ ఆఫీసర్ గా కేంద్ర ప్రభుత్వంలో నియమితులయ్యారు. తెలుగు భాషలో ఇరవైకి పైగా గ్రంథాలు, నవలలు, కథానికలు, వ్యాసాలు, నాటకాలు రచించారు. ముఖ్యంగా స్త్రీలుచట్టాలు అంశాలుపై అనేక వ్యాసాలు వ్రాశారు. రచయిత్రిగా వీరిని అఖిలభారత రచయిత్రుల సదస్సులో సత్కరించారు. వీరు ఢిల్లీ ఆంధ్ర వనితా మండలి అధ్యక్షులుగా పనిచేశారు. 2013, ఏప్రిల్ 17 న తన 79వ ఏట అనారోగ్యంతో బెంగుళూరులో మరణించారు.

**రమాబాయమ్మ మొసలికంటి :** పత్రికా సంపాదకత్వం వహించిన తొలి తెలుగు వనిత,ఈ పత్రిక ముద్రణ పనులను కూడా స్త్రీలే నిర్వహించారు.

**రమామణి కొలిపాక :** జన్మస్థలం తూ.గో.జిల్లా కాకినాడ. 18.6.1938న జన్మించారు. ఎం.ఏ., బి.ఇడి., చేశారు. ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. నవలా రచయిత్రి. సృష్టిలో తీయనిది, తోట మలుపు, కల్పన మొదలైన 10 కథలను వ్రాశారు.

**రాజకుమారి అల్లూరి :** జన్మస్థలం తూ.గో.జిల్లా కాకినాడ. 9.9.1944లో జన్మించారు. ఎం.బి.బి.ఎస్. చేశారు. ప్రైవేట్ ప్రాక్టీషనర్. చికిత్స, అవధి, ధనేషణ, మళ్ళీ ఆడపిల్ల మొదలైన 5 కథలు వ్రాశారు.

**రాజరాజేశ్వరీదేవి ముదిగొండ :** భక్తిగేయ రచయిత్రి శ్రీమతి 'రాజరాజేశ్వరీదేవి' జన్మస్థలం విజయవాడ. 16.9.1938లో 'శరభా చార్యులు, వెంకటరత్తమ్మ' దంపతులకు జన్మించారు. భాషాప్రవీణ, ఎం.ఏ.తెలుగు, సంస్కృతం కూడా ఉత్తీర్ణులయ్యారు. శ్రీలలితేశ్వరీశతకం, యువశతకం, సత్యసాయి శతకం కలిపి శతక త్రిశతిగా ప్రచురించారు. శ్రీరామ వల్లభ శతకం(సంస్కృతం), సంస్కృత గేయాలు, వినాయకునిపై గేయాలు రచించారు. 'కృష్ణాష్టకం' తెలుగు పద్యాలలో రచించారు. కొన్ని ఆంధ్ర పత్రికలో ప్రచురితమయ్యాయి.

**రాజేశ్వరి గాలి డా.:** జన్మస్థలం చిత్తూరుజిల్లా నల్లగుట్టపల్లె. విశ్రాంత తెలుగు అధ్యాపకులు. పత్రికల్లో వ్యాసాలు, రేడియో ప్రసంగాలు, ఆధ్యాత్మిక ప్రసంగాలు, సిటీచానల్లో వ్యాఖ్యానాలు, చర్చలు, సదస్సులు ప్రసారమయ్యాయి. 2012 నుండి టి.టి.డి.ధర్మప్రచార పరిషత్ సేవల్లో పాల్గొంటున్నారు. మొగలిరేకులు

వ్యాస సంపుటి వెలువరించారు. సామాజిక సేవాకార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటున్నారు. చిరునామా. 10-128-19/2, వి.వి.నగర్, తిరుచానూరు, తిరుపతి-517503. ఫోన్. 9440017253.

**రాజేశ్వరి తుర్లపాటి :** జన్మస్థలం కృష్ణా జిల్లా గుడ్లవల్లేరు మండలం మామిడికోళ్ళ గ్రామం. 15.9.1950లో జన్మించారు. స్వాతంత్ర్యానంతర తెలుగు నవల అంశంపై పరిశోధన చేసి డాక్టరేట్ పొందారు. కథ, నవల, కవిత్వం, అనువాదం, వ్యాసం, విమర్శ, రూపకం ప్రక్రియలలో కృషి చేస్తూ 20 పుస్తకాలు ముద్రించారు. వ్యాస సారథి. ఒరిస్సాలో తెలుగువారు గ్రంథాలు ముద్రించారు. కేంద్ర సాహిత్య అకాడమీ, నేషనల్ బుక్ ట్రస్ట్ సంస్థలకు ఒరియా నుండి తెలుగుకు అనువాదాలు చేస్తున్నారు.తెలుగు విశ్వవిద్యాలయ ఉత్తమ రచయిత్రి పురస్కారం, తెలుగుధనం గ్రంధానికి సాహితీ పురస్కారం అందుకున్నారు. చిరునామా: రాజారాణి సరోవర్ అపార్ట్ మెంట్స్, ఫ్లాట్ నం.405, థర్డ్ ఫ్లోర్, ఆపొజిట్ శాస్త్రి నగర్, థర్డ్ లేన్, బెర్హంపూర్-60002, గంజాం, ఒడిశా.

**రాజేశ్వరి నల్లాని :** జన్మస్థలం అనంతపురం. ఆం. ప్ర. ప్రభుత్వ బాలల సంక్షేమ సమితి, వీధిబాలల శాఖ అనంతపురం జిల్లా చైర్ పర్సన్. నల్లాని రాజేశ్వరి ఇనిషియేటివ్ ఫౌండేషన్ ఆం.ప్ర., తెలంగాణ, కర్ణాటకల చైర్ పర్సన్. ఉదయ్ విద్యాసంస్థల అధినేత్రి, పత్రికల కాలమిస్ట్, సామాజిక ఉద్యమకారిణి, బాలల హక్కుల కార్యకర్త. రచయిత్రి, కవయిత్రి, వ్యక్తిత్వవికాస నిపుణురాలు, సంఘసంస్కర్త, యువజన వ్యవహారాల నిపుణురాలు. ఆకాశవాణిలో ప్రసంగాలు, కవితలు ప్రసారమయ్యాయి. అనేక పత్రికలలో వ్యాసాలు, కవితలు ప్రచురితమయ్యాయి. ఆం.ప్ర. విశిష్ఠ సేవా పురస్కారం, ఉగాది పురస్కారం, కృష్ణాపుష్కర సాహితీ పురస్కారల్మ్ల బాలసేవక్, సేవారత్న, మహిళారత్న, విద్యారత్న, భారత ప్రభుత్వ రాజ్య మహిళాసమ్మాన్, తెలంగాణా ప్రభుత్వ బతుకమ్మ అవార్డులు, ఇంకా మరెన్నో సత్కారాలు అందుకున్నారు. అనేక పదవుల్లో కొనసాగుతున్నారు. చిరునామా.ఇం.నం.6-3-249-1, ఉదయ్ బిల్డింగ్స్, రాం నగర్, అనంతపురం-515001. ఫోన్.9908602443.

**రాజేశ్వరీ చంద్రజ డా. :** రచయిత్రి, మధుర గాయని, సంకీర్తనా సుధానిధి. చిరునామా. ఇం.నం.9-9, గోవింద నగర్ కాలనీ, నియర్ గణేష్ రెసిడెన్సీ 2, శ్రీకాకుళం-532001. ఫోన్. నం. 8500270484.

**రాజేశ్వరీ దేవి శివలెంక :** జన్మస్థలం జగ్గయ్యపేట. గాఢమైన అనుభూతులున్న కవయిత్రి. 'ద్వైతం' అనే కవితా సంపుటిని రచించారు. స్త్రీలో ఉండే విభిన్న కోణాలను ఆవిష్కరించారు. ఇటీవలే మరణించారు.

**రాజ్యం సిన్హా :** కృష్ణాజిల్లాకు చెందిన రాజ్యం సిన్హా చిన్నతనంలోనే వామపక్ష భావాలకు ఆకర్షితులయ్యారు. ఠాగూర్ గారి శాంతినికేతన్లో పట్టభద్రురాలయ్యారు. 1942లో సోషలిస్టు భావాలకు ఆకర్షితులయ్యారు. 1946లో ఆంధ్ర కాంగ్రెస్ మహిళల రాజకీయ పాఠశాల స్థాపించారు. సిన్హా అనేక విషయాల గురించి, విశ్లేషనాత్మక వ్యాసాలు వ్రాశారు. అనేక ఆకాశవాణి కేంద్రాలు ప్రసంగాలను ఎన్నిటినో ప్రసారం చేశాయి. మద్రాసు నుండి ప్రచురించబడే 'మాతృభూమి' పత్రికకు కొంతకాలం సహాయ సంపాదకురాలిగా,పనిచేశారు. క్విట్ ఇండియా ఉద్యమం గురించి తెలుగులో రాసిన వ్యాసం పేరుతెచ్చింది. ప్లాన్ & పబ్లిసిటీ; పౌరసంబాంధ శాఖ; సమాచారశాఖ (డైరెక్టర్); స్త్రీ సంక్షేమశాఖ (డైరెక్టర్); చలనచిత్ర అభివృద్ధిసంస్థ; ఆకాశవాణి మొదలైన అనేక శాఖలలో బాధ్యతాయుతమైన స్థానాలలో పనిచేసి, పదవీ విరమణ చేశారు. రష్యా, జర్మనీ, మంగోలియా దేశాలలో పర్యటించి, అక్కడి సంస్కృతి, స్త్రీల గురించి సోవియట్ స్త్రీలు, జి.డి.ఆర్.లో నవతరం స్త్రీలు, మంగోలియాలో స్త్రీలు పిల్లలు' అనే పుస్తకాలు రాసి ప్రచురించారు. తన భర్త జీవితం గురించి 'విజయ్ కుమార్ సిన్హా రివల్యూషనరీ క్రేస్ట్ ఫర్ శాక్రిఫైజ్' అనే పుస్తకం వ్రాశారు.

**రాజ్యలక్ష్మమ్మ కందుకూరి :** 19/20 వ శతాబ్ది సంఘ సంస్కర్త శ్రీ వీరేశలింగం పంతులు గారి భార్య

**రాజ్యలక్ష్మమ్మ బసవరాజు :** జన్మస్థలం విజయవాడలోని పటమట'. 1904లో 'గంగమ్మ, గోవిందరాజు దంపతులకు జన్మించారు. తన భర్త అయిన బసవరాజు అప్పారావు గారినే గురువుగా స్వీకరించి, విద్యాభ్యాసం చేసింది. భర్తృసాహచర్యంలో సాహిత్యాభిమానం పెరిగింది. 29 వ యేట భర్తృవియోగమైనా, క్రుంగి పోకుండా కవి బావ అలవరచిన 'కవనం, వ్యాస రచన, కథానికల రచన'లను కొనసాగిస్తూ "భారతి, ఆంధ్రవారపత్రిక, గృహలక్ష్మి" మొదలైన పత్రికలలో ప్రచురించారు. హిందీలో నిష్ణాతురాలైన ఈయమ దక్షిణ భారత హిందీ ప్రచార సభలో జాతీయ భాషాసేవ చేశారు. 'అప్పరాయకవికి ఒప్పిన సతియై, సుమధుర గీత రచనా సహచరియైనారు. రాజ్యలక్ష్మి 'సౌదామిని' కలం పేరుతో అనేక కవితలు, వ్యాసాలు, గీతాలు, కథానికలు వెలువరించారు. హృదయాన్ని కదిలించే కవితలు వ్రాశారు. "అప్పారావు గారు నేను" పేరుతో ఆత్మకథ రచించారు. ఇంకా "ఆకాశ కుసుమావళి, ఎవరిదదృష్టం, ఎవరిది దురదృష్టము' మొదలైనవి రచించారు. 'రచించిన గీతాలు, మిక్కిలి చిన్నవై, మిగుల గంభీరములై ఉండును. పలుకు సున్నితమైననూ, తలపు సునిశితము' అని శ్రీ కొడాలి వారన్నారు. "చింతమాను కొమ్మ పైన, వింతగాను

గువ్వ జంట......, సూర్యుండు పడమటా కుంకేటివేళ, నా నాధుడింటికి వచ్చేటివేళ....." లాంటి గేయాల్ని, "దురదృష్టము" అనే అద్భుత కావ్యాన్ని రచించారు. వీరి కవిత ధ్వనిప్రాణితమై, ఉత్తమ కోవకు చెందినది. 1972లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు రాజ్యలక్ష్మి గారికి "విశిష్ఠ రచయిత్రి" పురస్కారం ప్రదానం చేసి గౌరవించారు. 1975లో ఢిల్లీ ఎర్రకోటలో స్వాతంత్ర్య సమరయోధుల సన్మాన సభలో రాష్ట్ర ప్రభుత్వం సత్కరించింది. భర్త గతించిన తిథినాడే తానూ మరణించాలని భావించిన ఈ మహాసాధ్వి 1975 జూన్ 8 వ తేదీన విజయవాడలో అనాయాస మరణం కోర్కె తీర్చుకుంది. అందుకే వీరు ఆదర్శ దంపతు లయ్యారు.

**రాజ్యలక్ష్మి అడబాల :** జన్మస్థలం ప.గో.జిల్లా పాలకొల్లు. 31.10.1948లో జన్మించారు. మెట్రిక్ చదివారు. అసంకల్పితం, నెక్లెస్, తప్పు చేసే వయసు, ఈ కథకి ముగింపు లేదు మొదలైన కథలు వ్రాశారు.

**రాజ్యలక్ష్మి ఎ :** చెన్నైలో నివాసం. ఫ్రెంచ్, జర్మన్ భాషలలో కూడా ప్రవీణులు. 4500నానోలు,1400నానీలు,130చిత్ర నానీలు రచించారు. బొండుమల్లెలు, చైతన్య దీపాలు, స్వాతి చినుకులు సంపుటాలు వెలువరించారు. అంతర్జాతీయ సదస్సులలో 7 పత్ర సమర్పణలు చేశారు. చిగురు అకాడమీ సాహితీ ప్రతిభా పురస్కారం పొందారు. చిరునామా.19 ఎలిగెంట్ ఫ్లాట్స్, 61 గాంధి రోడ్, వేలాచెరి, చెన్నై-600042. ఫోను నం .9487486985.

**రాజ్యలక్ష్మి ఎస్. :** జన్మస్థలం గుంటూరుజిల్లా తెనాలి. 17.11.1924లో జన్మించారు. ముత్యం, పగడం అనే కథలసంకలనం రచించారు.

**రాజ్యలక్ష్మి పోలాప్రగడ :** జన్మస్థలం తూర్పుగోదావరి జిల్లాకు చెందిన ఆలమూరు గ్రామం. 1938లో జన్మించారు. ప్రముఖ కథా/నవలా రచయిత్రి. ఆలమూరు గరల్స్ హైస్కూలులో విద్యనభ్యసించారు. పోలాప్రగడ సత్యనారాయణ మూర్తిగారి భార్య. ఆక్స్ఫర్డ్ విశ్వవిద్యాలయం ప్రచురించిన కవితా సంపుటిలో వీరి కవితలు అచ్చైనాయి. వీరి కథా రచనలపై నాగార్జున విశ్వవిద్యాలయంలో ఎమ్.ఫిల్, వ్యక్తిత్వము సాహిత్యము పై ఆంధ్ర విశ్వ విద్యాలయం పి.హెచ్.డి., రెల్లుపొదలు నవల హిందీ అనువాదంపై ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎమ్.ఫిల్ స్థాయిలో పరిశోధనలు జరిగాయి. వివిధ సంస్థలు సత్కరించాయి. సఖ్యసాహితికి వైస్ ప్రెసిడెంటుగా, ఆంధ్ర మహిళాసభ ట్రస్ట్ బోర్డు సభ్యురాలిగా సేవలను అందజేస్తున్నది. కథలు, నవలలు, కవితలు కొన్ని ఇంగ్లీషు, హిందీ భాషలలో అనువదించబడ్డాయి. రచనలు శరన్మేఘం, శృతి తప్పిన వీణ, గాజుమేడ, దరిచేరిన

కెరటం, శిలలూ సెలయేళ్ళు, విరిసిన వెన్నెల, ఇటు ఊరు అటు ఏరు, కొత్త చిగుళ్ళూ మంచు బిందువులు, రెల్లు పొదలు, ప్రేమాలయం, బంగారు కెరటాలు. కథాసంపుటాలు రాజ్యలక్ష్మి కథలు, నింగీ నేలా, చక్కెరబొమ్మ, కొత్తవెలుగు, అనుబంధాలు. వ్యాసాలు కావ్యనాయికలు, జీవిత చరిత్రలు కనుపర్తి వరలక్ష్మమ్మ (కేంద్రసాహిత్య అకాడెమీ వారి మోనోలాగ్) కవితాసంపుటి కవితల పందిరి,రేడియో వ్యాసాలూ ప్రసంగాలు, వ్యాసావళి రచించారు సత్కారాలూ పురస్కారాలు 1971 ఆంధ్రజ్యోతి కథల పోటీలో బహుమతి, 1983 వనిత కథల పోటీలో బహుమతి, 1988 తిక్కవరపు సుదర్శనమ్మ అవార్డు, 1990 ఉన్నవ లక్ష్మీనారాయణ అవార్డు (నాగార్జున విశ్వవిద్యాలయం), 1994 పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ రచయిత్రి పురస్కారం, 1999 మద్రాసు తెలుగు అకాడెమీ వారి సాహిత్య పురస్కారం, 2002 ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం వారి సాహిత్య పురస్కారం, 2003 సుశీలా నారాయణరెడ్డి అవార్డులు పొందారు.

**రాజ్యలక్ష్మీదేవి పెదపూడి :** జన్మస్థలం తూ.గో.జిల్లా తుని. 23.10.1943లో జన్మించారు. పరిష్కారం, మరుపురాని నాటి దీపావళి, కథ పేరేమిటి? మొదలైన 11 కథలు వ్రాశారు.

**రాజ్యలక్ష్మీదేవి సూర్యదేవర :** జన్మస్థలం స్వాతంత్ర్యవీరులకు, స్త్రీవిద్యకు ఆనాడే నెలవైన కృష్ణాజిల్లా, 'వీరులపాడు' గ్రామం. 1914లో జన్మించారు. జాతీయోద్యమ ప్రభావంతో హిందీ చదవడం మొదలు పెట్టి, విశారద పూర్తి చేశారు. ఆ కుటుంబాల ఆచారమైన పరదాలను దాటివచ్చి, సత్యాగ్రహం చేశారు. అనేక ఉద్యమాలలో పాల్గొన్నారు. రాజ్యలక్ష్మమ్మ లేకుండా ప్రజా ఉద్యమాలు నడవలేదు. 1936లో చేబ్రోలులో అన్నికులాల వారికోసం, హిందీ పాఠశాలను ప్రారంభించారు. గ్రంథాలయం కూడా స్త్రీలకోసం ప్రారంభించారు. తెలుగువారిని ఏకం చేయాలనే తలంపుతో, 'విశాలాంధ్ర' స్థాపన లక్ష్యంగా, విజయవాడ నుంచి, 'తెలుగు దేశం' వారపత్రిక స్థాపించారు. వారే సంపాదకులు, ప్రచురణకర్త, ముద్రాపకులు కూడా. గ్రంథాలయోద్యమంలో పాల్గొని, అనేక పదవులు నిర్వహించారు.

**రాజ్యశ్రీ కేతవరపు డా. :** డిప్యూటీ సెక్రెటరీ టు గవర్నమెంట్ రిటైర్డ్. కవయిత్రి, రచయిత్రి, ఆధ్యాత్మిక వక్త, రేడియో, టి.వి.ఆర్టిస్ట్. ఆధునిక కవితా ప్రక్రియలన్నిటిలో 20 పుస్తకాలు ప్రచురించారు. గీతామృతం (రెక్కలు) 4 భాషలలో వెలువడింది. అక్షర కేతనం, ఊహల వసంతం హిందీ, ఇంగ్లీష్ లలో అనువదింపబడ్డాయి.

భారత్ భాషాభూషణ్, ప్రజ్ఞశ్రీ, వేదాంత వక్త, స్త్రీ శక్తి బిరుదులు పొందారు. విదేశాలలో కూడా గౌరవింపబడ్డారు. ఫోన్. 8500121990.

**రాణీప్రసాద్ కందేపి.** డా.,ప్రకాశం జిల్లా చీరాలలో జన్మించారు. బాలసాహిత్యం, కవిత్వం, అనువాదాలు, వ్యాసాలు అన్నీ కలిపి 29 పుస్తకాలు రచించారు. తెలుగు బాలసాహిత్యంలో వైజ్ఞానిక రచనలు అంశంపై పరిశోధన చేశారు. పిల్లలకోసం 3000 బొమ్మలను ఆసుపత్రి వ్యర్థ పదార్థాలతో తయారుచేసి ప్రపంచ రికార్డు సాధించారు. వీటిని మిల్కీ మ్యూజియం లో భద్రపరిచారు. 600 చార్టులను చేశారు. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం కీర్తి పురస్కార గ్రహీత. కళాభారతి, బాలసాహితీ కౌముది, బాలసాహితీ పూర్ణిమ బిరుదాంకితులు. చిరునామా: సృజన్ చిల్డ్రన్ హాస్పిటల్, సిరిసిల్ల-505301. రాజన్న సిరిసిల్ల జిల్లా.

**రాధిక :** జన్మస్థలం తూ.గో.జిల్లా కొత్తపేట. నలుగురు కలిసి నవ్వే వేళ అనే 102 కథల సంపుటి వెలువరించారు.

**రాధికరత్న నలిగల :** అనేక పోటీలలో వ్యాసరచనకు గాను రాష్ట్రస్థాయి బహుమతులు, పలు సంకలనాలలో కవితలు. కవిసమ్మేళనాల్లో కవితాగానం చేసి కవిసత్కారాలు పొందారు. చిరునామా: ఇం.నం. 35-3-69(55/6), సి.ఆర్.పి.క్వార్టర్స్, దేవుడు చెరువు, ఒంగోలు-523001. ప్రకాశం జిల్లా. ఫోను నం. 9010538223.

**రాధికారాణి గుడిపూడి :** జన్మస్థలం కృష్ణాజిల్లా నూజివీడు. 'గుడిపూడి గోపాలకృష్ణమాచార్యులు ఇందిరాదేవి' దంపతులకు జన్మించారు. బాలకథానిధి, భాషాక్రీడాకారిణి బిరుదాంకితులు. మచిలీపట్నంలో నివాసం. గణిత ఉపాధ్యాయిని, బాలసాహిత్య రచయిత్రి. గజల్, పద్య, వచన కవయిత్రి. ప్రముఖ పత్రికలలో పిల్లలకథలు, గేయాలు, పజిల్స్, గజల్స్, వ్యాసాలు, పుస్తక సమీక్షలు, కవితలు, పద్యాలు వందల సంఖ్యలో ప్రచురితం అయినాయి. ఆకాశవాణి, దూరదర్శన్ లలో కథానికలు,కవితలు ప్రసారమయ్యాయి. విలక్షణ శీర్షికలు గల నీతి కథలకు పేరొందారు. బాలసాహిత్యంలో కృషికి గాను సత్యశ్రీ సాహితీ పురస్కారం, వేమూరి రాధాకృష్ణమూర్తి అవార్డ్, శ్రీశ్రీ పురస్కారం, ముదిగొండ అవార్డ్ మొ. పురస్కారాలనెన్నో అందుకున్నారు. చిరునామా: 28/525, వెచ్చావారి వీధి, సర్కిల్ పేట, మచిలీపట్నం-521001. కృష్ణాజిల్లా. ఫోన్. 9494942583.

**రామలక్ష్మి మల్యాల(పూలేటి) :** జన్మస్థలం తూ.గో.జిల్లా కాకినాడ. 2.9.1952లో జన్మించారు. వీరబాహుడు, తల్లీ నీవు దలంచి, లో వెలుగు, ఎంపిక మొదలైన 3 కథలు రచించారు.

**రామలక్ష్మి(బొత్స) రావులపల్లి :** ఉపాధ్యాయిని, విశాఖపట్నం. 30కథలు, 20కవితలు ప్రచురింపబడ్డాయి. కవిసమ్మేళనాలలో పాల్గొని కవి సత్కారం పొందారు.

**రామసీత పత్రి :** గేయరచయిత్రి, కథకురాలు. బందరు నివాసిని.

**రామానుజమ్మ రామినేని :** జన్మస్థలం మధ్యప్రదేశ్ లోని బిలాస్ పూర్. తండ్రి ఈడ్పుగంటి రాఘవేంద్రరావు. కుమారులు నాగపూర్ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి రామినేని కౌసలేంద్రరావు. మరాఠీ, హిందీ భాషలను నేర్చుకొని, తర్వాత బండారు అచ్చమాంబ వద్ద తెలుగు, ఆంగ్లము నేర్చుకొన్నారు. కృష్ణాజిల్లా కొమ్మమూరు గ్రామంలో నివసిస్తూ హరిజన పేదలకు ఉచిత పాఠశాలను నిర్వహించారు. రచనలు 1921 లో "పుత్రోపహారం" అనే రచనను హిందీ నుండి తెలుగులోకి అనువదించారు. ఈ గ్రంథం చిన్నపిల్లలు నడుచుకోవలసిన సరైన పద్ధతులను తెలియజేస్తుంది. రామాయణం, "ఉత్తరావిలాపము, "రుక్మిణీ సందేశము మొదలైన రచనలు చేశారు. 1925-35 లలో భారతి, గృహలక్ష్మి పత్రికలలో ప్రచురితాలు. శతగ్రంధకర్త శ్రీ సెట్టి లక్ష్మీనరసింహకవి సోదరి. 1977 సెప్టెంబరు 22 తేదీన కన్నుమూశారు.

**రామాయమ్మ మొసలికంటి :** మీరాబాయి కావ్యం వ్రాశారు.

**రావి శారద :** జన్మస్థలం విజయవాడ. పాతూరు నాగభూషణంగారి కుమార్తెకి 1954 జులై 28న జన్మించారు. గ్రంథాలయవిద్యలో డిగ్రీ, పిజి చేశారు. 'గ్రంథాలయ సర్వస్వం' మాసపత్రిక సంపాదకురాలు. సర్వోత్తమ గ్రంథాలయం నిర్వాహకురాలు. అనేక గ్రంథాలయా శాస్త్ర గ్రంథాలు వ్రాశారు.

**రాహుల(భూసురపల్లి)మద్దిరాల.** 29.11.1981న ప్రకాశం జిల్లా మద్దిపాడులో జననం. డా.భూసురపల్లి వెంకటేశ్వర్లు కుమార్తె. కవయిత్రి. డియర్ పొయెట్ కవితా సంపుటిని వెలువరించింది. రాజీవ్ యువశక్తి యువకవితా పురస్కార గ్రహీత. అనేక సంస్థల కవితా పోటీల్లో పాల్గొని బహుమతులు పొందారు. చిరునామా: ఎం.వి.రాహుల, 302, విజయశ్రీ రెసిడెన్సీ, 6/3, ఎస్.వి.ఎన్.కాలనీ, గుంటూరు-522006.ఫోను నం: 9701390989.

**రుక్మిణమ్మ స్థానాపతి :** జన్మస్థలం పశ్చిమ గోదావరిజిల్లా నిడదవోలు. సెప్టెంబరు 28, 1915 న జన్మించారు. ప్రముఖ సంస్కృతాంధ్ర పండితురాలు, రచయిత్రి. తండ్రి శ్రీకాకుళం పురుషోత్తమరావు మరియు తల్లి గరుడమ్మ. రుక్మిణమ్మ వివాహం 1928లో విశాఖ నివాసి స్థానాపతి సత్యనారాయణతో జరిగింది. 18 ఏళ్ళ వయస్సులోనే మొదటి కవితా సంపుటి వెలువడింది. దేవీ భాగవతాన్ని సామాన్య

పాఠకుల కోసం వ్యావహారిక వచనంలో రచించారు. వివిధ ఉపనిషత్తుల నుండి దైవతత్త్వ ప్రతిపాదకాలైన సూక్తులతో నిండిన "దేవుడు" పుస్తకాన్ని రచించారు. వేదాల నుండి, ఉపనిషత్తుల నుండి కొన్ని ఋక్కులను ఎంపికచేసి తాత్పర్య సహితంగా వచన రూపంలో రచించారు. రచనలు విశాఖపత్రిక, సత్యవాణి, ఆంధ్రవిద్యార్థి, భారతి, గృహలక్ష్మి, ఆంధ్రభూమి మొదలైన పత్రికలలో ప్రచురించబడ్డాయి. రచనలు "వైతాళికులు" సంకలనంలో చోటుచేసుకున్నాయి. మార్చి 2, 1952లో గృహలక్ష్మి స్వర్ణకంకణం అందుకున్నారు. రచనలు పూలమాల (కవితా ఖండికలు), దయ్యాలు (కథలు), నీలాటి రేవు (కథలు), యుక్తిమాల (కథలు), దూతఘటోత్కచము (నాటిక), వత్సరాజు (నాటిక), చారుదత్త (నాటిక), దేవీ భాగవత మహాపురాణం (వచనం), దేవుడు, గోలోకం (వచన పురాణం), సప్తశతి (పద్యాలు), కాదంబిని (కావ్యము).

**రుక్మిణి నల్లూరి :** కథా, నవలా రచయిత్రి. భర్త సి.ఎస్.ఆర్.ప్రసాద్ విరసం అధ్యక్షులుగా పనిసేసేవారు. విరసం సభ్యురాలిగా వుంటూ గుంటూరు జిల్లాతో పాటు పరిసర ప్రాంతాలలో జరిగే ప్రజా ఉద్యమాలు, ప్రజా సంఘాల కార్యక్రమాలలో మమేకమవుతూ వృత్తి రీత్యా న్యాయవాదిగా ఎంతో మంది పేదలు, మహిళలకు, కార్మికులకు సాయపడుతున్నారు. 'నర్రెంక సెట్టుకింద' నవల, "నెగడు" పేరుతో కథా సంకలనం వెలువరించారు. సెగడు సంకలనం పోలవరం ప్రాజెక్టు నిర్వాసితులపై రాసారు. పల్లెటూరి జీవితం నుంచి రావడం వలన, నలభై ఏళ్ళుగా మధ్యతరగతి జీవితం అనుభవిస్తున్నా అణగారిన వర్గాల గురించి, వారి జీవితాలలో అనుభవిస్తున్న హింసను గురించి రాయడమే ఇష్టం. సామాన్యుల జీవితాలలో ఎటువంటి మార్పులు, వాటి వలన కలుగుతున్న సామాజిక మార్పులు గురించి, అభివృద్ధి పేరుతో జరుగుతున్న సామాజిక, సాంస్కృతిక దాడిని కథలలో చెప్పే ప్రయత్నం చేస్తున్నారు. చర్ల నిజనిర్ధారణ తరువాత ప్రవాహం తిరోగమించదు అన్న కథ రాసారు. కిషన్జీ చనిపోయిన నేపథ్యంలో ముంజేతులు ఖండించినా అనే కథ రాసారు. 2012 డిసెంబరులో 'కంపెనీ తిరునాళ్ళు' అనే కథ రాసారు. ఇలా 32 కథలు వ్రాశారు.

**రుక్మిణీదేవి మల్లాది :** జన్మస్థలం బందరు. సన్ ఫ్లవర్ స్కూల్లో పనిచేశారు వీరు అనేక గ్రంథాలు రచించారు.

**రూపవల్లి కురుమద్దాలి :** ఇబ్రహీంపట్నం లో నివసిస్తున్నారు. భగవద్గీత, ఆంధ్ర మహాభాగవతముల సమన్వయానుశీలన అనే సిద్ధాంత వ్యాసం రచించారు, పి.హెచ్.డి. పట్టా అందుకున్నారు.

**రెజీనా గుండ్లపల్లి.డా. :** జన్మస్థలం గుంటూరు జిల్లా నిజాం పట్నం. విశ్రాంత రీడర్, మారిస్ స్టెల్లా కళాశాల, విజయవాడ. నవ్యాంధ్ర కవుల ప్రణయిని ప్రతిపత్తి ( సిద్ధాంత గ్రంథం), అక్షర నీరాజనం – వచన గేయాలు, బాలవ్యాకరణం సంక్షిప్తం, ఈజీ స్టెప్స్ టు లెర్న్ తెలుగు, ఇతర పత్రికలలో వ్యాసాలు రచించారు. దూరదర్శన్, రేడియోలలో మహిళా కార్యక్రమాలలో పాల్గొన్నారు. అశ్లీల ప్రతిఘటనా వేదిక ఉపాధ్యక్షులు, తెలుగు భాషా చైతన్య సమితి ఉపాధ్యక్షులు, ఊటుకూరి లక్ష్మి కాంతమ్మ మహిళా విభాగం కృష్ణా జిల్లా ఉపాధ్యక్షులు. ఢిల్లి, మద్రాస్ తెలుగు అకాడమీ, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ఉగాది పురస్కారాలు, న్యూ డిల్లీ వారి ఫాదర్ మత్తయ్య అవార్డ్, మధర్ తెరిస్సా మిలీనియం అవార్డులు పొందారు.

**రోహిణి పచ్చిగోళ్ళ :** జన్మస్థలం తూ.గో.జిల్లా ర్యాలీ. 26.4.1945లో జన్మించారు. ఏకైక వారసుడు, గోవిందా గోవిందా, అత్తగారి కాశీ యాత్ర, మొదలైన 5 కథలు వ్రాశారు.

**రోహిణీ సత్య :** జన్మస్థలం అనంతపురం. 29.5.1957లో జన్మించారు. కర్మయోగి, చిన్నదానిఆశ, రావు తండ్రి, కాలని మనసు, భయం మొదలైన పెద్ద కథల్నూ ఇంకా 6 సింగిల్ పేజీ కథలు వ్రాశారు.

**లక్ష్మి కాకర్ల :** జన్మస్థలం భీమవరం. 30.6.1965లో జన్మించారు. నైజం, అదంతే, పెళ్లానికొక ప్రేమలేఖ కథలు వ్రాశారు.

**లక్ష్మి కె.బి. డా. :** లక్ష్మి స్కూల్లో పారడీ ప్రిన్సెస్, కథలూ, కవితలూ, నాటకాలూ రాసారు. కాలేజీలో కవి సమ్మేళనాలలో పాల్గొన్నారు. ఐ వి ఎస్ అచ్యుతవల్లి రచనలపై పి హెచ్ డి చేశారు. ఆకాశవాణి అనౌన్సర్ గా వృత్తి జీవితాన్ని ప్రారంభించి, మంచి బ్రాడ్కాస్టర్ అయ్యారు. పాత్రికేయురాలిగా పలు పత్రికలకు రచనలు చేస్తూ 'విపుల' సంపాదకురాలిగా పదవీ విరమణ చేసారు. కథల సంపుటి, కవితా సంపుటులను ప్రచురించారు. మంచి వక్త, వ్యాఖ్యాత, అనుకరణ కళాకారిణి .

**లక్ష్మి పేరేపు :** జన్మస్థలం తూ.గో.జిల్లా అనకాపల్లి. 7.12.1956లో జన్మించారు. సంఘర్షణం, పండగొచ్చింది, కలుపు మొక్క, కల్పవృక్షం మొదలైన 26 కథలను వ్రాశారు.

**లక్ష్మి ములుగు :** జన్మస్థలం ఒంగోలు. కలంపేరు మైథిలి. నెల్లూరులో నివాసం. తెలుగు వైద్యుత మహానిఘంటువుకు నెల్లూరు మాండలిక పదకోశం రచించారు.

3 కవితాసంపుటాలు,4 కథాసంకలనాలు,5 వ్యాససంకలనాలు వెలువరించారు. అనేక సాహితీ సంస్థల పురస్కారాలు, ప్రతిష్ఠాత్మక లేడీ లెజెండ్ అవార్డు పొందారు. చిరునామా: W/O యమ్. చంద్రశేఖర్ రావు, 26-9-482/2, పాత వేదాయపాలెం , చెప్పుల గోడౌన్ ఎదురు, ఏ.కే.నగర్, నెల్లూరు-524345.

**లక్ష్మి. పి.ఎస్.ఎం :** జన్మస్థలం గుంటూరు జిల్లా. హైదరాబాదు నివాసం. విశ్రాంత సీనియర్ అకౌంట్స్ ఆఫీసర్. గజలక్ష్మి కళ్యాణం, డాక్టర్.. డాక్టర్ హాస్య నాటికలు ప్రచురించారు. దూరదర్శన్, పత్రికలకు కథలు, వ్యాసాలు, నాటికలు వ్రాశారు. యాత్రావిశేషాలతో 450 వ్యాసాలు వ్రాశారు. చిరునామా: బి-391, 1వ ఫ్లోర్, శ్రీకృష్ణ నగర్, యూసఫ్ గుడా, హైదరాబాద్-500045. ఫోన్. నం. 9866001629.

**లక్ష్మి కందిమళ్ళ :** కవయిత్రి. కర్నూలు.చిరునామా: బాసర వెస్ట్ అపార్ట్ మెంట్, 46/1-103. చాణక్యపురి కాలనీ ఎ క్యాంపు, కర్నూలు.

**లక్ష్మి తులసి లోగీశ :** ప్రముఖ నవలా రచయిత ఇందూ రమణ భార్య. కథలు, కవితలు, వ్యాసాలు రాస్తారు. చంద్రోదయం కథకు 10000రూ.బహుమతి లభించింది. చిరునామా: వైఫాఫ్ ఇందూరమణ, 7-50, శ్రీసాయి నిలయం, బంగారమ్మ గుడి వద్ద, సిమ్హాచలం పోస్ట్, విశాఖపట్నం.పిన్ :530028. ఫోను నం. 9640220868.

**లక్ష్మి ప్రమీల కోనేరు ( కోగంటి ).డా. :** జన్మస్థలం గుంటూరు జిల్లా వేమూరు 20-07-1949లో జననం. విజయవాడలో నివాసం. 55 వ యేట చదువు ప్రారంబించి బి.ఏ., ఎం.ఏ., ఎం.ఫిల్., పి.హెచ్.డి పూర్తి చేసి 69వ యేట డాక్టరేట్ పొందారు. 55 వ యేటనే యోగా ప్రాక్టీస్ చేసి రాష్ట్ర, జాతీయం గా బంగారు, వెండి బహుమతులు పొందారు. రాష్ట్ర స్థాయి 10కే రన్లో 60ష గ్రూప్లో బంగారు పతకం, నగదు పొందారు. పరిశోధక గ్రంథం, ఆంధ్ర ప్రదేశ్ లో పేరంటాళ్ళు 2018 లో విడుదల చేశారు. కవితలు, వ్యాసాలు రాస్తారు. పాటలు కూడా పాడుతారు. మల్టీ టేలెంటెడ్ ఉమెన్, జీవన సాఫల్య పురస్కారాలు పొందారు. ఫోను నం: 9866221119.

**లక్ష్మి రాఘవ :** జన్మస్థలం చిత్తూరుజిల్లా మదనపల్లె తాలూకా గట్టు గ్రామం. 1948లోజన్మించారు. అపురూపం, నావాళ్ళు, అనుబంధాల టెక్నాలజీ, స్మార్ట్ జీవితం కథాసంపుటిని వెలువరించారు. 100కథలు ప్రచురితం. కొన్ని కథలు కథా సంకలనాలలో చోటుచేసుకోగా, కొన్ని కన్నడ భాషలోకి అనువదింపబడి

"నన్నవరు" కథాసంపుటిగా వెలువడ్డాయి. కుప్పం రెడ్డెమ్మ అవార్డ్, కథాపీఠం, కలహంస కథా పురస్కారం, తమిరిశాప్పారావు గారి స్మారక బహుమతి వంటి సత్కారాలు పొందారు. వ్యర్థ పదార్థాలతో ఆకృతులు చేసి ఎగ్జిబిషన్ నిర్వహించి హస్తకళల విదుషీమణిగా పేరు పొందారు. చిరునామా: అప్పగారి స్ట్రీట్, కురబలకోట-517350, చిత్తూరు జిల్లా, ఆం. ప్ర., ఫోను నం. 9440124700

**లక్ష్మీ శాంతమ్మ భువనగిరి:** భీష్మ స్తవరాజము : భగవద్గీతానువాదము చేశారు.

**లక్ష్మీ సరోజారెడ్డి కాసర :** 14-04-1963 న కందుకూరు లో జననం. ప్రతిభా పబ్లిక్ స్కూల్, జంగారెడ్డిగూడెం ప్రిన్సిపాల్. వైద్య, విధ్యా సదస్సులు నిర్వహించారు. బాలికా విధ్యపట్ల కృషి చేశారు. అనాధ అనే కథకి జాతీయ స్థాయిలో ద్వితీయ బహుమతి పొందారు. మరికొన్ని కథలు, కవితలు బహుమతి పొందాయి. మహిళా శిరోమణి, విధ్యా సేవారత్న, ఆంధ్ర రత్నం, నేషనల్ ఎక్సలెన్సి, ఏ.టి.ఏ ఇండియా అవార్డులు పొందారు. ఫోన్: 9440332632.

**లక్ష్మీ సుభద్ర వడ్డాది.** అనకాపల్లిలో జననం, విజయవాడలో నివాసం. విశ్రాంత హిందీ ఉపాధ్యాయిని. కవితలు, గేయాలు, పద్యాలు,రేడియో నాటికలు,మినీ కథలు, వ్యాసాలు రాస్తారు. హిందీలో 2 జీవిత చరిత్రలు, మోహనాష్టకం కావ్యం,ధ్యాన శిక్షణ,రామాయణ కథలు, డ్రామాలు వ్రాశారు. చిరునామా. ఫ్లాట్ నం. 10,సి.టి.ఓ.కాలనీ,విజయవాడ-8. ఫోన్. 6305000439.

**లక్ష్మీకనకదుర్గ ప్రఖ్య:** విజయవాడ. ఉపాధ్యాయురాలు. రచనలు: నిత్యజీవితంలో ఉపనిషత్తులు; శ్రీదేవీ భాగవతము సంస్కృతం నేర్చుకుందాం.

**లక్ష్మీకల్యాణి సింగీతం :** జన్మస్థలం తూ.గో.జిల్లా కాకినాడ. 9.10.1936 లో జన్మించారు. తప్పెవరిది?, స్వప్నవర్తకుడు అనే కథలను రచించారు.

**లక్ష్మీకాంతమ్మ ఊటుకూరి :** జన్మస్థలం ఏలూరు. డిసెంబరు 25, 1917 లో జన్మించారు. కవయిత్రీ, పరిశోధకురాలు. తనపేరు లక్ష్మీకాన్తమ్మ అని రాసుకున్నారు. విద్యాభ్యాసం రాజమండ్రి వీధిబడిలో ప్రారంభమైంది. తరువాత వైశ్య సేవాసదనము యువతీ సంస్కృత కళాశాలలో చదివి ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి ఉభయభాషాప్రవీణ 1935లో మొదటి శ్రేణిలో ఉత్తీర్ణురాలయ్యారు. యల్లాప్రగడ జగన్నాథము పంతులుకు ఆధ్యాత్మిక గురువు. విజయవాడ, మద్రాసు రేడియోలలో రచనలు, ప్రసంగాలు ప్రసారమయ్యాయి. రచనలు దేవీస్తవతారావళి, మనసాహితి, మధుభారతి (గేయాలు), కన్యకమ్మనివాళి (కన్యకాపరమేశ్వరి స్తోత్రము, 1978), మహిళావిక్రమసూక్తము,

ఆంధ్రుల కీర్తనవాఙ్మయసేవ; పరిశోధనా రచనలు ఆంధ్రుల సంగీతవాఙ్మయంపై ఒక పరిశోధన, ఆంధ్ర కవయిత్రులు, అఖిల భారత కవయిత్రులు, హంస విజయము, అభిజ్ఞాన శాకుంతలము, జాతి పిత, ఒక్క చిన్న దివ్వె (చిన్న కవితలు), శ్రీ కన్యకా సుప్రభాతం మొదలైన 23 గ్రంథాలు రచించారు. అముద్రిత రచనలు చంద్రమతి కథ (బాలసాహిత్యము), సాహిత్య వ్యాసమంజరి, ఋతంబరి (గద్యగీతము), యుగళ సిరి. బిరుదులు: డాక్టరేట్, విద్వత్కవయిత్రి, ఆంధ్ర విదుషీకుమారి, తెలుగు మొలక, ఆంధ్ర సరస్వతి, కవయిత్రీ తిలక, కళాప్రపూర్ణ మొదలైనవి. సత్కారాలు అనంతపురం పౌరులచే కనకాభిషేకము, పౌరసన్మానమ్ము 1953లో గృహలక్ష్మి స్వర్ణకంకణము. 1996లో మరణించారు.

**లక్ష్మీకాంతమ్మ గిడుగు (మద్రాసు) :** లక్ష్మీ శారదాగీతములు, శతకములు, కుమారీనీతి, లేఖదూత, కన్నీరు రచించారు.

**లక్ష్మీకాంతమ్మ పెయ్యేటి :** ప్రముఖ తెలుగు కవయిత్రి. వీరికి ముక్తికాంత అనే బిరుదు ఉంది. శ్రీమతి లక్కరాజు సుందరి, సీతారామయ్యల పుత్రిక. పుట్టిన తేదీ విషయంలో స్పష్టత లేదు. కానీ, 'అంతరార్థ రామాయణం' లోని ఆంతరంగిక ఆధారాలను అనుసరించి 1950 (వికృతి నామ) సంవత్సరంలో స్వర్గస్థులయినట్లు మాత్రం తెలుస్తుంది. అంతరార్థ రామాయణంతో పాటు వివిధ పురాణేతిహాసాలను, వాటిలోని అంతరార్థాలనూ వివరిస్తూ వివిధ కావ్యాలను గానం చేసేవారు. అంతరార్థ రామాయణంలో పేర్కొన్న వివరాల ప్రకారం కింది రచనలను చేసినట్లు తెలుస్తుంది. 1. అంతరార్థ నరకాసురవధ, 2. అంతరార్థ రుక్మిణీ కల్యాణం, 3. అంతరార్థ గజేంద్ర మోక్షం, 4. అంతరార్థ సాగర మధనం, 5. వచన భగవద్గీత, 6. లాలి పాటలు.

**లక్ష్మీకాంతమ్మ రామిశెట్టి :** జన్మస్థలం నెల్లూరు. 14.8.1934లో జన్మించారు. మగవాళ్ళు మంచివాళ్ళు(7కథలు); డాక్టర్ ఎందుకలా చేశాడు? అనే కథల సంపుటి వ్రాశారు.

**లక్ష్మీకాన్తమ్మ చివుకుల :** మద్రాసు చూడికుడుత్తమ్మాళ్: 'మృగశృంగ చరిత్ర' కావ్యం వ్రాశారు.

**లక్ష్మీదేవి చిలుకూరు :** జన్మస్థలం అనంతపురం. 25.7.1959లోజన్మించారు. నిర్ణయం కథల సంపుటి వ్రాశారు.

**లక్ష్మీనరసమాంబ పులగుర్త :** ప్రముఖ తెలుగు కవయిత్రి. స్త్రీ విద్య పట్ల అభిమానం ప్రదర్శిస్తూ గ్రంథ రచన సాగిస్తూ, సావిత్రి పత్రికలో స్త్రీల రచనల్ని ప్రోత్సహిస్తుండేవారు. కాల్పనిక రచనలు చేసే మహిళలలో ప్రథములు. తండ్రి

చింతలపూడి నీలాచలం, భర్త పులుగుర్త వెంకటరత్నం, మేనమామ ప్రముఖ పండితుడు నడకుదుటి వీరరాజు, గురువు కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి. 15 సంవత్సరాల వయస్సులోనే మహిళా కళా బోధిని అనే గ్రంథం రచించింది. కాకినాడలో విద్యార్థినీ సమాజాన్ని స్థాపించారు. వ్యాసాలు సావిత్రి, హిందూ సుందరి, జనని మొదలైన పత్రికలలో ప్రచురించబడేవి. లక్ష్మీనరసమాంబ ప్రారంభించిన సావిత్రి పత్రిక తొలి సంచిక (1904 జనవరి) లో 'సతీ ధర్మాలు, నీతి కథావల్లరి' లాంటి నీతి బోధకమైన రచనల్తో 'ధైర్యస్థైర్యాలు, సావిత్రి, లోక బాంధవి' లాంటి నాటికలు ప్రచురించబడ్డాయి. ఇది కాకినాడ నుండి ప్రచురితమయ్యేది. లక్ష్మీ నరసమాంబ మంచి వక్త. హిందీ, బెంగాలీ భాషలలో గొప్ప పండితురాలు. స్త్రీలకు విద్య అవసరమని వాదిస్తూ, తన పత్రిక ద్వారా ప్రచారం చేసేవారు. కందుకూరి సంఘ సంస్కరణోద్యమం పట్ల వ్యతిరేక భావాలుండేవి. పత్రికను ప్రోత్సహించమని చేసిన విజ్ఞప్తిని గమనిస్తే ఆనాటికీ, ఈనాటికీ స్త్రీల పత్రికల ఆర్థిక స్థితిలో ఏమి మార్పులేదని అర్థమవుతుంది. రచనలు  లోకబాంధవి (గద్య గ్రంథం), వజ్రపేటిక (కథ), కామ మంజరి (గద్య గ్రంథం), యోగేశ్వరి (పద్య కావ్యం), అన్నపూర్ణ (పద్య కావ్యం), వామన పురాణం (పద్య కావ్యం), మహిళా కళా బోధిని (పద్య కావ్యం), స్త్రీ నీతి గీతమాల (పద్య కావ్యం), సతీధర్మములు (పద్య కావ్యం), అమాల్య (పద్య కావ్యం), మంగళహారాలు.

**లక్ష్మీనరసమాంబ మోదవరపు :** "భద్రాచలాధీశ్వర శతకము" కావ్యకర్త్రి.

**లక్ష్మీపార్వతి నందమూరి :** 1962 ఆగష్టు 10లో జన్మించారు. తెలుగులో రచయిత. తెలుగుదేశం పార్టీ అభిమానురాలైన లక్ష్మీపార్వతి తన భర్త వీరగంధం సుబ్బారావుతో కలిసి 1985లో ఎన్టీ రామారావు జీవితచరిత్ర వ్రాసే ఉద్దేశంతో ఆయన్ను కలుసుకున్నది. పట్టుదలతో ప్రయత్నించి రామారావు నుండి జీవితచరిత్ర వ్రాయటానికి అనుమతి సంపాదించి 1987లో రామారావు ఇంట్లోనే నివసించే అవకాశాన్ని పొందింది. లక్ష్మీపార్వతి ఎన్టీ రామారావు జీవితచరిత్రను వ్రాసే సమయంలో రామారావుకు సన్నిహితమై 1993లో వివాహం చేసుకున్నది. ఎన్టీ రామారావు మరణానంతరం ఆయన జీవితచరిత్రను "ఎదురులేని మనిషి" అన్న పేరుతో 2004లో విడుదలచేసింది.

**లక్ష్మీప్రశాంతి ఉప్పలపాటి :** జన్మస్థలం నెల్లూరు పట్టణం. 26.6.1979లో జన్మించారు. బహుమతి అనే కథాకేళి రచించారు.

**లక్ష్మీప్రసన్న తుంగల :** ఆంగ్ల ఉపాధ్యాయురాలైనా తెలుగులో చక్కని కవితలు రచిస్తున్న వర్ధమాన రచయిత్రి.

**లక్ష్మీబాయమ్మ ద్రోణంరాజు.**

**లక్ష్మీబాయి, (కాపా) వల్లూరిపల్లి :** జన్మస్థలం కృష్ణాజిల్లా కమ్మవారిపాలెం. 1-11-1936(?)లో జన్మించారు. ఎం.ఏ., బి.ఇడి. చేశారు. గణితోపాధ్యాయినిగా పనిచేశారు. ప్రతిబంధకం, ఒక పువ్వు రాలింది మొదలైన 9 కథలు వ్రాశారు.

**లక్ష్మీశేషబాయి మంత్రిప్రగడ :** జన్మస్థలం విశాఖపట్టణంజిల్లా. 6.3.1934 లో జన్మించారు. ఎం.ఏ.(తెలుగు) చదివారు. పేర్రాజూ ప్రేమ కండూతి అనే సంపుటిని 16 కథలతో రచించారు.

**లక్ష్మీసుజాత చింత :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'ఇబ్రహీంపట్నం'. 1964లో జన్మించారు. మనీష పబ్లికేషన్స్, మనీష్ కంప్యూటర్స్‌లు నెలకొల్పారు. ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో కాజువల్ ఎనౌన్సర్. 'మనీష' సాహిత్య సాంస్కృతిక సామాజిక సేవా సంస్థ ద్వారా సేవలందిస్తున్నారు. వీరి కవితలు దిన, వార పత్రికలలో ముద్రితమైనాయి. కవితల పోటీలలో పాల్గొంటూంటారు. ఆం.ప్ర. సాంస్కృతిక సమాఖ్యవారి ప్రత్యేక బహుమతి; శ్రీశ్రీ స్మారక అవార్డు; శ్రీశ్రీ సాహిత్యంపై విశ్లేషణకు, రాష్ట్ర స్థాయి ప్రత్యేక బహుమతి; సాహిత్య పరిషత్ వారిచే దేవులపల్లి కృష్ణ శాస్త్రి స్మారక బహుమతి అందుకున్నారు. ఆకాశవాణిలో కవిసమ్మేళనాలు, ప్రత్యేక కదంబ కార్య క్రమాలు నిర్వహిస్తూంటారు. దూరదర్శన్లో 2000 వ సం.; 2002వ సం. కవిసమ్మేళనాలు నిర్వహించారు. ప్రస్తుతం విజయవాడలో నివసిస్తున్నారు. "అమ్ముల పొది" అనే పేరుతో తన భావ బాణ పరంపరను సంధించారు.

**లత తెన్నేటి :** జన్మస్థలం కృష్ణాజిల్లా విజయవాడ. "నిభానుపూడి విశాలాక్షి నారాయణ రావు" దంపతులకు 15 నవంబరు 1935లో జన్మించారు. ప్రముఖ నవలాకారిణి 'లత' గా ప్రఖ్యాతి గాంచి, వివిధ ప్రక్రియల రచనలతో తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన 'తెన్నేటి హేమలతాదేవి గారు' పూర్తి పేరు "జానకీ రామ కృష్ణవేణి హేమలత'. విజయవాడలోనే పాఠశాల విద్య నభ్యసించి, ముగించారు. కానీ ఇంటి వద్దనే సంస్కృతాంధ్రాంగ్ల కావ్యాలను అభ్యసించి, అపారమైన జ్ఞానాన్ని ఆర్జించారు. మొదటి నాటిక 'శిలాహృదయం'. 'పాంచాలి' పేరుతో ఒక నవలను వ్రాసారు. చాలా రేడియో నాటికలు వ్రాశారు. 1952 లో డక్కన్ రేడియోలో

ప్రసారమైంది. తరువాత సినిమాలకు మాటలు వ్రాశారు. మంగళంపల్లివారి కొన్ని రాగాలకు పాటలు కూడా రచించారు. తన నవల "గాలిపడగలునీటి బుడగలు"లో వేశ్యల దుర్భర బ్రతుకులు చిత్రించారు. ఇదే విషయాన్ని తన "రక్త పంకం" అనే నవలలో మరింత లోతుగా విశ్లేషించారు. "మోహనవంశీ" మరియు అంతరంగ చిత్రం అనే నవలలలో జీవితానికి సంబంధించిన కొన్ని సన్నివేశాలు తెలుస్తాయి. 1980లో "రామాయణ విషవృక్ష ఖండన" అనే పుస్తకాన్ని రంగనాయకమ్మ రామాయణ విషవృక్షానికి విమర్శగ్రంథంగా వ్రాసారు. "ప్రియతముడు" అనే నవల హైదరాబాదు ఆరవ నిజాము మీర్ మహబ్బాబ్ ఆలీ ఖాన్ జీవితం ఆధారంగా వ్రాసారు. లత గారి మాటల్లోనే, "నేను 105 నవలలు, 700 రేడియోనాటకాలు, 100 చిన్నికథలు, పది రంగస్థల నాటకాలు, 5 సంపుటాల సాహిత్యవ్యాసాలు, రెండు సంపుటాల సాహిత్య విమర్శలు, ఒక సంపుటి "లత వ్యాసాలు", ఇంకా 25 చరిత్రకందని "ప్రేమకథలు" అనే కవితలు వ్రాసాను" అని అన్నారు. జీవన్మరణాలను గురించిన భావాలతో ప్రశ్నోత్తరాలుగా 1980లో "అంతరంగ చిత్రం" వెలువడింది. 'ఊహాగానం' పేరుతో "మ్యూజింగ్స్"ని ధారావాహికంగా, ఆంధ్రప్రభ సచిత్రవారపత్రికలో 1956 నుంచీ 197 వారాల పాటు సాగిన విలక్షణ రచన. ఇతర రచనలు బ్రాహ్మణ పిల్ల, నీహారిక, దెయ్యాలు లేవు?, పథ విహీన, తిరగబడిన దేవతలు, జీవన స్రవంతి, భగవంతుడి పంచాయితీ, ఒమర్ ఖయ్యాం, చరిత్ర హీనులు, కాలం కరచిన కడపట, ప్రియతముడు, అవమానిత" మొదలైనవి కాల్పనికేతర రచనలు ఊహాగానం 5 సంపుటాలు, అంతరంగ చరిత్రం, లత వ్యాసాలు, లత రామాయణం (రెండు సంపుటాలు). స్త్రీ పురుష సంబంధాలలోని సంక్లిష్టతని, చలం ప్రతిపాదించిన స్వేచ్ఛా ప్రణయాన్నీ, స్త్రీ స్వేచ్ఛనీ చిత్రిస్తూ "సప్తస్వరాలు, పథ విహీన, మహానగరంలో స్త్రీ" మొదలైనవి కాగా కవితాత్మకంగా రాసిన విశిష్ఠ నవల 'మోహన వంశి'. అవార్డులు 'గృహలక్ష్మి స్వర్ణకమలం' 1963; ఆంధ్ర విశ్వవిద్యాలయము కళాప్రపూర్ణ' , అసామాన్య వనిత' ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం 1981 అందుకున్నారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీలో 20 సంవత్సరాల పాటు పని చేశారు. తన 65 వ ఏట 1997 సం.లో మరణించారు.

**లలిత కవాడపు :** తెలుగు అధ్యాపకురాలు, కర్నూలు. వ్యాసాలు, కవితలు పత్రికల్లో ముద్రితం. జాతీయ, అంతర్జాతీయ సదస్సుల్లో పత్ర సమర్పణలు. చిరునామా: ఇం.నం.8/37, కవాడి వీధి, కర్నూలు జిల్లా. పిన్: 518001. ఫోను నం.9959806205

**లలిత కుమారి నాయుడు :** విజయవాడ, ఉపాధ్యాయిని, శ్రీ షిరిడీ సాయి స్నేహ దీపిక ఉపాధ్యక్షురాలు. 50 కవితలు, బాల గేయాలు, దేశ భక్తి గేయాలు, 25 భక్తి గేయాలు, 15 వ్యాసాలు, నాటికలు, రెండు కథలు, అముద్రితాలు. రేడియో కార్యక్రమాలలో పాల్గొన్నారు. చిరునామా: ఇంటి నెం: 31-20-10/3ఎ అన్నే రామకోటేశ్వర రావు వీధి,మాచవరం డౌన్,విజయవాడ -520004ఫోన్: 9393439266

**లలిత వకుళాభరణం :** ప్రముఖ పరిశోధకురాలు, రచయిత్రి, కళాకారిణి. వృత్తిరీత్యా అధ్యాపకురాలైన లలిత నేరస్థ జాతులపై పరిశోధించి సిద్ధాంత గ్రంథాన్ని రచించారు.

**లలితకుమారి మైలవరపు డా. :** విశ్రాంత తెలుగు అధ్యాపకురాలు. జన్మస్థలం గుంటూరు. 24.10.1955లో జన్మించారు. ఎం.ఫిల్,పి. హెచ్.డి.చేశారు. అనేక పత్రికలలో కవితలు,పిల్లల కథలు ప్రచురింపబడ్డాయి. జాతీయ స్థాయిలో తెలుగు కవయిత్రుల సదస్సును నిర్వహించారు. 50 పైగా సదస్సుల్లో పత్రసమర్పణలు చేశారు.'' ఆంధ్ర మహాభాగవతము - సఖ్య భక్తి'' గ్రంథమును వెలువరించారు.సందేశాత్మక హాస్య నాటికలు రాసి పిల్లలచే ప్రదర్శింపచేశారు.

**లలితశర్మ భాగవతుల :** జన్మస్థలం విశాఖపట్నం. 15.9.1944లో జన్మించారు, ప.గో.జిల్లా కొవ్వూరులో నివసిస్తున్నారు. తీరని ఋణం (28 కథల సంపుటి) రచించారు.

**లిల్లెమ్మ సందిపాము :** మైలవరం మండలం, గణపవరంలో జన్మించారు. వచన కవయిత్రి.

**లీలా సుష్మ గుమ్మా :** 01.09.1988న జన్మించారు, విజయవాడలో నివాసం. విజయవాడలో తొలి " న్యూట్రిప్రెన్యూర్". ఆహారమే ఆరోగ్యం, తినండి-తగ్గండి ఆరోగ్యంగా గ్రంథాలు ముద్రించారు. మన ఆరోగ్యం మాసపత్రికలో గత 4 సంవత్సరాల నుండి పోషక ఆహార సంబంధ వ్యాసాలు రచిస్తున్నారు. ఆకాశవాణి విజయవాడ, ఎఫ్ ఎం., చానల్స్‌లో పోషక ఆహార సలహాలు, సూచనలు ఇస్తారు. చిరునామా: శ్రీ శరణం టవర్స్, 506, ఎన్ టి ఆర్ కాలనీ, నాలుగవ లైన్, విజయవాడ - 520008.ఫోను. నం: 6304564591

**లీలావతి కె. :** గ్రంథరచయిత్రి.జన్మస్థలం ఒంగోలు. 10.1.1956లో జన్మించారు. 'భాషా ప్రవీణ' ఉత్తీర్ణులయారు. 1989-2014 వరకు తెలుగు ఉపాధ్యాయినిగా పనిచేశారు. వీరు 'ద్విశత సూక్తినిధి' ప్రచురించారు.

**లీలావతి కోడూరి :** రచనలు కుంకుమరేఖ, రవికవి (రవీంద్రనాథ్ టాగూర్ జీవిత చరిత్ర) (కోడూరి శ్రీరామమూర్తి సహరచయిత). పురస్కారాలు: గృహలక్ష్మి స్వర్ణకంకణం 1974; ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాహిత్య అకాడెమీ అవార్డు 1969.

**వనజ కుమారి గరుడాద్రి.** ఉపాధ్యాయిని, కర్నూలు. తరచు రేడియో ప్రసంగాలు. టి.టి.డి.తరఫున ఆధ్యాత్మిక ప్రసంగాలు. ఫోన్. 9989825607.

**వరలక్ష్మమ్మ కనుపర్తి :** జన్మస్థలం బాపట్ల. 1896, అక్టోబర్ 6న పాలపర్తి శేషయ్య, హనుమాయమ్మ దంపతులకు జన్మించారు. 1919 లో ఆంగ్లానువాదా కథ అయిన సౌదామినితో రచనలు చేయడం ప్రారంభించారు. లేడీస్ క్లబ్, రాణి మల్లమ్మ, మహిళా మహోదయం, పునః ప్రతిష్ఠ వంటి నాటికలు, 'ద్రౌపది వస్త్ర సంరక్షణ అనే ద్విపద కావ్యం, సత్యా ద్రౌపది సంవాదం , నాదు మాట మొదలైన పద్య రచనలు చేసారు. 'నమో ఆంధ్ర మాతా' పేరుతో గేయాలు రాసారు. గాంధీ మీద దండకం కూడా రాసారు. పిల్లల పాటలు, నవలలు, పిట్ట కథలు, జీవిత చరిత్రలు, కథలు అనేక ప్రక్రియలలో రచనలు చేసారు. వరలక్ష్మమ్మ కథలు కొన్ని తమిళ, కన్నడ, హిందీ భాషలలోకి అనువదించబడ్డాయి. ప్రపంచ తెలుగు మహాసభలో సన్మానం పొందిన రచయిత్రి. మద్రాసు, విజయవాడ ఆకాశవాణి కార్యక్రమాలలో పాల్గొన్న మొదటి మహిళ వరలక్ష్మమ్మ. కనుపర్తి వరలక్ష్మమ్మ ప్రముఖ మాసపత్రిక గృహలక్ష్మిలో 1929 నుంచి 1934 వరకు ధారావాహికంగా శారదలేఖలు అన్న శీర్షకతో అనేక సమస్యలు చర్చిస్తూ రాసారు. తరువాత శారదలేఖలు అన్న పేరుతో పుస్తకంగా ప్రచురించారు. ఆధునిక భావాలుగల శారద పాత్ర ద్వారా స్త్రీలని చైతన్యవంతం చేయడానికి దోహదం పడ్డారు. ఒక రచయిత్రి ఒక ప్రముఖ పత్రికలో అంతకాలం ఒక కాలమ్ నిర్వహించడం అదే ప్రథమంగా గణింపబడుతోంది. 1934లో గృహలక్ష్మి స్వర్ణకంకణాన్ని అందుకున్న మొదటి మహిళ. 1978, ఆగష్టు 13 న మరణించారు.

**వరలక్ష్మి కె. :** జన్మస్థలం తూర్పు గోదావరి జిల్లా జగ్గంపేట. కుమార్తె డాక్టర్ కె. గీతా ఒక ప్రసిద్ధ కవిత్వ రచయిత్రి. వారి చిన్న కుమార్తె, శ్రీ లలిత కూడా కథ రచయిత్రే. వరలక్ష్మి గారి కథలు ప్రధానంగా తను నివసిస్తోన్న మెట్ట ప్రాంతానికి చెందిన స్త్రీల, బడుగు జీవులకు చెందిన కథలు. చదివే వారిని ఎంతగానో ప్రభావితం చేస్తాయి. అలాగని రచనలు ప్రాంతాలతోనే ఆగిపోలేదు. తను సందర్శించిన ఎన్నో ప్రాంతాలకు చెందిన వారి జీవితాల్ని స్పృశిస్తూ కథలు, కవిత్వం వ్రాసారు. రేడియో నాటికలు, వ్యాసాలు, నవలికలు వ్రాసారు. కథల సంపుటులు జీవరాగం, మట్టి బంగారం, అతడునేను, క్షతగాత్ర, పిట్టగూళ్ళు.

కవితా సంపుటి , అనేక కథలు, కవితలు, వ్యాసాలు, నవలలు. కథ లోంచి కథ (ధారా వాహిక), నా జీవన యానంలో (ధారావాహిక ఆత్మకథ) పురస్కారాలు కవిత్వానికి: శ్రీ శ్రీ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, కందుకూరి రాజ్యలక్ష్మి మొ.న పురస్కారాలు; కథలకు; సుశీలా నారాయణ రెడ్డి పురస్కారం; చాసో స్ఫూర్తి పురస్కారం; శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య పురస్కారం మొ॥నవి 15 అందుకున్నారు.

**వసంతలక్ష్మి వేమన :** జన్మస్థలం కృష్ణాజిల్లా ఉయ్యూరు. నెల్లూరులో పెరిగారు. జర్నలిజంలో న్యూస్ ఎడిటర్గా, ఎడిటర్ ఇన్ చార్జ్గా బెంగుళూరు, విజయవాడ లలోపనిచేశారు. మద్రాసులో చదువుకున్నారు. రాజకీయ శాస్త్రంలో ఎమ్.ఏ. చేశారు. ఉదయం దినపత్రికలో స్త్రీలకోసం 'మానవి' అనే శీర్షికను సంవత్సరం పైగా నిర్వహించారు. పత్రికా స్వేచ్ఛ, పౌరహక్కుల ఉద్యమాలలో కూడా పాల్గొన్నారు. అనేక కరపత్రాలు కూడ రచించారు. 'మానవ హక్కుల బులెటిన్' కు సంపాదక బాధ్యత కూడ వహించారు. ప్రస్తుతం 'నీహార్ ఆన్ లైన్.కామ్' తెలుగు ఎడిషన్ కు సంపాదకురాలు. ఇంగ్లీషు నుంచి కొన్ని కథలు తెలుగులోకి అనువాదం చేశారు. 'దుశ్శాసనాలు, మిస్సింగ్, ప్రయోగం, రెక్కలు' అనే పుస్తకాలు ప్రచురించారు.

**వసుంధర (జొన్నలగడ్డ రామలక్ష్మి & జొన్నలగడ్డ రాజగోపాలరావు) :**

**వసుంధర మల్లాది :** ప్రముఖ రచయిత్రి. జననం 1934లో. ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు 1951లో ఇంటర్మీడియట్ ఉపవాచకంగా ఉపయోగించుకోడానికి నడిపిన చారిత్రక నవలల పోటీలలో మల్లాది వసుంధర రచించిన తంజావూరు పతనము ప్రథమ బహుమతి పొందింది. ఆ తరవాత రచించిన నరమేధము కూడా నాన్డిటైల్డ్ పుస్తకంగా వాడబడింది. రచించిన రామప్పగుడి, సప్తపర్ణి నవలలు కూడా బహుమతులు పొందాయి. నవలలు మల్లాది వసుంధర ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి చారిత్రిక నవలల బహుమానాలు పలుమార్లు గెలుచుకుంది. ప్రధానంగా చారిత్రిక నవలా రచయిత్రిగా పేరుపొందింది. తంజావూరు పతనము (బహుమతి పొందిననవల), రామప్పగుడి (బహుమతి పొందిన నవల), పాటలి, యుగసంధి, సప్తపర్ణి (బహుమతి పొందిన నవల), నరమేధము, దూరపు కొండలు కథలు: అచల, అలక తీరిన అపర్ణ. పురస్కారాలు ఆంధ్రాయూనివర్సిటీ ఉత్తమ చారిత్రకనవల పురస్కారం.

**వసుంధరాదేవి ఆర్.(రాటకొండ) :** తెలుగు భాషలో లఘు కథా రచయిత్రి. వ్రాసిన రచనలు అనేక సంపుటాలుగా ప్రచురితమైనాయి. వాటిలో "వసుంధరాదేవి కథలు" అనేది 2004 లో ప్రచురితమైనది. వాటిలో కొన్ని యితర భాషలైన

హిందీ, ఒరియా మరియు కన్నడ భాషలలోకి అనువదింపబడ్డాయి. ఆంగ్ల అనువాదాలు కూడా బహుళ ప్రాచుర్యం పొందాయి. తెలుగు భాషలో చేసిన కృషికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డులను పొందారు. గంగాధరం అవార్డు, ప్రతిభా పురస్కారం (ఉత్తమ మహిళా రచయిత్రి తెలుగు,1992) అందుకున్నారు. ప్రస్తుతం న్యూయార్క్ లో నివసిస్తున్నారు.

**వసుంధరాదేవి రాటకొండ :** 1931లో జన్మించారు. "వసుంధరాదేవి కథలు", అనేక కవితా సంకలనాలు వెలువరించారు.ఆమె కథలు ఆంగ్లం, హిందీ, ఒరియా, కన్నడ భాషల్లోకి అనువాదం అయ్యాయి.ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందారు. గంగాధరం ప్రతిభా పురస్కారం అందుకున్నారు.

**వసుమతి చలసాని :** జన్మస్థలం కృష్ణాజిల్లా తోట్లవల్లూరు. జననం 9.11.1939. విజయవాడలో స్థిరపడ్డారు.హిందీ ఉపాధ్యాయిని, ఆంధ్రాబ్యాంకు ఉద్యోగినిగా పనిచేశారు. రామాయణంలో ఉపేక్షిత పాత్రలకు ప్రాముఖ్యం కల్పిస్తూ సుమిత్ర వంటి నవలలు వ్రాశారు. భ్రమరగీతం, యశోదకృష్ణ, చిత్రలేఖ, అహల్య(హిందీ), గౌతమి, వసుమతీపథం, కుంతల, గాజుల సవ్వడి, కవి ఇతర గ్రంథాలు. 80పైగా కథలు, పలు కవితలు, వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. విశిష్ట మహిళ పురస్కారం, నేషనల్ ఆర్గనైజేషన్స్ ఫర్ వుమెన్ డెవలప్మెంట్ పురస్కారం, లేడీ లెజెండ్స్ లైఫ్టైం అవార్డులు అందుకున్నారు. వసుమతీ మాధవ అవార్డును స్థాపించి సాహితీరంగంలో కృషి చేసే రచయితలకు ప్రదానం చేస్తున్నారు.

**వాణి కటికల :** అశ్వారావుపాలెం. పద్య రచనలు చేస్తున్న ఆదర్శ ఉపాధ్యాయిని. కృష్ణాజిల్లా నెమలి గ్రామంలో ఉపాధ్యాయినిగా పనిచేస్తున్నారు. చిన్నతనం నుంచి కృష్ణభక్తురాలైన ఈమె సాహిత్యంపై మక్కువతో డియడ్ చేస్తుండగా ఛందస్సులో మెళుకువలు నేర్చుకోని "మొరను వినగదోయిముద్దుకృష్ణ!" అనేమకుటంతో శతకరచన చేశారు. "వాణిభాషణంబు వాస్తవంబు అనే మరో శతకరచన చేస్తున్నారు". వీరి భర్తవరదా సురేష్ కృష్ణ (అసావరి కిట్టు) మంచి రచయిత, పద్యకవి. చిరునామా: అశ్వారావుపాలెం-521121. అవనిగడ్డ మండలం కృష్ణాజిల్లా-ఆం. ప్ర. ఫోను నం. 9640662880.

**వాణీ కొరటమద్ది.** విశాఖపట్నం. గజల్స్, కవితలు, ఏకవాక్య కవితలు, సమీక్షలు, కవిత్వ విశ్లేషణలు రాస్తారు. గుప్పెడు గుండె సవ్వడులు కవితా సంపుటిని మంజు యనమదలతో కలిసి వెలువరించారు. గజల్స్ రచనకుగాను భాషాసాంస్కృతిక శాఖవారి బహుమతి పొందారు.రెండు సంకలనాలలో వీరి గజల్స్

ప్రచురితమయ్యాయి. చిరునామా. ఫ్లాట్ నం.జి 4, 1వ ఫ్లోర్,సప్తగిరి టవర్స్,క్రైట్స్ జూనియర్ కాలేజి వెనుక,అచ్యుతపురం-531001. విశాఖపట్నం జిల్లా. ఫోన్. 9866385874.

**వాణి సరోజిని లక్కరాజు :** గుంటూరు. విశ్రాంత ఆఫీస్ సూపర్నెంట్, ఆం.ప్ర. భాషా సాంస్కృతిక శాఖ. మానస రవళి కవితలు, సమాజ దర్పణం(పద్య శతకం) ప్రచురించారు. పత్రికల్లో రచనలు ప్రచురింపబడ్డాయి. కవిసమ్మేళనాల్లో కవితాగానం. ఫోను నం. 9491054829.

**వాణి సింహాద్రి :** జన్మస్థలం కృష్ణాజిల్లా అవనిగడ్డ మండలం బందలాయి చెర్వు గ్రామం. 13.5.1953లో జన్మించారు. ఉపాధ్యాయిని. 2శతకాలు ముద్రించారు. కవితాసంపుటి ముద్రణలో ఉంది. 100కవిసమ్మేళనాలు, 125కవితలు,కొన్ని పద్యఖండికలు, రేడియోలో సమస్యాపూరణ పద్యాలు. చిరునామా:మహిత ఇం.మీడియం హై స్కూల్, కరెన్సీ నగర్, గోపాలకృష్ణయ్య వీధి, విజయవాడ-520008. ఫోను నం. 7799381133.

**వాణీ రంగారావు :** జన్మస్థలం విజయవాడ. రచయిత్రి, నటి, క్రీడాకారిణి, గాయకురాలు, నృత్యకళాకారిణి, చిత్రలేఖకురాలు. కొంతకాలం అరసం కార్యవర్గ సభ్యురాలిగా పనిచేశారు. రచనలు మహిళాలోకం కళ్లు తెరిస్తే(నాటకం), జీవనవాహిని (నవల), కోరికలు(కథ), వెలుగు బాటలో సోవియట్ మహిళ (అనువాద రచన), దీపం, వెలుగు నగరం(కథా సంపుటాలు), యత్రనార్యస్తు పూజ్యతే (రేడియో నాటిక), విషాద భారతంలో మరో ఆడపడుచు (నాటిక), మకిలి పురుగులు. వీరు కొంతకాలం గుంటూరు జిల్లా చిలకలూరిపేట మునిసిపాలిటీ కౌన్సిలర్ గా పనిచేసి పలు ప్రజాహిత కార్యక్రమాల్లో పాల్గొంటూ అక్కడే కాలం చేశారు.

**వాణీప్రభాకరి :** నృత్యం, గాత్రం, చిత్రలేఖనం, వంటలు, ముగ్గులు, సాహిత్యం, ఎంబ్రాయిడరీ..ఇలా 16 అంశాలలో ఆసక్తి, ప్రతిభ చూపి వివిధ పత్రికలలో 5, 890 ఆర్టికల్స్ ప్రచురించారు. 38 బిరుదులు, 50పురస్కారాలు పొందారు. తెలుగు బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డులో స్థానం పొందారు. చిరునామా: టి.ఎఫ్. 2 దేవిప్రియ ఎస్టేట్స్, కోయాగ్జియల్ స్ట్రీట్, సజ్జాపురం, తణుకు-534211. ఫోను నం: 08523024168.

**వాసంతి :** కలంపేర్లు సాహిత్య, చైతన్య స్రవంతి. చిత్తూరుజిల్లా పుంగనూరులో జన్మించారు. 1990ప్రాంతాల్లో అనేక పత్రికల్లో కథలు, కవితలు, విమర్శలు

ప్రచురితం, కొన్ని రేడియోలో ప్రసారం. కొన్ని రచనలకు బహుమతులు పొందారు. చిరునామా. రాజేశ్వరి నిలయం, 1ఎ, చెల్లప్ప వీధి, గాంధీరోడ్, వేలచేరి, చెన్నై-600042.

**వాసవదత్త రమణ.కె.** కథ,నాటక రచయిత్రి, టి.వి.ఇంటర్వ్యూయర్, రేడియో గ్రేడెడ్ ఆర్టిస్ట్. ప్రధాన కార్యదర్శి, శ్రీ దత్తా కల్చరల్ ఆర్గనైజేషన్,ఎం.ఐ.జి.471,1వ ఫ్లోర్,వెంకట రమణ నిలయం, రోడ్ నం.3,కె.పి.హెచ్.బి.కాలనీ, హైదరాబాద్-72. ఫోన్.9848178962.

**వింధ్య.యు.** : జన్మస్థలం విశాఖపట్నం. ఆంధ్రవిశ్వవిద్యాలయంలోమనస్తత్వ శాస్త్రంలో పి.హెచ్.డి. చేశారు. అక్కడే సైకాలజీ విభాగంలో ప్రొఫెసర్గా ఉన్నారు. స్త్రీల మానసిక ఆరోగ్యము, కుటుంబ హింస, స్త్రీల మనస్తత్త్వము గురించి అనేక జాతీయ అంతర్జాతీయ పత్రికలలో వ్యాసాలు వ్రాశారు. అనేక పరిశోధనాపత్ర సంకలనాల్లోవ్యాసాలు ప్రచురింపబడ్డాయి.

**విజయ కొప్పరపు** : "పోరంకి"లో నివసిస్తున్నారు. రచించిన "ఓర్పు నేర్పి చెప్పిన తీర్పు" అనేకథ "విజ్ఞానసుధ" మాస పత్రికలో ప్రచురించబడింది.

**విజయ నాగభూషణమ్మ మధురాంతకం** : జన్మస్థలం చిత్తూరుజిల్లా దామల్ చెరువు గ్రామం. 1.7.1937న జన్మించారు.తిరుపతిలో నివసిస్తున్నారు. ఓ జానకి కథ మొదలైన కథలు వ్రాశారు.

**విజయకుమారి జాలాది డా.** : జన్మస్థలం 'కొండినాయపల్లి' గ్రామం. పరిశోధకురాలు. 'జాలాది సృజనాత్మక సాహిత్యం అనుశీలన' అనే సిద్ధాంతవ్యాసం రచించి, పొట్టిశ్రీరాములు, తెలుగు విశ్వవిద్యాలయంలో సమర్పించి, 2007లో పి.హెచ్.డి.పట్టా పుచ్చుకున్నారు.

**విజయభారతి బోయి** : జన్మస్థలం తూర్పు గోదావరి జిల్లా, రాజోలు. 1941 లో జన్మించారు. ప్రముఖ రచయిత్రి. ప్రముఖ కవి బోయి భీమన్న కూతురు. కోఠీలోని ఉస్మానియా విశ్వవిద్యాలయం మహిళా కళాశాలలో పోస్టుగ్రాడ్యుయేషన్ చేశారు. 'దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయం సాంఘిక పరిస్థితులు' అను అంశంపై పరిశోధన చేసి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్ పట్టా పొందారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగులో డాక్టరేటు పొందిన ద్వితీయ మహిళ విజయభారతే. తెలుగు అకాడమీలో డిప్యూటి డైరెక్టర్ గా పనిచేశారు. 'ప్రాచీన సాహిత్యకోశం', 'ఆధునిక సాహిత్యకోశం' సంపాదకత్వంలోనే వెలువడినవి. జ్యోతిబాపూలేని ఆంధ్రప్రదేశ్ దళిత ఉద్యమాలకు, తెలుగు సాహిత్యానికి పరిచయం చేసిన

రచయిత్రి.. 'షట్చక్రవర్తులు' అనే పుస్తక శృంకలానికి 2003వ సంవత్సరంలో కెనడాలోని 'డాక్టర్‌అంబేద్కర్ ఇంటర్నేషనల్ మిషనరీస్', ఆంధ్రప్రదేశ్రాష్ట్ర సాహిత్య అవార్డులు వచ్చినవి. బోయి విజయభారతి 1990ల నుండి విశేషంగా దళిత సాహిత్య విమర్శపై కృషిని కొనసాగించారు. విజయభారతి వ్యాసాలలో రెండు రకాల ధోరణులు కనిపిస్తాయి. ఆధునిక దళిత సాహిత్యాన్ని విశ్లేషించటం ఒక ధోరణి కాగా, ప్రాచీన సాహిత్యాన్ని దళిత, స్త్రీవాద కోణాల నుండి విశ్లేషించటం మరొక ధోరణి రచనలు: రాముని కృష్ణుని రహస్యాలు, మహాత్మ జ్యోతి బాపూలే, బాబాసాహెబ్ అంబేద్కర్. సంపాదకత్వం  అంబేద్కర్ రచనలు, అంబేద్కర్ ప్రసంగాలు, సాహిత్య కోశం (1,2 సంపుటాలు).

**విజయలక్ష్మి ఉన్నవ :** ప్రఖ్యాత తెలుగు రచయిత్రి. రచనలు పారిజాతం, తెలుగు స్వతంత్ర, యువ, భారతి, నవోదయ, రచన, అంజలి, ప్రజామత, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, పుస్తకం, అభ్యుదయ, వసుధ, ఆవలితీరం, ప్రగతి, ఇండియా టుడే, జయంతి, తరుణ తదితర పత్రికలలో ప్రచురింపబడ్డాయి. వ్రాసిన నవలలు, కథా సంపుటాలు మొత్తం 27 ఉన్నాయి. పురస్కారాలు గృహలక్ష్మి స్వర్ణకంకణము, 2006 సంవత్సరంలో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారిచే ఉత్తమ రచయిత్రి పురస్కారం, 1991 ఎనిమిదవ తానా మహాసభలలో పురస్కారం, 2006లో యద్దనపూడి సులోచనారాణి సాహిత్య అవార్డు.

**విజయలక్ష్మి అత్తలూరి :** జన్మస్థలం తెనాలి. ప్రముఖ జర్నలిస్ట్ కీ.శే.ఎ.ఎల్. నరసింహారావు కుమార్తె. కాలమిస్ట్. కథలు, వ్యాసాలు, కవితలు, నవలలు, రేడియో, రంగస్థల, దృశ్యమాధ్యమ నాటకాలు, డాక్యుమెంటరీలు, లఘుచిత్రాలు రచించారు. అన్నీ పలు పత్రికలలో ప్రచురితం, ప్రసారం అయ్యాయి. ఆకాశవాణిలో 100పైగా కథలు, 200పైగా నాటకాలు ప్రసారం అయ్యాయి. అపూర్వ, అపురూప, ఆనాటి చెలిమి ఒక కల, ఒప్పందం, ఒక కోయిల గుండె చప్పుడు, అష్టావక్ర నాయికలు-సుబ్బలక్ష్మి (హాస్య వ్యంగ్య కథలు) కథాసంపుటాలు వెలువడ్డాయి. దత్తపుత్రుడు, మహావృక్షం, నేనెవరిని, అమావాస్యతార, గూడుచెదిరిన గువ్వలు, తెల్లగులాబి, అతిథి, ఆ గదిలో, అర్చన, నటి, రాగం తీసే కోయిల, కడలి, బొమ్మ, పేరైనా అడగలేదు, శ్రీకారం, ప్రేమిస్తే ఏమవుతుంది?, ఏ పుట్టలో ఏమున్నదో, హిమజ్వాల నవలలు వెలువరించారు. యవనిక, అంతర్మథనం, మ్యాచ్ ఫిక్సింగ్ నాటక సంపుటులు రచించారు. ఉత్తరం, స్పర్శ, రంగస్థలం, హైటెక్ కాపురం, మిస్సమ్మ, అనగనగా ఓ రాజకుమారి రంగస్థల నాటకాలు ప్రదర్శింపబడ్డాయి. కాంతిరేఖ, నివేదిత, పల్లకిలో పల్లవి, అతడు-

ఆమె-అమెరికాలు టీవి ధారావాహికలు, అనేక టెలిఫిలింస్ వచ్చాయి. పత్రికలలో ఎన్నో శీర్షికలను నిర్వహించారు. యునిసెఫ్ అంతర్జాతీయ పురస్కారం, పొట్టిశ్రీరాములు తెలుగు యూనివర్సిటీ కీర్తి పురస్కారం, అమృతలత అపురూప పురస్కారం వంటి అనేక పురస్కారాలు అందుకున్నారు. "సరసిజ ఏ థియేటర్ ఫర్ వుమన్ "సంస్థను స్థాపించి నాటకరంగంలో స్త్రీలను ప్రోత్సహిస్తున్నారు. చిరునామా: ఇం.నం. 1-8-522/18, కెజికె హెవెన్స్, ఫ్లాట్ నం. 31, చిక్కడపల్లి, హైదరాబాద్-500020.

**విజయలక్ష్మి ఆలూరి. డా. :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'ఉంగుటూరు'. 1944 అక్టోబర్ 1 న 'రామకోటయ్య, వరలక్ష్మి' దంపతులకు జన్మించారు. కథకురాలు. స్త్రీలవ్యాధుల నిపుణురాలుగా కాకినాడలో వైద్య వృత్తి నిర్వహిస్తున్నారు. రచనలు: పేషెంట్ చెప్పే కథలు; జ్వలిత (కథల సంపుటి); సజీవ స్వప్నాలు (నవల). పురస్కారాలు: పొట్టిశ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయం మల్లాది సుబ్బమ్మ మహిళాభ్యుదయ పురస్కారం; ఆంధ్ర సారస్వత సమితి, కృష్ణాజిల్లా మచిలీపట్నం వారి సాహిత్య పురస్కారం; కోడూరి లీలావతీదేవి స్మారక సాహితీ పురస్కారం. 100పైగా కథలు, 4కథా సంపుటాలు, 4నవలలు పత్రికల్లో, ప్రత్యేక సంచికల్లో ప్రచురింపబడ్డాయి. పేషెంట్ చెప్పే కథలు 33వారాలు ప్రచురింపబడ్డాయి. ఆరోగ్య విజయాలు హెల్త్ కాలం పలు సంవత్సరాలు నిర్వహించారు. వైద్య విజ్ఞాన వ్యాసాలు ఎన్నో వ్రాశారు. ఆకాశవాణిలో కథలు, టి.వి.లో ఇంటర్వ్యూలు ప్రసారమయ్యాయి. ప్రపంచ బ్యాంక్ నిర్వహించిన ప్రోజెక్ట్స్ పోటీలో 5వ స్థానం పొందారు. చిరునామా: ఇం.నం. 502, వర్టెక్స్ సద్గురు కృప అపార్ట్ మెంట్స్, నిజాంపేట రోడ్, హైదరాబాద్-72. ఫోను నం: 9849022441.

**విజయలక్ష్మి కావిలిపాటి :** జన్మస్థలం విశాఖపట్నం జిల్లా, దేవరాపల్లి గ్రామం. 1933, ఫిబ్రవరి 1వ తేదీన జన్మించారు. సుప్రసిద్ధ కథా, నవలా రచయిత్రి. రచనలు పుస్తకం, జ్యోతి, ఆంధ్రజ్యోతి, కళాసాగర్, స్పందనవాణి, పల్లకి, యువ, వనితాజ్యోతి, ప్రభవ, జ్యోత్స్న, అనామిక, విజయ, నీలిమ, స్నేహ, స్వతంత్ర మొదలైన పత్రికలలో ప్రచురింపబడ్డాయి. విధివిలాసాలు నవలను 1971లో తాసిల్దారుగారి అమ్మాయి పేరుతో సినిమాగా వచ్చింది. జీవనసంధ్య, కాలచక్రం, మానసవీణ మొదలగు 26 నవలలు వ్రాశారు. కథాసంపుటాలు అతిథి, మరమనిషి, అతిథి, నేపాలీ అమ్మాయి, సూరిగాడి మొక్క మొదలైన 56 కథలు కూడా రచించారు.

**విజయలక్ష్మి కురుమద్దాలి :** జన్మస్థలం విజయవాడ. 1940, అక్టోబర్ 16లో జన్మించారు. ప్రముఖ నవలా, కథా రచయిత్రి. అనేక నాటికలు ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. రచనలు ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, ప్రగతి, చక్రవర్తి, యువ, అనామిక, జయశ్రీ, వనితాజ్యోతి, స్రవంతి, అపరాధ పరిశోధన, స్వాతి, చతుర, కదలి, వనిత తదితర పత్రికలలో ప్రచురింపబడ్డాయి. రచనలు 'లవ్ మర్డర్స్, అగాధాల అంచులలో, నీలికన్నుల నీడల్లో, అసిధార, క్షణం క్షణం, హత్య' మొదలైన 36నవలలు; 'అంతిమ రహస్యం, పుట్టిన బుద్ధి, ప్రశ్నలు మూడే, ప్రేమ పగ ఈర్ష్య, సూడిదలు, సోడాబుడ్డి కళ్ళద్దాలు, స్థలపురాణం, హంతకులు ఆగంతకులు' మొదలైన 31 కథలు రచించారు.

**విజయలక్ష్మి కోకా(కోవిల) :** సంఘ సేవకురాలు, రచయిత్రి. విశిష్ట మహిళ, స్వర్ణ భారతికి స్వర్ణ మహిళ బిరుదులు పొందారు. గుర్తింపుగా ఇప్పటివరకు ప్రముఖ సంస్థలు, ప్రముఖ వ్యక్తులచే 20 పైనే పురస్కారాలతో గౌరవింపబడ్డారు. చిరునామా: రోడ్.నం.7, డోర్ నం. 3-251, ఆదర్శ నగర్, పాత డైరీ ఫారం, విశాఖపట్నం-40.

**విజయలక్ష్మి కోగంటి :** జన్మస్థలం కృష్ణాజిల్లా "గుడివాడ" పట్టణం. 29.7.1946న జన్మించారు. ప్రముఖ నవలా, సీరియల్ రచయిత్రి. 40 ఏళ్లకు పైగా సాహితీవ్యాసంగాన్ని కొనసాగించి ఎన్నో నవలలు వ్రాశారు. ఆయుర్వేద వైద్యురాలు. వివాహం చేసుకోలేదు. "సమస్య వచ్చినపుడు బెంబేలు పడకుండా, ముఖ్యంగా స్త్రీలు తమ సమస్యలకు తామే పరిష్కారం వెతుక్కుని, దానిని ఆచరణలోపెట్టుకుని, విజయం సాధించాలి. ధైర్యం, సమయస్ఫూర్తి విజయాన్ని అందిస్తాయి" అనే సందేశాన్ని అందిస్తూ రచనలు చేశారు. చక్రబంధం, చక్రతీర్థం, చక్రవ్యూహం, నన్ను ప్రేమించకు, జీవన యాగం, మచ్చలేని జాబిలి, యోగి, వెన్నెల్లో అగ్ని, నయనతార, అమ్మ తల్లి, నేస్తమా! నన్నందుకో!, నిక్షిప్త, పాంచజన్యం, పంచామృతం, మన్నించు ప్రియా! మొదలైన నవలలు, జ్వలిత నా కవిత, నిక్షిప్త, అన్వేషణ, నయనాంజలి, సుర పుష్పధార, వెన్నెల్లో అగ్ని, విజేత. వగైరా కథలు వ్రాశారు.సత్కారాలు 1997లో విశాఖ, దాసరి కల్చరల్ ట్రస్ట్ వారిచే "విశాఖ రత్న" అవార్డ్ విజయవాడ, వి.ఆర్.నార్ల పురస్కారం, యునెస్కోఅవార్డ్, ఆప్కోఅవార్డ్ వచ్చాయి. తన 70వ యేట కృష్ణాజిల్లా గుడివాడలో 2016, మార్చి 10వ తేదీ గురువారం రాత్రి గుండెపోటుతో మరణించారు.

**విజయలక్ష్మి తుంగల :** బాల సాహిత్యం పై సిద్ధాంత వ్యాసం సమర్పించి, ఎం.ఫిల్. పట్టాపొందారు. ప్రస్తుతం పి. హెచ్.డి. చేస్తున్నారు.

**విజయలక్ష్మి పాటిబండ్ల :** ప్రఖ్యాత తెలుగు నవలా రచయిత్రి. జన్మస్థలం కృష్ణాజిల్లా, "వీరులపాడు" గ్రామం. 1952 లో జన్మించారు. ప్రఖ్యాత తెలుగు నవలా రచయిత్రి."ప్రేమ కిరీటం" నవల అదే పేరుతో సినిమాగా వెలువడింది. నవలలు: ప్రేమానందలహరి, ప్రేమకిరీటం(ఈ నవల అదే పేరుతో సినిమాగా వెలువడింది). వ్రాసిన కథలు : "వనిత, యువ, ఆంధ్రప్రభ, చతుర" మొదలైన పత్రికలలో ప్రచురింపబడ్డాయి. కథలు తెలిసిచేసిన పాపం, మల్లిమనసు, మాకు పెళ్లయింది, మానవత మరణించింది, రక్త సింధూరం, సంధ్య.

**విజయలక్ష్మి పొత్తూరి :** ఈవిడ హాస్య కథలకు, నవలలకూ ప్రసిద్ధురాలు. జన్మస్థలం గుంటూరు జిల్లా యాజలి గ్రామం. జూలై 18, 1953న జన్మించారు. ప్రముఖ కథా రచయిత్రి. వల్లూరి సత్యవాణి, వెంకటకృష్ణమూర్తి తల్లిదండ్రులు.

**విజయలక్ష్మి యర్రమిల్లి :** జన్మస్థలం తణుకు. జననం 30.12.1941. ఆంధ్రాబ్యాంకు ఆఫీసరుగా చేశారు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, బహుగ్రంథకర్త శ్రీ యర్రమిల్లి నరసింహారావుగారి కుమార్తె. 11 నవలలు, 2 కథా సంకలనాలు, 4 పిల్లల పుస్తకాలు ప్రచురించబడ్డాయి. గత 4 దశాబ్దాలుగా వివిధ పత్రికలలో కథలు, కవితలు, నవలలు, వ్యాసాలు ప్రచురింపబడుతున్నాయి. ఆకాశవాణిలో కథలు, నాటికలు, రూపకాలు, ఈమాసపు పాటలు ప్రసారం చెయ్యబడ్డాయి. వాటిలో నూరేళ్లపంట, వృక్షం శరణం గచ్ఛామి, శౌర్య సామ్రాజ్యలక్ష్మి, ఇంక్విలాబ్ జిందాబాద్ లు బహుమతి పొందాయి. కథలలో కొన్ని హిందీ, కన్నడ, ఆంగ్ల భాషలలోకి అనువదించబడ్డాయి. ఆం. ప్ర. ప్రభుత్వము, అనేక సాహితీ సంస్థలనుంచి గౌరవ పురస్కారాలు పొందారు. చిరునామా. శ్రీసాయి హర్షిత జి.ఎఫ్.3, సజ్జాపురం, తణుకు-534211. ఫోన్. 9492007836.

**విజయలక్ష్మి వాడపల్లి :** రాయసం సుబ్బారాయుడుగారి కుమార్తె. భర్త వాడవల్లి సన్యాసిరాజు. బందరులో గృహిణిగా నివసిస్తున్నారు. డిగ్రీ దాకా చదివారు. ఆధునికత పట్ల ఆసక్తి, ఆధ్యాత్మికానురక్తి, సంప్రదాయంపట్ల గౌరవం వీరిని రచయిత్రిని చేశాయి. కథలు, నవలలు రచించారు. రచనలు జీవన హేల(కథా సంకలనం), అమృత వాహిని(నవల), అచ్యుతుని అమరగానం (ఆధ్యాత్మిక గ్రంథం), మంచు పూలు(కవితా సంకలనం), శాంతిలోకం(కథా సంపుటి), తమసో మా జ్యోతిర్గమయ (వ్యాస సంపుటి). ఆకాశవాణిలో ప్రసంగాలు చేశారు.

**విజయలక్ష్మి(పున్న) వెంకటేష్ :** తెలుగు పండితురాలు, కవయిత్రి. కలం: భాస్కర విపంచి. పలు సంకలనాలలో కవితలు ప్రచురింపబడ్డాయి. సరూర్నగర్ .

11-6-362/A రంగారెడ్డి జిల్లా హైదరాబాద్ తెలంగాణ (రాష్ట్రం), ఫోను నం. 9491875276

**విజయలక్ష్మి, అత్తలూరి :** జన్మస్థలం తెనాలి. కీ.శే. ఏ.ఎల్. నరసింహారావు, ప్రముఖ జర్నలిస్ట్. శ్రీమతి అత్తలూరి అనసూయ దంపతులకు జన్మించారు. ప్రముఖ తెలుగు రచయిత్రి. అనేక కథలు, నవలలు, నాటికలు వ్రాశారు. పబ్లిక్ రిలేషన్స్ డిగ్రీ చదవి, ప్రస్తుతం హైదరాబాద్ మెట్రోపాలిటన్ వాటర్స్‌పై సీవరేజ్బోర్డులో సీనియర్ మేనేజర్గా ఉద్యోగబాధ్యతలు నిర్వహిస్తున్నారు. సరసిజ అనే పేరుతో ఒక సాహిత్య సంస్థను నెలకొల్పారు. 1975 లో ఆకాశవాణి, హైదరాబాద్ కేంద్రానికి చందమామ అనే స్కెచ్ ద్వారా తొలి అడుగు వేశారు. 1984 వరకూ అనేక కథలు: శకునాలు, ఆడపిల్ల, పయనం, పరిష్కారం, వానపాము కాటేసింది, సౌదామిని, ఇదీ జీవితం సుమారు వంద పైన ప్రసారం అయాయి. సుమారు రెండువందల పైన నాటకాలు ఆకాశవాణి, హైదరాబాద్ కేంద్రం ద్వారా ప్రసారం అయ్యాయి. యవనిక, అంతర్మథనం, మ్యాచ్ ఫిక్సింగ్ (నాటకాల సంపుటిలు). రంగస్థల నాటక రచయిత్రిగా 'సరసిజ' వుమెన్ థియేటర్‌ను 2013లో స్థాపించారు. ఉత్తరం, స్పర్శ , అంతర్మథనం, మ్యాచ్ ఫిక్సింగ్, రంగస్థలం, మేమూ మనుషులమే, హైటెక్ కాపురం, మిస్సమ్మ. టివీ సీరియల్: కాంతి రేఖ, నివేదిత, పల్లకిలో పల్లవి. ఇంకా టెలి ఫిలిమ్స్ 11; కథాసంపుటాలు 4 ; నవలలు 6; నాటికల సంపుటులు 3 రచించారు. నార్ల వెంకటేశ్వరరావు పురస్కారం, విశిష్టమహిళ పురస్కారం, ఉత్తర టెక్సాస్ తెలుగు సంఘం (టాంటెక్స్) సాహిత్య వేదిక వారి సన్మానం, యునిసెఫ్ అంతర్జాతీయ పురస్కారం, ఆకాశవాణి నాటకానికి కేంద్ర ప్రభుత్వ పురస్కారం, పొట్టి శ్రీరాములు తెలుగు యూనివర్సిటీ కీర్తి పురస్కారం మొదలైన 14 పురస్కారాలు అందుకున్నారు.

**విజయలక్ష్మి. దీవి.** 23.10. 1966న కృష్ణా జిల్లాలో జన్మించారు. హైదరాబాద్ వాస్తవ్యులు. వెస్టర్న్ ఏసియన్ ఆన్లైన్ మాగజైన్ కు బాలసాహిత్య,కథ రచనలు చేస్తున్నారు. ఫ్రీలాన్సర్. వైఖానస ప్రభలో చిన్న కథలు ప్రచురితం.

**విజయలక్ష్మి.కె.డా. :** యువసాహితీ ఉపాధ్యక్షురాలు, ప్రొద్దుటూరు. 4.8.1975 న జననం. రాయలసీమ కడప ప్రాంతీయత పరిశోధనాంశంగా పి.హెచ్.డి. చేశారు. రాయలసీమ తెలుగు గ్రంథం ప్రచురించారు. దామోదరం సంజీవయ్య, తూమాటి దోణప్ప బంగారు పతకాలు పొందారు. పలు సదస్సులలో పత్ర సమర్పణలు. వ్యాస రచయిత్రి. చిరునామా: తెలుగు అధ్యాపకురాలు, వి ఆర్ ఎస్ డిగ్రీ కళాశాల, వీరపునాయుని పల్లె-516321., కడప జిల్లా, ఆం.ప్ర. ఫోను నం. 9441325908.

**విజయలక్ష్మి.జి. (కోసూరి) :** జర్నలిస్టు, రచయిత్రి, నృత్యకళాకారిణి. వివిధ పత్రికలు, సంకలనాల్లో 400 కవితలు, 60 కథలు, 200 వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. కథాసంకలనం చీకట్లో వేగుచుక్క కు సినారె అవార్డును అక్కినేని చేతులమీదుగా అందుకున్నారు. రేడియోలో రచనలు, టి.వీ.చానళ్లలో డిబేట్లు ప్రసారం. కవితా శిరోమణి బిరుదాంకితులు. చిత్తరువు కవితా సంపుటి, ఎల్లమ్మ కథల సంపుటికి సంపాదకులు. కవిత్వం దళిత సాహిత్యంలో రచయిత్రులు అనే డాక్యుమెంటరీలో రికార్డు చేయబడింది. చిరునామా: ఇం.నం. 4-227, కొత్తపేట, నూజివీడు-521201. ఫోను నం: 9703564878.

**విజయలక్ష్మి పండిట్ పలవలి డా. :** జన్మస్థలం చిత్తూరు జిల్లా కలిచెర్ల. కలంపేరు విశ్వపుత్రిక. రిటైర్డ్ ప్రొఫెసర్, డా.బి.ఆర్.అంబేద్కర్ యూనివర్సిటీ. ధరిత్రి విలాపం, విశ్వపుత్రికను నేను-విశ్వశాంతి నా ఆకాంక్ష దీర్ఘ కవితలు, 5కవితా సంపుటాలు, మానవత్వమా ఏదీ నీ చిరునామా, ఆకాశంలో అర్ధభాగం, నా ఆత్మకళలు, ఏకత్వ జ్ఞానం, నా అక్షరాలు, విశ్వపుత్రిక హైకూలు వెలువరించారు. విజ్డం ఆఫ్ వన్ నెస్ అనువాదము, టాగూర్ గీతాంజలికి తెలుగు అనువాదము అపూర్వగానం, విశ్వపుత్రిక కథల సంపుటి ప్రచురింపబడ్డాయి. గిడుగు రామ్మూర్తి భాషా సాహిత్య పురస్కారం, అనంత సాహిత్య అకాడమీ అవార్డు, సాహిత్య గౌరవ్, కాఫ్లా ఇంటర్నేషనల్ అవార్డు, కవితాకోకిల, సాహిత్యశ్రీ వంటి అనేక బిరుదులు పొందారు. హిందీ, ఇంగ్లీష్, కన్నడ, మళయాళ భాషలలోకి వీరి రచనలు అనువదింపబడ్డాయి. చిరునామా:ఇం.నం .3-6-361/ఎ, ఆయిల్ సీడ్ కాలనీ, హిమాయత్ నగర్, స్ట్రీట్ నం.26, హైదరాబాద్-29. ఫోన్. 8639061472.

**విజయలలిత టేకుమళ్ళ :** ఉపాధ్యాయిని. 300 పైచిలుకు కవితలు, 70 కు పైగా కథలు, 40 కు పైగా బాలగేయాలు, 25కు పైగా నాటికలు (బాలలకు) రచించారు. పత్రికలలో కవితలు ప్రచురింపబడ్డాయి, రేడియోలో ప్రసార మయ్యాయి. రావిశాస్త్రి కథానికల పోటీలో బహుమతి పొందారు. చిరునామా: మండల పరిషత్ ప్రాథమిక పాఠశాల, పూసపాటిరేగ, విజయనగరం-535204 ఫోను నం: 8500099051.

**విజయశ్రీ గురజాడ :** జన్మస్థలం కృష్ణాజిల్లా, నూజివీడు మండలం, 'జంగంగూడెం' గ్రామం. 'ధనికొండ సూర్యకాంతి, రామలింగేశ్వరరావు' దంపతులకు 1949 ఫిబ్రవరి 22 న జన్మించారు. వచన కవయిత్రి.బందరులో హిందీ ఉపాధ్యాయు రాలు. 'కొత్త వరవళ్ళు, తొలకరి, మనసు'(3 కవితా సంపుటాలు) రచించారు. అవార్డులు: కథల పోటీల్లో ఉత్తమ రచయిత్రి అవార్డు 2 సార్లు; సంఘమిత్ర

కల్చరల్ సొసైటీ వారిచే 'విశిష్ఠ సేవామిత్ర' అవార్డు; సెవెన్ హిల్స్ మెగా అవార్డ్ పొందారు.

**విజయశ్రీ దుర్గ. వి :** 11.04.1974న జననం. విజయవాడలో నివాసం. శ్రీ లలితా కళాస్రవంతి కి కార్యదర్శిగా, విజయా వాకర్స్ క్లబ్బుకి అధ్యక్షులు. కవయిత్రి. సాయి నీవు సత్యం అనే పుస్తకం రచించారు. చిరునామా: ఇంటి నెం:26-12-13, శ్రీ గాయత్రి నిలయంబొడ్డపాటివారి వీధి, గాంధి నగర్, విజయవాడ- 520003.

**విజయశ్రీ పోగుల:** బపట్లలో జన్మించారు. గుంటూరులో నివాసం. పూలగుత్తులు (నానీలు), ఉదయరాగాలు(రెక్కలు), విజయాక్షరాలు(కవితలు) ముద్రించారు. కథాసంపుటి సిద్దంగా ఉంది. 20సం.గా రేడియో ఆర్టిస్ట్ గా ఉన్నారు. కళాభారతి బిరుదు, తెలుగు యూనివర్సిటీ ధర్మనిధి పురస్కారం, తెలుగు బుక్ ఆఫ్ రికార్డ్స్ జీవన సాఫల్య పురస్కారం మొ.పొందారు.

**విద్యావతి ఎ. డా. :** బందరు వాస్తవ్యురాలు. ఎం.ఎ.; పి.హెచ్.డి. చేశారు. 'జీవన సాఫల్యము(కథల సంపుటి), అనుపమ(నవల), కావ్యసుధ(ఖండకావ్యం), తాళ్ళపాక కవుల సాహిత్య సేవ (సిద్ధాంత వ్యాసం), సూక్తిసుధ(పద్యకావ్యం). రచించారు.

**విద్యావతి గుడిపల్లి.** అనంతపురం జిల్లా రచయితల సంఘం మహిళా ప్రతినిధి.వృత్తి: అసిస్టెంట్ డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్. 42 కవితలు అనేక కవిసమ్మేళనాలలో వినిపించి సత్కారం పొందారు.చిరునామా. ఇం.నం.28-980, సంగమేష్ నగర్, అనంతపురం-515001.

**విద్యేశ్వరి (సౌభాగ్య) దంటు :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'విజయవాడ'. 1944 ఏప్రిల్ 15న 'శ్రీరాజ్యలక్ష్మి డి.వి.శాస్త్రి' దంపతులకు జన్మించారు. పరిశోధకురాలు, గ్రంథకర్త్రి. ఫ్రెంచ్, తెలుగు అధ్యాపకులుగా పనిచేశారు. రచనలు: ఆంధ్రమహాభారతం ధర్మతత్త్వం; మహాభారతం మానవధర్మం; తెలుగునవల మనోవిశ్లేషణ; భారతీయ భాషల్లో నవలా ప్రక్రియ. పురస్కారాలు మాతృభాషాదినోత్సవ సత్కారం; నవ్య సాహితివారి, లతాసంస్మరణ సత్కారం; శారదా ఫైన్ ఆర్ట్స్ అకాడమీ & రోటరీ క్లబ్(బాపట్ల) వారి సత్కారం.

**విన్నకోట సుశీలాదేవి :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'మచిలీపట్నం. 1950లో జన్మించారు. నాదెళ్ళ పురుషోత్తమ శాస్త్రిగారి నాటకాలపై పరిశోధనా గ్రంథం రచించి, డాక్టరేట్ పట్టా పొందారు. హిందూ కళాశాలలో పనిచేశారు. అసంఖ్యాకంగా కథలు రచించారు. విన్నకోట సుబ్బారాయుడు గారి కుమార్తె.

**విమలకుమారి కోకా :** జన్మస్థలం కృష్ణాజిల్లా దివితాలూకా లోని 'పులిగడ్డ' గ్రామం. 1943 జులై 15 న శ్రీమతి ఆదిశేషమ్మ, సుబ్బారావు దంపతులకు జన్మించారు. పరిశోధకురాలు, రూపక, పద్యకావ్య కర్త్రి. ఎం.ఏ.(తెలుగు); ఎం.పి.ఇడి. అభ్యసించారు. 23 సం.లు విజయవాడలో నివాసం. గుంటూరు ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాలలో వ్యాయామ అధ్యాపకురాలిగా పనిచేసి, పదవీ విరమణ చేశారు. "అక్షర సందేశం, అరుణిమ కోసం, నిశ్శబ్ద వేదన" అనే కవితా సంపుటాలు, "తరుణీ తరంగాలు (రేడియో వ్యాసాలు); పున్నమి నవ్వింది(కథల సంపుటి); తెలుగుతల్లి తెలుగుభాషా సంస్కృతులపై నృత్య రూపకం'; అయ్యప్ప గీతాలు, షిర్డీ సాయి పాటలు, రాగలత(నవల), జిమ్నాస్టిక్స్ లో మెళకువలు, విమలభారతి (వ్యాసాలు), మనపుణ్య క్షేత్రాలు వ్రాశారు.

**విశాలాక్షమ్మ కల్లూరి :** చంద్రమతీ చరిత్రము,దమయంతీ చరిత్రము, భారత కథామృతము రచించారు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి కుమార్తె.

**విశాలాక్షమ్మ కల్లూరి :** జన్మస్థలం నడిపూడి గ్రామం. ప్రముఖ కవి శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి జ్యేష్టపుత్రిక. 12వ, 13వ సం. నుంచే పద్యములు అల్లడం వచ్చింది. శతకాలు: గోపాల శతకము తరువాత ప్రభాకర శతకము, పద్యకావ్యాలు: చంద్రమతీ చరిత్రము, దమయంతీ చరిత్రము, వెలువరించారు. భారత కథామృతము అనే కావ్యం జయంతి రామయ్య, ఆదిభట్ల నారాయణదాసు వంటి పండితుల ప్రశంసలను అందుకుంది. తరువాత భాగవత కథామృతము, శ్రీరామ కథామృతము రచించారు. ఇంకా అనేక వచన, పద్య గ్రంథాలను 30కి పైగా వెలువరించారు. 1973 ఫిబ్రవరిలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు సన్మానించారు. ముక్త్యాలరాణి ఆదేశంతో శ్రీ రాజ్యలక్ష్మీ పరిణయము అనే గ్రంథాన్ని రచించి సత్కరింపబడ్డారు. గుడివాడ భారతీసమితివారు "విదుషీమణి" బిరుదుతో సత్కరించారు. విజయవాడ త్రిలింగ మహాపీఠంవారు "కవయిత్రీమణి" అనే బిరుదును ప్రదానం చేసారు.

**విశాలాక్షి దామరాజు :** ఉపాధ్యాయిని, సహృదయ సాహితీ ఉపాధ్యక్షులు. పత్రికలలో కథలు, కవితలు, నాటికలు ప్రచురింపబడ్డాయి. ఆకాశవాణిలో కథలు, కవితలు, పుస్తక సమీక్షలు ప్రసారమయ్యాయి. బాలకడలి పుస్తకం ఆవిష్కరించారు. స్మృతి ఇరాన్ ప్రశంసా పత్రం, గురజాడ సేవారత్న అవార్డు మొ.పొందారు.

**విశాలాక్షి ద్వివేదుల :** జన్మస్థలం విజయనగరం. 1929, ఆగస్టు 15న జన్మించారు. కథా, నవలా రచయిత్రి. విద్యాభ్యాసం అక్కడే కొనసాగింది. తెలుగుతోపాటు ఇంగ్లీష్, హిందీ భాషల్లో పరిజ్ఞానం కలిగిన విశాలాక్షి అనేక కథలు, కవితలు,

వ్యాసాలు, రేడియో నాటికలు రచించారు. 1960వ దశకంలో రచించిన "వారధి" నవల రెండు కుటుంబాల కథగా వెండితెరకెక్కింది. 1974లో విడుదలైన వస్తాడే మా బావ చిత్రానికి మాటలు రాసి సినీరంగంతోనూ అనుబంధాన్ని కొనసాగించారు. నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా 'వారధి' నవలను 1973లో పలు భారతీయ భాషలలోకి అనువదించి ప్రచురించారు. తన పుస్తకాల హక్కులను విశాఖపట్నంలోని ద్వారకానగర్ పౌరగ్రంథాలయానికి వ్రాసిచ్చారు. ఆంధ్ర, వేంకటేశ్వర విశ్వవిద్యాలయాల్లో పలువురు విద్యార్థులు రచనలపై పరిశోధనలు జరిపి ఎంఫిల్, పీహెచ్డీలు పొందారు. 13 నవలలు, 3 కథా సంపుటాలను అందించారు. విశాలాక్షి నవంబరు 7, 2014 శుక్రవారం మధ్యాహ్నం విశాఖపట్టణంలోతన 85వ యేట మరణించారు. పురస్కారాలు : గృహలక్ష్మి స్వర్ణకంకణం 1966, కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు 1982, అడవిబాపిరాజు అవార్డు 1997, తెలుగు విశ్వవిద్యాలయం నుంచి డి.లిట్ పట్టా 1998, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ జ్యేష్ట సాహితీ అవార్డు, ఢిల్లీ తెలుగు అకాడమీ సాహిత్య పురస్కారం పొందారు.

**విశాలాక్షి వట్టికొండ :** జన్మస్థలం గుంటూరుజిల్లా 'చేబ్రోలు'. 1920 జూన్ లో జన్మించారు. హిందీ, తెలుగు, సంస్కృత భాషలు అభ్యసించారు. నలభయ్యవ దశకంలో చైతన్యవంతమైన రచనలు చేసి, ప్రసిద్ధి పొందారు. 1936 నుంచీ గేయరచన ప్రారంభించారు. సుదీర్ఘ కవిత "భారతనారి" 'భారతి'లో ప్రచురితమై, ఉత్తమ రచయిత్రిగా పేరు పొందినది. "నిష్కామయోగి, స్వాతంత్ర్య పోరాటంలో స్త్రీల పాత్ర' అనే గ్రంథాలు రచించారు. 'వట్టికొండ విశాలాక్షి కల్చరల్ ట్రస్టు పురస్కారం' ఏర్పాటు చేసి ప్రతి సంవత్సరం ఉత్తమ రచయిత్రులకు పురస్కారం అందజేస్తున్నారు. 1946 లో మద్రాసు వెళ్ళి, అక్కడ నుంచి కూడా కథలు, కథానికలు, నవలలు రచించి, పత్రికలలో ప్రచురించారు. మద్రాసు రేడియో కేంద్రంలో పనిచేసి, 'రేడియో అక్కయ్య'గా పేరు పొందారు. 1964లో గుంటూరు చేరి, విజయవాడ ఆకాశవాణిలో 'సాహిత్య నందిని' కార్యక్రమాలు నిర్వహించారు. "స్వాతంత్రానికి పూర్వం తెలుగు కవయిత్రులు" అన్న వ్యాసంలో కాత్యాయనీ విద్మహే, కందాల శోభారాణిలు, విశాలాక్షి గురించి "అభ్యుదయ సాహిత్య ఉద్యమంతో ముడిపడి తన కవితా శక్తిని వికసింప చేసుకున్న స్త్రీ వట్టికొండ విశాలాక్షి" అని వ్రాశారు. ఒకవైపు అంతర్జాతీయ కమ్యూనిస్టు తాత్వికత, మరొకవైపు దేశీయ స్వాతంత్ర్య ఆకాంక్ష రెండు కవిత్వంలో పెనవేసుకొని ఆవిష్కరించబడ్డాయి. రచనలు: భారతనారి (దీర్ఘ కవిత); యుగధర్మం, ఖైదీ, తపోభంగం, ఆత్మబలి, నిష్కామయోగి(నవలలు); అభ్యుదయగీతాలు.

**విశ్వసుందరమ్మ తల్లాప్రగడ :** జన్మస్థలం పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం తాలూకా ఉండి గ్రామం. 1899, మార్చి 6 వ తేదీన మల్లవరపు శ్రీరాములు, సీతమ్మ దంపతులకు జన్మించారు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధురాలు, తెలుగు రచయిత్రి. పండితులైన తండ్రిగారి వద్దనే ఉండి ఉభయ భాషా ప్రవీణ, సాహిత్య శిరోమణి పరీక్షలకు చదివారు. 16 సంవత్సరాల వయసులో భర్త దగ్గరకు కాకినాడ వచ్చారు. రచనారంగం 1920 -1949 మధ్యకాలంలో రాసిన 125 పద్యాలను, మరణానంతరం 1973లో సోదరులు "కవితా కదంబం" అనే పేరిట ఒక సంపుటిగా ప్రచురించారు. అభ్యుదయ దృక్పథం ఉన్న కవయిత్రి. మంచి వక్తగా పేరుపొందారు. "వైతాళికులు" సంకలనంలో కవితలు చోటుచేసుకున్నాయి. 1949, ఆగష్టు 30 తేదీన స్వర్గస్తులయ్యారు.

**వీరలక్ష్మి తాడేపల్లి డా. :** తెలుగు ఉపాధ్యాయిని. ప.గో.జిల్లా, తణుకు. తెలుగు, సంస్కృత, గణిత, భగవద్గీతలలో అష్టావధానాలు, నాటకాలు విద్యార్థులకు నేర్పి ప్రదర్శింపజేస్తున్నారు. అనేక సాహితీ సదస్సులలో పత్రసమర్పణలు చేశారు. దూరదర్శన్, రేడియోలలో రూపకాలు ప్రసారమయ్యాయి. శ్రీమదాంధ్ర మహాభాగవతం-మాతృహృదయం అంశంపై పరిశోధన చేశారు. సాహితిశ్రీ పురస్కారం పొందారు. చిరునామా: ఫ్లాట్ నం.104, సంస్కృతి హైట్స్, ఎ పి టవర్స్ పక్కన, ఎస్ ఎస్ సి బోస్ రోడ్, తణుకు-534211. ఫోన్.9440064719

**వీరలక్ష్మి సదాశివరావు'** దంపతులకు జన్మించారు. డ్రగ్స్ కంట్రోల్ డిపార్ట్మెంట్లో సీనియర్ అసిస్టెంట్గా పనిచేసి, రిటైరయ్యారు. రచనలు మృదంగ నాదం(నవల); పడమటి సంధ్యారాగం; జ్ఞాన నేత్రాలు. పురస్కారాలు ఉత్తమ ఉద్యోగినిగా స్టేట్ అవార్డ్; ఆంధ్ర వనితా మండలి, న్యూఢిల్లీ వారిచే ఉత్తమమహిళా పురస్కారం; ఏ.పి. ఫైనాన్స్ కార్పొరేషన్ (వికలాంగ శాఖ) వారిచే హెలన్ కెల్లర్ పురస్కారాలు అందుకున్నారు.

**వీరలక్ష్మీదేవి వాడ్రేవు :** జన్మస్థలం విశాఖపట్టణం జిల్లా, కొయ్యూరు మండలం, తోటలూరు గిరిజన గ్రామం. 1954న జన్మించారు. పోస్టు గ్రాడ్యుయేట్ చేశారు. ప్రముఖ తెలుగు కవయిత్రి, రచయిత్రి, కాలమిస్టు. ఆ ప్రాంతంలో మొదటి తెలుగు లెక్చరర్, మొదటి మహిళారచయిత. రోడ్డూ, కరెంటూ, హైస్కూలూ, కాలేజీ, రేడియో, వార్తాపత్రికా లేని ప్రాంతంనుంచి విద్యావంతురాలిగా, భావుకురాలిగా, జీవిత దార్శనికురాలిగా మారడానికి ఎంతో కృషిచేసారు. గొప్ప కథకురాలు. "ఉత్సవసౌరభం" "కొండఫలం" కథాసంపుటాలు వ్రాసారు. స్త్రీ సమస్యలకి పరిష్కారం ఆర్థికస్వాతంత్ర్యంతో ఆగదనీ, అక్కణ్ణుంచి మరొక కొత్త

ప్రయాణం, పోరాటం మొదలవుతాయనీ గత ముప్ఫై యేళ్లుగా తన కథలలో తెలియజేసారు. రచనలు 24 కారెట్ కథ (1983), ఆకులో ఆకునై, సత్యాన్వేషి చలం, కొండఫలం, మా ఊళ్ళో కురిసిన వాన, వెల్లువ. పురస్కారాలు: సుశీలానారాయణరెడ్డి సాహితీ అవార్డు.

**వెంకట దుర్గ నాగ సత్య బాలభాను ఆకెళ్ళ :** ప్రథమ మహిళా ద్విశతావధాని. శతావధాన శమంతకమణి, ప్రథమ మహిళా శతావధాని, వనితా తిలక, అవధాన సరస్వతి, అవధాన భారతి బిరుదాంకితులు. 6.5.1981న ప.గో.జిల్లా.కొవ్వూరు మండలం,తోగుమ్మిలో జననం. ఎం.ఎ.సంస్కృతం,ఆచార్య సంస్కృతం. 100అష్టావధానాలు,3శతావధానాలు,1 ద్విశతావధానం చేశారు. వండర్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్ లో స్థానం పొందారు. చిరునామా. సంస్కృతోపన్యాసకులు, ఆదిత్య జూనియర్ కళాశాల,అమలాపురం. ఫోన్. 9491174258.

**వెంకట రమణమ్మ దుల్ల :** జన్మస్థలం తెనాలి. 1900 అగష్టులో జన్మించారు. నివాసం బందరు. కథారచయిత్రి, వ్యాస కర్త్రి. గుడిపాటి వెంకట చలంగారి పెద్ద చెల్లెలు. లలితకళలలో ప్రవేశం ఉంది. అనేక అంశాలలో రచనలు చేశారు. 1938 ఏప్రిల్ 20న పరమపదించారు.

**వెంకట లక్ష్మి ఆకొండి (ముద్దు) :** జన్మస్థలం విజయనగరం. బెంగళూరులో నివాసం. విశ్రాంత అధ్యాపకురాలు. సంకలనాలు, వాట్స్ ఆప్ గ్రూపులలో 200 వచన కవితలు ముద్రితం. గురజాడ సాహిత్యంపై పత్ర సమర్పణ, సావనీర్లలో వ్యాసాలు. ఢిల్లీ లోని దక్షిణభారత నటసమాఖ్య సభ్యులు.చిరునామా: 301, Vinayaka Enclave, Plot #45 , 36 main, Dollars scheme, BTM Layout, stage 1, Bengaluru, 560068.

**వెంకట సీతమ్మ :** జన్మస్థలం కృష్ణాజిల్లా, మండవల్లి మండలం, 'అయ్యవారిరుద్రవరం' గ్రామం. శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకట రాఘవాచార్యులవారి సతీమణి. శ్రీమత్ తిరుమల పెద్దింటి జీవితచరిత్ర రచయిత్రి.

**వెంకట సుబ్బమ్మ రావూరు:** కర్పూర మంజరి, హర్షచరిత్రలను ఆంధ్రీకరించారు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి మేనకోడలు: పంతులుగారి స్వీయచరిత్రలో ఈమె ప్రస్తావన ఉంది.

**వెంకట సుబ్బలక్ష్మి ఆకెళ్ల :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'గుడివాడ'. 23.3.1952లో 'వెంకట సింహ రాఘవేంద్రరావు, మహాలక్ష్మి' దంపతులకు జన్మించారు. బాల సాహిత్య నిర్మాత. బి.ఎ., బి.ఇడి. చేశారు. బాలల కోసం ఎన్నో రచనలు

చేశారు. వీరు 2 బాలకథా సంపుటాలు, 3 సచిత్ర బాలకథా పుస్తకాలు' ప్రచురించారు. 'బాలమందారం, బాల కుటీరం సంపుటాలకు విశ్వసాహితీవారి ఉత్తమ బాలల కథా సంపుటి అవార్డులు లభించాయి. వీరికథలు బాలలలో చైతన్యం, విజ్ఞానం కల్గిస్తాయి. వీరి 'బాలమందారం' కథల సంపుటి Red Roses అనే పేరుతో ఆంగ్లంలోకి అనువదించబడింది. ఇప్పటి వరకు సుమారు 200 రచనలు ప్రచురిచారు.

**వెంకట సుబ్బలక్ష్మి శివరాజు :** వీరు, సెప్టెంబరు 17, 1925 న "ద్రోణంరాజు సూర్యప్రకాశరావు, సత్యవతి" దంపతులకు జన్మించారు. ప్రముఖ రచయిత్రి, చిత్రకారిణి. తండ్రి వద్ద కావ్యాలు చదువుకున్నారు. తమ పన్నెండవ యేట ప్రముఖ కవి, రచయిత బుచ్చిబాబు (శివరావు వెంకట సుబ్బారావు)తో వివాహమయింది. వీరు "విజయవాడ, పున్నమ్మతోట"లో చాలాకాలం ఉన్నారు. సుబ్బలక్ష్మిగారు తమ్ముని కొడుకును పెంచుకున్నారు. ప్రస్తుతం బెంగుళూరులో ఉంటున్నారు. "తన రచనలకీ, చిత్రలేఖనకీ భర్త బుచ్చిబాబు స్ఫూర్తినిచ్చారు" అన్నారు. కథలు అనేక సంకలనాలలో వెలువడ్డాయి. నవలలు: అదృష్ట రేఖ, నీలం గేటు అయ్యగారు, తీర్పు (తరుణ పత్రికలో సీరియలుగా ప్రచురితం). కథా సంకలనాలు: కావ్యసుందరి కథ, ఒడ్డుకు చేరిన కెరటం, మనోవ్యాధికి మందుంది, మగతజీవి చివరిచూపు, శివరాజు సుబ్బలక్ష్మి కథలు. పురస్కారాలు గృహలక్ష్మి స్వర్ణకంకణం, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కారం, పొట్టి శ్రీరాములు తెలుగు యూనివర్సిటీ పురస్కారం. 2013.

**వెంకటసత్యవాణి జొన్నలగడ్డ డా. :** తూ.గో.జిల్లాలోని హంసవరం స్వస్థలం. మద్రాసులో చదువు. బి.ఎ.ఎం.ఎ.లలో మద్రాసు విశ్వవిద్యాలయంలో బంగారు పతకం, తమిళంలో ఎం.ఎ., పింగళి సూరన కళా పూర్ణోదయాన్ని, సి.ఆర్.రెడ్డిగారి కవిత్వ తత్త్వ విచారాన్ని తమిళంలోకి అనువదించారు. తెలుగు, తమిళ, ఆంగ్ల భాషల్లో 26 పుస్తకాలు,130వ్యాసాలు రచించారు. 60జాతీయ, అంతర్జాతీయ సదస్సుల్లో పత్రసమర్పణలు చేశారు. ప్రస్తుతం ద్రావిడ విశ్వవిద్యాలయంలో తెలుగు పండిత శిక్షణ ఇస్తున్నారు. చిరునామా: ప్రొఫెసర్ &హెడ్, డిపార్ట్మెంట్ ఆఫ్ లాంగ్వేజ్ టీచింగ్ టెక్నాలజీ, ద్రవిడియన్ యూనివర్సిటీ, కుప్పం-517426. చిత్తూరు జిల్లా, ఎ.పి. ఫోను నం : 9441134856.

**వెంకటేశ్వరమ్మపూషడపు :** తెలుగు ఉపాధ్యాయిని, వర్ధమాన రచయిత్రి. చిరునామా: 1వ వార్డు, గాంధీ క్షేత్రం, అవనిగడ్డ-521121. ఫోను నం. 7989411151.

**వెంకమాంబ తరిగొండ :** జన్మస్థలం చిత్తూరు జిల్లా, గుర్రంకొండ మండలం తరిగొండ గ్రామం. వాసిష్ఠ గోత్రీకుడైన కావాల కృష్ణయ్య, మంగమాంబ నందవారిక బ్రాహ్మణ దంపతులకు 1730లో జన్మించారు. 19వ శతాబ్దపు తెలుగు కవయిత్రి. వెంకమాంబ అనేక పాటలు, యక్షగానాలు రచించారు. వెంకమాంబ రచనలన్నీ వేదాంతము, భక్తి ప్రధానమైనవి. పద్యకావ్యాలు: వేంకటాచల మాహాత్మ్యము, అష్టాంగ యోగసారము. ద్విపద కావ్యాలు: ద్విపద భాగవతము (ద్వాదశ స్కంధము), రమా పరిణయము, రాజయోగామృత సారము, వాశిష్ఠ రామాయణము. శతకాలు: శ్రీకృష్ణ మంజరి, తరిగొండ నృసింహ శతకము. యక్షగానాలు: నృసింహ విలాసము, శివలీలా విలాసము, బాలకృష్ణ నాటకము, విష్ణు పారిజాతము, రుక్మిణీ నాటకము, గోపీ నాటకము, చెంచు నాటకము, ముక్తి కాంతా విలాసము, జలక్రీడా విలాసము, తత్త్వ కీర్తనలు. 1817లో మరణించారు.

**వేంకటరత్నమ్మ వింజమూరి :** తెలుగులో తొలి మహిళా సంపాదకులలో వింజమూరి వెంకటరత్నమ్మ ఒకరు. 1916లో 'అనసూయ' అనేపత్రిక ప్రారంభించి, తన సంపాదకత్వంలో 40వ దశాబ్దం వరకు నడిపారు. తన రచనలను కేవలం తన పత్రికలోనే వేసుకోవడంకాకుండా, 'సావిత్రి, హిందూసుందరి, గృహలక్ష్మి'మొదలైన పత్రికలకు పంపేవారు. వ్యాసాలు, కథలతో పాటు పద్య రచన కూడా చేశారు. ఆంధ్రదేశంలో జానపద సంగీతానికి సభాగౌరవం సంపాదిండంలో కూడా ప్రధాన పాత్ర పోషించారు.

**శకుంతల వేదుల :** జన్మస్థలం తూర్పుగోదావరి జిల్లా, ద్రాక్షారామంలో జన్మించి తెలంగాణలో పెరిగారు. సంగీతం, చిత్రలేఖనాలలో ప్రవేశం ఉంది. సఖ్యసాహితి అనే సాహిత్య సంస్థకు ప్రధానకార్యదర్శిగా పనిచేశారు. కథలపై కేంద్రవిశ్వవిద్యాలయంలో ఎం.ఫిల్. స్థాయి పరిశోధనలు జరిగాయి. 100కు పైగా కథలు, 20 నవలలు, 10 నాటికలు, 700కు పైగా వ్యాసాలు రచించారు. కథలు కొన్ని మనీలా రేడియో స్టేషన్ నుండి ప్రసారమయ్యాయి. నవలలు కొన్ని కన్నడ భాషల్లోకి అనువదించబడ్డాయి వెలువరించిన కథా సంపుటాలు 2 ; నవలలు 14 ; వ్యాస సంపుటాలు 2. సాహిత్య అకాడమీ ద్వారా ఉత్తమ రచయిత్రిగా వాసిరెడ్డి రంగనాయకమ్మ అవార్డు, మనసెప్పుడూ గుప్పెడే కథా సంపుటానికి మాటూరి వెంకటసుబ్బారావు అవార్డు, దుమారం కథకు వంశీ బర్కిలీ అవార్డు, మంచు కురిసిన వేళ మమత నవ్వింది కథకు నవ్యసాహితి అవార్డులు పొందారు.

**శరజ్జ్యోత్స్నారాణి :** ఎస్. టి. జ్ఞానానంద కవి, సుగుణమణి దంపతులకు కాకినాడలో జన్మించారు. ఎస్. డీన్, కేంద్రీయ విశ్వవిద్యాలయం,హైదరాబాదు. 250 జాతీయ సదస్సుల్లో పత్రసమర్పణ. మారిషస్, శ్రీలంక, డెట్రాయిట్ అంతర్జాతీయ సదస్సుల్లో పాల్గొన్నారు ప్రఖ్యాత తెలుగు రచయిత్రి, మరియు పరిశోధకురాలు. హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయం నుండి ఎం.ఫిల్, ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి 'ఎల్లోరా రచనలు సమగ్ర పరిశీలన' అనే అంశంపై పరిశోధించి పి.హెచ్.డి చేసారు. తెలుగు విశ్వవిద్యాలయంలో ప్రాజెక్ట్ అసిస్టెంటుగా పనిచేసి 1991లో హైదరాబాదులోని కేంద్రీయ విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో అధ్యాపకురాలిగా చేరారు. 2012లో అదే తెలుగు విభాగానికి అధిపతియై ప్రొఫెసర్గా పనిచేస్తున్నారు. రచనలు: వ్యాస సంపుటాలు 2; కవితా సంపుటాలు 2 ; కథల సంపుటాలు2; ఎల్లోరా. రచనలు: సమగ్ర పరిశీలన, డా.జ్ఞానానందకవి జీవితం వాఙ్మయసూచి, రంగారెడ్డి, హైదరాబాదు జిల్లా బతుకమ్మపాటలు. సామాజికాంశాలు పరిశీలన: స్వాతంత్ర్యానంతర తెలుగు కవిత వస్తువు, రూపం, శిల్పం, పురస్కారాలు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుంచి ఉత్తమ గ్రంథ పురస్కారం, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వంచే ఉగాది పురస్కారం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుంచి ఉత్తమ రచయిత్రి పురస్కారం.వంటి 10 పురస్కారాలు అందుకున్నారు. బిరుదులు సాహితీ యువరత్న, భారత భాషా భూషణ్. చిరునామా.సాయి ప్రసన్న అపార్ట్ మెంట్స్, ఇం.నం.1-9-314/4,ఫ్లాట్-101,విద్యానగర్ రోడ్ నుం.7,హైదరాబాద్-500044. ఫోన్. 9866592115.

**శశి వాయుగుండ్ల :** గణిత ఉపాధ్యాయిని, పరిశోధకురాలు. రాష్ట్ర ప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ పురస్కార గ్రహీత. జాబిలితునకలు కవితా సంకలనం, స్వర్ణముఖి సవ్వడులు నానీలు దశదిశలు కవితా సంకలనం వెలువరించారు. మట్టి వినాయకుడు ఇంకా ఇతర ఉపకరణాల తయారీలో పిల్లలకు శిక్షణనిస్తూ పలు పురస్కారాలు పొందారు.

**శశికళ గుమ్మా :** 30.04.1967 న జననం. విజయవాడలో నివాసం. స్వేఛ్చారాగం కథా సంపుటి 2011లో వెలువడింది. చినుకు, విశాలాంధ్ర, కథాకేళి యువత, మొదలైన పత్రికల్లో పలు కథలు ప్రచురితం. వికలాంగుల గురించి " మేము సైతం" కథాసంపుటిలో వీరి కథ ప్రచురితం.ఆకాశవాణిలో ప్రసంగాలు. బాలకోసం కథలు అనేకం వ్రాశారు. చిరునామా: శ్రీ శరణం టవర్స్, 506, ఎన్ టి ఆర్ కాలనీ, నాలుగవ లైన్, విజయవాడ - 520008. ఫోను నం: 8801782884

**శాంతమ్మ పిలకా డా :** విశ్రాంత అధ్యాపకురాలు. 15.7.1947న జననం. రేడియోలో 30 ప్రసంగాలు, 60 కవితలు, 8నాటికలు, 2 కదంబ కార్యక్రమాల ప్రసారం. కందుకూరి వీరేశలింగం స్త్రీ జనోద్ధరణ అంశంపై పి. హెచ్.డి. చేశారు. స్పందన, తేనెచినుకులు కవితా సంపుటులు, కదంబం వ్యాస సంపుటి, రాగమయి సావనీర్ ప్రచురించారు. అష్ట, శతావధానాల్లో పృచ్ఛకత్వ అనుభవం ఉంది. తెలుగు భాషా సమాఖ్య వ్యవస్థాపక అధ్యక్షులు. వుమన్ ఆఫ్ ద యియర్-1994 గా ఎంపికయ్యారు. చిరునామా: ఇం.నం. 6-5-45, పంద్రంగి వీధి, కృష్ణా పార్కు దగ్గర, శ్రీకాకుళం-532001. ఫోను నం. 9866128187.

**శారదాంబ వేమూరి :** ఇప్పటి జన్మస్థలం కృష్ణాజిల్లాలోని ముదినేపల్లి మండలం అల్లూరు గ్రామం. 1881 మేనెల 3 తారీఖున జానకమ్మ, దాసు శ్రీరాములు దంపతులకు జన్మించారు. సంస్కృతాంధ్రాలు చదివారు. సంగీత సాహిత్యాలలో ప్రావీణ్యత పొందారు. స్త్రీలకు విద్యాబోధన అవసరమని ఉద్యమం ఆరంభించిన మహిళారత్నాలలో ఒకరు. జీవితకాలము కేవలము 19 సంవత్సరములు మాత్రమే. బహుముఖ ప్రజ్ఞాశాలి, గొప్పపలుకుబడిగల్గి తన 16 వ ఏట రచించిన ప్రబంధము 'నాగ్నజితి పరిణయం'. ఆనాటి పత్రికలు జ్ఞానోదయ, జనానా పత్రికల్లో దేవీస్తుతి కీర్తనలు, మాధవశతకము, నాగ్నజితి పరిణయం ప్రచురించబడ్డాయి.

**శారదాంబ వేలూరు :** ప్రథమ స్మృతి కవిత్వ రచయిత్రి, వీరేశలింగం గారి మృతి సందర్భంగా ఆగష్టు 1919 సం. అనసూయ పత్రికలో వీరు స్మృతి పద్యాలు వ్రాశారు. శ్రీ మదాంధ్ర భాషాసంజీవని పత్రికలో ప్రచురింపబడ్డాయి.

**శారదాదేవి ఆచంట :** 1922లో విజయవాడలో జన్మించారు. తెలుగు, ఇంగ్లీషు, హిందీ సంస్కృతభాషల్లో ప్రావీణురాలు. 1945నుండి కథలు వ్రాయసాగారు. 1954నుండి 1977వరకూ తిరుపతి పద్మావతి కాలేజీలో తెలుగు లెక్చరరుగా పని చేశారు. పారిపోయిన చిలుక, ఒక్కనాటి అతిథి. మరీచిక, వానజల్లు మొదలైన రచనలు వెలువడ్డాయి. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కారం పొందారు. 1999లో తిరుపతిలో మరణించారు.

**శారదాదేవి జొన్నలగడ్డ :** నూజివీడు వాస్తవ్యురాలు. రచయిత్రి.

**శారదాపూర్ణ శొంఠి:** జన్మస్థలం తిరుపతి. ప్రముఖ రచయిత్రి. స్వాతంత్రసమరయోధులు సుసర్ల గోపాలశాస్త్రిగారి కుమార్తె. చికాగోలో తెలుగు స్టడీస్ సెంటర్ డైరక్టరుగా పనిచేస్తున్నారు. విశాఖపట్నంలో పెరిగింది. 1975 లో అమెరికాకు వలస వెళ్ళారు. 1997 లో తెలుగుభాషలో డాక్టరేట్ పొందడంతో

పాటు త్రిపురనేని గోపీచంద్ గోల్డ్ మెడల్ ను పొందారు. 2010 లో సంస్కృత భాషలో రెండవ డాక్టరేటు డిగ్రీని పొందారు. భారతదేశం లోని ఉత్కల్ విశ్వవిద్యాలయం నుంచి సంగీత శాస్త్రంలో డి.లిట్ చేశారు. లాభాపేక్ష లేని స్వచ్ఛంద సంస్థ అయిన "సప్నా" (అన్నమాచార్య ప్రాజెక్టు ఇన్ నార్త్ అమెరికా)ను 1989లో స్థాపించారు. 1989 లో అమెరికాలో భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను పరిరక్షించేందుకు చికాగో నగరంలో "శ్రీ ఫౌండేషన్" ను స్థాపించారు. 2000 లో "సెంటర్ ఫర్ తెలుగు స్టడీస్" ను స్థాపించారు. రచయిత, పండితురాలు. 8 పుస్తకాలను ప్రచురించారు. "బ్రహ్మి" అనే త్రైమాసిక జర్నల్‌కు యజమాని, సంపాదకురాలు. ప్రచురణలు: ప్రతీచి (లేఖలు), శరద్ధృతి, తాళ్ళపాక అన్నమాచార్యుని సంగీత నృత్య కళాభిజ్ఞత, మేఘదూతం, నీతి సాహస్రి(చాణక్య సూక్తులు), శరజ్ఝరి, తెలుగు సంస్కృతిభాషా సారస్వతములు, శరన్నిక్వాణం. పురస్కారాలు: భాషారత్న; 2013 : మహతి పురస్కారం, 1989 : రాయప్రోలు సుబ్బారావు సాహితీ అవార్డు, సంగీత కళా ప్రపూర్ణ, 2005 లో తానా అవార్డు, 2006 లో ఆటా అవార్డులు పొందారు.

**శిరీష కొండా :** అనంతపురం వాసి. ప్రస్తుతం డిగ్రీ తృతీయ సంవత్సరం విద్యార్థిని. 35 కవితలు రచించి 20 కవిసమ్మేళనాలలో పాల్గొని కవి సత్కారం పొందింది.

**శివకుమారి దాసరి :** విశ్రాంత హిందీ ఉపాధ్యాయిని. తెనాలిలో నివాసం. పలు పత్రికలలో కథలు, వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. ఆకాశవాణి కార్యక్రమాల్లో పాల్గొన్నారు. ఆటవిడుపు కథల సంపుటి, ధర్మం శరణం గచ్ఛామి హిందీ అనువాద నవల, ఆదివారం సందడి బాలల కథాసంపుటి, అమ్మకు వందనం నవల, ప్రసిద్ధ హిందీ కథల అనువాద పుస్తకం వెలువరించారు.

**శివలక్ష్మి మాదిరాజు,** ఎం.ఏ తెలుగు & సంస్కృతం, ఎం.యల్.ఐ. సి; పి.జి.డి.సి.జె. కార్యదర్శి – సరసభారతి..అధ్యక్షులు, లయన్స్ క్లబ్ ఆఫ్ యాకమూరు,కార్యవర్గ సభ్యురాలు – కృష్ణా జిల్లా రచయితల సంఘం..రచయిత్రి, వక్త చిరునామా: యాకమూరు పోస్ట్,తోట్లవల్లూరు మండలం,ఉయ్యూరు (వయా), పిన్: 521165. కృష్ణా జిల్లా. ఫోన్: 93953 79582

**శుభశ్రీరాజన్ :** సంస్కృత అధ్యాపకురాలు, కవయిత్రి, యానాం. అనేక కవిసమ్మేళనాల్లో పాల్గొని కవిసత్కారం పొందారు. సెల్ 9989506280.

**శేషమాంబ చుండూరు :** జన్మస్థలం గుంటూరు జిల్లా కొల్లిమర్ల. 14-09-1950 న జన్మించారు. విశ్రాంత జిల్లా పరిషత్ ఉద్యోగిని. సూక్తులను సేకరించి

ఆణిముత్యాలు పేరిట ముద్రించారు. మగువా నీ చిరునామా ఎక్కడ? కవితా సంపుటి వెలువరించారు. పత్రికలలో కవితలు ప్రచురించబడ్డాయి. చిరునామా: బృందావనం దగ్గుబాటి అపార్ట్ మెంట్స్, ఫ్లాట్ నెం: 502, 5 వ ఫ్లోర్, 2/ 18,బ్రాడీపేట, గుంటూర్ -522002 , ఫోను నం: 9912892842.

**శేషుకుమారి పెళ్ళూరి.** 11.7.1962న దివితాలూకా మద్రిపాలెంలో జన్మించారు. కథలు, కవితలు రాస్తున్నారు.ఆకాశవాణి కార్యక్రమాలలో పాల్గొంటున్నారు. చిరునామా. సాయి సత్యదేవా నగర్ కాలనీ,రోడ్ నం. 2,ఫ్లాట్ నం. 147, నెప్పల్లి, కంకిపాడు మండలం,కృష్ణా జిల్లా. ఫోన్. 7013027633.

**శైలజ. సామినేని.** విజయవాడ, కవయిత్రి ,నేటి సామాజిక పరిస్తితులపై కవితలు వ్రాయడం... ప్రసంగాలు, అనేక సాహిత్య సంస్థలతో కలసి కవి సమ్మేళనాలలో పాల్గొనడం.ఆకాశవాణిలో కవితలు చదవడం . నవ్యాంధ్ర రచయిత్రుల సంఘం అధికార ప్రతినిధి, ఆంధ్రప్రదేశ్ రచయిచతల.సంఘం సభ్యురాలు.,ఎక్సరే సంస్థ సంయుక్త కార్యదర్శి..

**శైలజామిత్ర :** జన్మస్థలం చిత్తూరు జిల్లా చిన్నగొట్టిగల్లు గ్రామం. 1966 జనవరి 15తేదీన జన్మించారు. వివిధ పత్రికలలో కవితలు, వ్యాసాలు, కథలు, నవలలు; కవితా సంపుటులు 6 ; కథల సంపుటాలు 3 ; అంగ్లం నుంచి అనువాదాలు 3 రచించారు. సన్మానాలు, సత్కారాలు: అఖిల భారత భాషా సాహిత్య సమ్మేళన్, భోపాల్ వారిచే సాహితీయువరత్న, సాహిత్యశ్రీ బిరుదులు; ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఉగాది పురస్కారం, దేవులపల్లి కృష్ణశాస్త్రి పురస్కారం, శ్రీశ్రీ అవార్డు, ఆరుద్ర పురస్కారం, జ్వాలాముఖి పురస్కారం, ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డులు పొందారు.

**శ్యామల నేతి :** జన్మస్థలం గుంటూరుజిల్లా అమరావతి. అక్కడే హైస్కూల్లో చదివారు. పావలా శ్యామలగా ప్రసిద్ధురాలైన గొప్పనటి. గణేష్ పాత్రో 'పావలా' అనే నాటకంలో ఆమె అద్భుతంగా నటించడంతో ఆ పేరు స్థిరపడిపోయింది. అనేక నాటకాలు వ్రాశారు. 2500సార్లు ఉత్తమనటిగా బహుమానం పొందారు. 'కళాజ్యోత్స్న' బిరుదునందుకున్నారు.

**శ్రీ ఉమామహేశ్వరీ వి :** విజయవాడ. చైతన్య కెరటాలు, శంఖారావం, మానవత్వం వైపు కవితా సంపుటిలు వెలువరించారు. ఆధ్యాత్మిక కవిసమ్మేళనాలు నిర్వహిస్తారు. పలుపత్రికలలో కవితలు, వ్యాసాలు ప్రచురితం. కొన్నిటికి రాష్ట్ర స్థాయి బహుమతులు. తల్లి పోలుకొండ మంగతాయారు స్మారకార్ధం సాహిత్య సంస్థ ఏర్పాటు చేసి రాష్ట్ర స్థాయి కవి సమ్మేళనాలు, శతకపద్య పోటీలు, సాహితీ

గోష్ఠులు నిర్వహిస్తున్నారు. చిరునామా: ఇంటినెం: 6-46, ప్రసాదంపాడు, ఎస్.ఈ.ఆర్ సెంటర్ విజయవాడ -521108 ఫోను నం. 9985154331.

**శ్రీఉమామహేశ్వరి వాసాల :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'నూజివీడు'. 17.8.1973న జన్మించారు. పరిశోధకురాలు.ఎం.ఏ. తెలుగు పూర్తిచేసిన తర్వాత 'కవితా కావ్యాలలో 'కాంతి స్వప్న' అనే డా. జి.వి.పూర్ణచంద్‌గారి కావ్యంపై సిద్ధాంతవ్యాసం రచించి, ఎం.ఫిల్. పట్టా పొందారు. 'చైతన్య కెరటాలు' అనే కవితా సంపుటిని, వివిధ పత్రికలలో సాహిత్య వ్యాసాలు ప్రచురించారు. ఆకాశవాణిలో వీరి ప్రసంగాలు, కవితలు ప్రసారమయ్యాయి.

**శ్రీదేవి కూసుమంచి :** ఉపాధ్యాయిని, విజయనగరం. కవయిత్రిగా సహస్ర కవిమిత్ర, కవి విశారద బిరుదులు పొందారు. గురజాడ రాష్ట్రస్థాయి పురస్కారం అందుకున్నారు.

**శ్రీదేవి పెయ్యేటి :** జన్మస్థలం ప.గో.జిల్లా, నరసాపురం. వివిధ పత్రికలలో, ఆస్ట్రేలియా తెలుగుపత్రిక వాహినిలో కథలు ప్రచురింపబడ్డాయి. సిడ్నీ ,బ్రిస్బేన్ లనుండి వెలువడే తెలుగురేడియో లో కథలు ప్రసారమయ్యాయి. ఒక కథల సంపుటిని వెలువరించారు.

**శ్రీదేవి లేళ్లపల్లి :** తెలుగు, హిందీ, ఇంగ్లీష్, తమిళ భాషలలో ప్రావీణ్యం. కూచిపూడి నృత్యకారిణి. ఆం. ప్ర. ప్రభుత్వ యువజన అవార్డు, నాట్యంలో అనేక బహుమతులు, పురస్కారాలు పొందారు. కథ, కవిత, పత్ర సమర్పణ వ్యాసం ఒక్కోటి ప్రచురితం. సమాజసేవ చేస్తున్నారు. చిరునామా: లేళ్ళపల్లి హౌస్, నం. 12, ఐ.ఐ.టి. కాలనీ, ఫస్ట్ మెయిన్ రోడ్, నారాయణపురం, పల్లి కరణై, చెన్నై-600100. ఫోన్. నం. 9445360139.

**శ్రీదేవి విక్రాల :** ప్రప్రథమ బంధకవిత్వ పద్యకవయిత్రి,వాసవదత్తా పరిణయకావ్యం ప్రసిద్ధి పొందింది.

**శ్రీదేవి. పి.డా. :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'విజయవాడ'. 1929 సం.లో జన్మించారు. ప్రముఖ తెలుగు రచయిత్రి. తండ్రి గుళ్ళపల్లి నారాయణమూర్తి. విద్యాభ్యాసం కాకినాడ, విశాఖపట్నంలో. కథలు ప్రస్తుతం కథానిలయం.కామ్ వెబ్ సైటులో లభ్యం. విద్యాభ్యాసం యం.బి.బి.యస్. ఆంధ్రా మెడికల్ కాలేజీ, విశాఖపట్నం; చిత్రలేఖనం అభ్యసించారు. ఉద్యోగం గుడివాడ ప్రభుత్వ ఆసుపత్రిలో కొంతకాలం పనిచేసి, తరవాత ప్రైవేటు ప్రాక్టీస్ పెట్టుకున్నారు. 'తెలుగు స్వతంత్ర'లో అసిస్టెంటు ఎడిటర్గా పనిచేశారు. సాహిత్యరంగం " కథ, వాళ్లు పాడిన భూపాలం" ని

ఉత్తమశ్రేణి రచయిత్రిగా నిలబెట్టింది. కథలు రేవతి స్వయంవరం, ఉరుములు, మెరుపులు (పెద్దకథ), కల తెచ్చిన రూపాయిలు, మెత్తని శిక్ష, స్వరూపంలో రూపం, వర్షం వెలిసేసరికి ... , పూవుబతుకు, మూగగళం, చక్రనేమి క్రమాన, వీధిదీపాలు, ఎదురుతిరిగిన ప్రకృతి, బెడిసికొట్టినవాత్సల్యం, జ్వరపీడితులు, ఎవరిస్వప్నం వారిదే, వాళ్లుపాడిన భూపాలరాగం, తిరగేసి తొడుక్కున్న ఆదర్శం, అర్థంకాని అనుభవం. నవల 'కాలాతీత వ్యక్తులు' 1957లో తెలుగు స్వతంత్రలో ధారావాహికంగా వెలువడింది. 1958లో పుస్తకరూపంలో వెలువడింది. అంతే కాక, ఈ నవలను నాటికగా ఆకాశవాణిలో 1960లో ప్రసారం చేయబడింది. రాసిన ఒకే ఒక నవల మైలురాయిగా నిలిచింది. "చదువుకున్న అమ్మాయిలు" అన్నపేరుతో చలనచిత్రంగా కూడా రూపొందింది. సమీక్షలు విశ్వనాథవారి నవలాసృష్టి: 'చెలియలికట్ట', వెంపో రచించిన 'కన్నతల్లి' నవలా సమీక్ష. జూన్ 29వ తేదీ, 1961లో అనారోగ్యంవల్ల అకాలమరణం పొందారు.

**శ్రీదేవి.సుందరవల్లి టి.వి :** జన్మస్థలం చెన్నై. ఆధ్యాత్మిక రచయిత్రి, గాయని, స్వరకర్త. సాహిత్యశ్రీ. 12 ఆధ్యాత్మిక పుస్తకాలు వెలువరించారు. వెంకటేశ్వరస్వామిపై రచించిన 750 పైగా గీతాలు ప్రముఖ గాయకులచే పాడబడి సి.డి.లుగా వెలువడినవి. తానా, సింగపూర్ తెలుగు మహాసభలలో, తిరుమల, యాదగిరిగుట్ట బ్రహ్మోత్సవాలలో, న్యూయార్క్ స్వీయ కీర్తనలు, అన్నమయ్య కీర్తనలు గానంచేసి ఆధునిక వాగ్గేయకారిణిగా, అభినవ వేంగమాంబగా ప్రశంసలు పొందారు. భారత్ భాషా భూషణ్, సాహిత్యశ్రీ, సాహితీ కోకిల బిరుదులతో పాటు లెక్కకు మిక్కిలిగా పురస్కారాలు పొందారు. టి.వి.చానల్స్ లో గేయ రూపకాలు ప్రసారమయ్యాయి. ఫోను నం.9490749643.

**శ్రీరంగ లక్ష్మి యార్లగడ్డ.** స్వస్థలం మచిలీపట్నం.నివాసం విజయవాడ.ఆంధ్ర మహాభారతం-యుద్ధ వ్యూహాలు అంశంపై పరిశోధన చేసి పి.హెచ్.డి పట్టా పొందారు.

**శ్రీరాజరాజేశ్వరి టి. డా. :** జన్మస్థలం కృష్ణాజిల్లా కంకిపాడు సమీపంలోని 'ఉప్పలూరు'. 1973 సెప్టెంబర్ 18న జన్మించారు. పరిశోధకురాలు. ఆంధ్రవిశ్వవిద్యాలయం నుంచి, ఎం.ఏ.; 'కరి మకరీయము కావ్యానుశీలనము' అనే సిద్ధాంతవ్యాసం రచించి, ఎం.ఫిల్.; 'శ్రీమదుమా కళ్యాణము అనుశీలన' అనే సిద్ధాంతవ్యాసం రచించి, పి హెచ్.డి. పట్టాను అందుకున్నారు. వీరు సెమినార్లలో పరిశోధనాపత్రాలు సమర్పించారు.

**శ్రీలక్ష్మి కోడూరి :** ఉపాధ్యాయిని, గేయరచన ద్వారా పిల్లలలో తెలుగు పట్ల ఆసక్తిని పెంచుతున్నారు. పలు కవిసమ్మేళనాలలో పాల్గొన్నారు. చిరునామా: నీలాద్రిపురం. పోష్టు, కొమ్ముగూడెం మండలం: తాడేపల్లిగూడెం. జిల్లా : పశ్చిమ గోదావరి. పిన్. : 534101. ఫోను నం. 99496-44599 .

**శ్రీలక్ష్మి చివుకుల :** అనేక అంతర్జాతీయ, జాతీయ సదస్సుల్లో పత్ర సమర్పణలు, సాహిత్య ప్రసంగాలు చేశారు. పత్రికలు, రేడియోలో కథలు, కవితలు, వ్యాసాలు, అవధానాలలో పృచ్ఛకత్వం వహించారు. శ్రీరామాయణ కథా ప్రశ్నోత్తర మాలిక, విజయనగర వైభవానికి దిక్సూచి గ్రంథాలు వెలువరించారు. 116మంది రచయితలతో కలిసి ఆది నుండి అనంతం దాకా వచన కావ్యం పుస్తకం వెలువరించారు. అనేక పురస్కారాలు, బిరుదులు పొందారు. విజయనగరం రచయితల సంఘం ఉపాధ్యక్షులుగా ఉన్నారు. చిరునామా: ఇంటి నెంబరు-20-24-18; వెంకటేశ్వర కాలనీ; విజయనగరం-535002. ఫోన్ నెంబర్- 9441957325.

**శ్రీవల్లికా ఆనంద్ ధేరం :** జన్మస్థలం రాజమహేంద్రవరం ఎం.ఎ., బి ఎల్ ప్రస్తుతం ఉండేది విజయవాడ. వృత్తి న్యాయవాది. ప్రవృత్తి: కథలు, కవితలు, పాటలు వ్రాయడం, వ్యాఖ్యాతగ వ్యవహరించడం. ఫోను నం: 9246642706.

**శ్రీవాణీ శర్మ ఆర్ :** పాటలు, పద్యాలు, గేయాలు, గజల్స్ రాస్తారు. ఇంగ్లీష్ లెర్నింగ్ ప్రోగ్రాం ఫర్ బిగినర్స్, లెట్స్ లెర్న్ ఇంగ్లీష్ త్రూ తెలుగు, అయ్యో.. కలియుగం (వ్యంగ్య శతకం) పుస్తకాలు రచించారు. మనసురాగాలు గజల్ గేయసంపుటి ప్రచురణలో ఉంది. అనేక గేయాలకు పురస్కారాలందుకున్నారు. విశిష్ట మహిళ, సాహిత్య రత్న, తెలుగు దీప్తి పురస్కారాలు పొందారు. కేన్సర్,ఎయిడ్స్ లపై అవగాహనా సదస్సులు నిర్వహిస్తున్నారు. ఫోన్. 9441324587.

**షరీఫా షేక్ :** జన్మస్థలం కృష్ణాజిల్లా మచిలీపట్నం. 1964 అక్టోబర్ 1 న జన్మించారు. ధార్మిక వ్యాసకర్త. ఎం.ఏ. చదివి ఉపాధ్యాయ వృత్తిలోఉన్నారు. వీరి కలం పేరు "వెన్నెల", "ఇస్లాంలో స్త్రీ స్థానం" అనే ధార్మిక వ్యాసం, 'గీటురాయి" వార పత్రికలో ప్రచురితం. వివిధ పత్రికలలో ధార్మిక వ్యాసాలూ, అనేక కథానికలు రచించారు. ప్రస్తుతం విజయవాడ, లబ్బీపేటలో నివసిస్తున్నారు.

**సంతోషి సాలూరు :** విజయనగరం వాస్తవ్యులు. కవితలు, గేయాలు రాస్తారు. పత్రికలలో ప్రచురింపబడ్డాయి. కవితా సోయగం కవితా సంపుటి రచించారు. బాలప్రోత్సాహక రత్న, సావిత్రిబాయి పూలే అవార్డులు పొందారు. ఫోను నం. 8019793424.

**సత్యకామేశ్వరి చేబ్రోలు :** అవనిగడ్డ వాస్తవ్యులైన చేబ్రోలు సూర్యంగారి కోడలు, ప్రతాప్ కుమార్ గారి బార్య. 'అమ్మతనం ఒక వరం' అనే గ్రంథాన్ని రచించారు.

**సత్యనీలిమ వలిపే.** కలంపేరు రవికిరణం. తెలుగు ఉపాధ్యాయిని.వనపర్తి జిల్లా పెబ్బేరు మండలం గుమ్మడం గ్రామంలో జన్మించారు. 200కవితలు,50పాటలు వ్రాశారు.

**సత్యలత దోణం :** హిందూకళాశాల, మచిలీపట్నం. "హిమపుత్రి" నవలిక సంకలనం ధృక్పధ పరిశీలన' అనే పరిశోధనా వ్యాసం ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సమర్పించి, 2006లో పి.హెచ్.డి. పట్టా అందుకున్నారు.

**సత్యవతి కొండవీటి :** ప.గో.జిల్లాలోని 'సీతారామపురంలో జన్మించారు. నాస్తిక భావాలకు ప్రభావితురాలయ్యారు. స్త్రీలకోసం 'స్త్రీవాద సాహితీ సమాఖ్య' ప్రారంభించారు. 'లోహిత' అనే స్త్రీవాద పత్రికకు సహసంపాదకురాలుగా ఉన్నారు. రాసిన మొదటి కథ 'ఊరేగింపు' ఈ పత్రికలోనే అచ్చయింది. మిత్రుల సహకారంతో 'భూమిక' అనే స్త్రీవాద పత్రికను పారంభించారు. సత్యవతి 'విజేత' దినపత్రికలో కాలమిస్టుగా ఉన్నారు. ప్రస్తుతం వార్త దినపత్రికలో 'వరవడి' అనే శీర్షిక కింద అనేక విషయాల గురించి రాస్తున్నారు.

**సత్యవతి పి. :** జన్మస్థలం గుంటూరు జిల్లా, 'కొలకలూరు'. 1940 సం.లోజన్మించారు. ప్రఖ్యాత కథా రచయిత్రి. ఆంగ్ల అధ్యాపకురాలుగా వృత్తిని చేపట్టి, 1998లో పదవీవరమణ చేశారు. స్త్రీవాద రచయితలలో అగ్రగణ్యురాలు. 1970 నుంచి 'మర్రినీడ' అనే పెద్దకథతో కథారచన ప్రారంభించి, పాఠకులను నిరంతరం అప్రమత్తం చేస్తున్నారు. 1997లో చాసో స్ఫూర్తి అవార్డు, కొండేపూడి శ్రీనివాసరావు అవార్డు, 2002లో రంగవల్లి విశిష్ట వ్యక్తి పురస్కారం, 2004లో పొట్టి శ్రీరాములు యూనివర్శిటీ విశిష్ట పురస్కారాలను అందుకున్నారు. డిసెంబరు 1998 "సత్యవతి కథలు", మే 1995 "ఇల్లలకగానే...", సెప్టెంబరు 2003 "మంత్రనగరి" సంపుటాలు ముఖ్యమైనవి. 1977లో 'గ్లాసు పగిలింది' కథకి ఆంధ్రజ్యోతి వారపత్రిక దీపావళి కథల పోటీలో మొదటి బహుమతి వచ్చింది. 'సూపర్ మామ్ సిండ్రోమ్' అనే కథా సంపుటం; ఇంకా "మట్టి నీడ, గొడుగు' మొదలైన నవలలు ప్రచురిత మయ్యాయి. 'ఇల్లలక గానే' కథ 7 భారతీయ భాషలలోకి అనువదించబడింది. పురస్కారాలు 2012: సుశీలా నారాయణ రెడ్డి పురస్కారం, 2012: మల్లెమాల సాహిత్య పురస్కారం, 2014: డా. బోయి భీమన్న ఉత్తమ రచయిత్రి పురస్కారం లక్ష రూపాయల నగదు, ప్రసంశాపత్రం (బోయి భీమన్న సాహిత్య పీఠం, తెలుగు విశ్వవిద్యాలయం, 19.09.2014). ఇంకా 7 అవార్డులు పొందారు.

**సత్యవతి వేమూరి(కావూరి) డా. :** జన్మస్థలం 'కైకలూరు' గ్రామం. 1952 అక్టోబర్ 27 న జన్మించారు. పరిశోధకురాలు, గేయరచయిత్రి. ఎం.ఏ. తెలుగు, ఎం.ఏ. సంస్కృతం ఉత్తీర్ణులై, తెలుగు పండిట్గా, ప్రధానోపాధ్యాయినిగా పనిచేశారు. ప్రస్తుతం విజయవాడలో నివసిస్తున్నారు. 'బీజాక్షరాలు' అనే వచనకవితా సంపుటిని కైకలూరు, సాహితీమిత్రుల సంస్థ ప్రచురించింది. వీరు చాలా కవి సమ్మేళనాలలో తమ కవితలు చదివారు. సావిత్రీబాయి ఫూలే అవార్డు అనేక బహుమతులు కూడా అందుకున్నారు. విహారి గారి శ్రీపదచిత్ర రామాయణంపై పిహెచ్డి చేశారు.

**సత్యవతీదేవి ఆదూరి :** జన్మస్థలం గుంటూరు. 1948, డిసెంబరు 8వ తేదీన జన్మించారు. ఆదూరి సత్యవతీదేవి ప్రముఖ రచయిత్రి. గేయం, కవిత, కథ, వ్యాసం, రేడియోనాటిక, సంగీత రూపకం, పుస్తక సమీక్ష, చిత్రసమీక్ష, పీఠిక వంటి వివిధ ప్రక్రియలలో రచనలు చేసారు. గీత రచయిత్రిగా తన 13వ యేటనే కలం పట్టి సుమారు 200 లలితగీతాలు, భక్తి గీతాలు, దేశభక్తి గీతాలు, బాలగేయాలు రచించారు. సుమారు 50 లలితగేయాలు ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. కవయిత్రిగా 150కి పైగా కవితలు వ్రాసి పలువురు సాహిత్య విమర్శకుల ప్రశంసలను అందుకున్నారు. ఆకాశవాణి, దూరదర్శన్ కవిసమ్మేళనాలలో పాల్గొన్నారు. కవితలు హిందీ, ఇంగ్లీషు భాషలలో అనువదించబడి "ఇండియన్ లిటరేచర్", "సమకాలీన్ భారత్ సాహిత్య" వంటి ప్రఖ్యాత పత్రికలలో ప్రచురింపబడ్డాయి. 2008, అక్టోబరు 16వ తేదీన అనారోగ్యగ్రస్తురాలై మరణించారు . రచనలు వెన్నెల్లో వేణుగానం, రెక్కముదువని రాగం, జలపాతగీతం, వేయిరంగుల వెలుగు రాగం, వెన్నెల సౌరభాలు' మొదలైనవి. రచనలు హిందీ, ఇంగ్లీషు భాషలలోకి తర్జుమా అయ్యాయి. కవిత "వేయిరెక్కల పావురం" ఆంగ్లానువాదం Myriad winged bird 2008 నుండి ఆంధ్రప్రదేశ్లోని అన్ని విశ్వ విద్యాలయాల డిగ్రీ తరగతుల విద్యార్థులకు పాఠ్యాంశంగా నిర్ణయించ బడింది. పురస్కారాలు: 1994లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుండి 'ఉత్తమ రచయిత్రి' ప్రతిభా పురస్కారం, యునెస్కో లిటరరీ అవార్డు వంటి పలు అవార్డులు, పురస్కారాలు లభించాయి.

**సత్యవతీదేవి సీమకుర్తి :** నానా క్షేత్ర సందర్శనము, చందమామ, భగవన్నుతి మొదలైన రచనలు.

**సత్యవాద సోదరీమణులు ( సత్యవాద వెంకట రఘునాథమ్మ & సూర్యకుమారి) :** సత్యవాద సోదరీమణులుగా ప్రసిద్ధి చెందిన సత్యవాద రఘునాథమ్మ, సత్యవాద సూర్యకుమారి బహుముఖ ప్రజ్ఞావంతులు. జమీందారీ కుటుంబంలో పుట్టిన వీరు పుట్టుకతో అంధులు. ఈ జంట అనేక కథలను వ్రాసింది. కవితలను గేయాలను రచించి కవులుగా, పాటలు పాడి గాయనీమణులుగా ప్రసిద్ధి చెందారు. స్కూలు చదువులు ఏమీ చదవక పోయినా, బ్రెయిలీ నేర్చుకునే అవకాశం రాకపోయినా, రేడియో వినడం ద్వారా తమ జ్ఞానాన్ని పెంచుకున్నారు. సంగీత సాహిత్యాలలో తమదైన ఒక గుర్తింపును సంపాదించు కున్నారు. వీరిలో చిన్నవారైన సూర్యకుమారి వీణావాదనలో కూడా నిష్ణాతురాలు. వీరు సత్య సాహితి అనే సాహిత్యసంస్థను స్థాపించారు. శివరామ సంగీత శిక్షణా కేంద్రాన్ని నిర్వహిస్తున్నారు. రచనలు:వీరు 100కు పైగా కథలు వ్రాశారు. 5 కథాసంపుటాలను వెలువరించారు. వీరి తొలి కథ 1975 జూలై 16న ఆకాశవాణి, విజయవాడ కేంద్రం నుండి ప్రసారమయ్యింది. వీరు అనేక సంగీత రూపకాలు, రేడియో నాటకాలు కూడా వ్రాశారు. అంధులైన ఈ జంట సొంతంగా రాయలేరు కనుక వీరు కథ చెబుతుంటే ఇతరులు సహకరించేవారు. వీరు అనేక గీతాలు కూడా వ్రాశారు. వీరు ప్రకటించిన పుస్తకాలు: 5 కథాసంపుటులు; రసమయి (గేయసంపుటి); 6 నాటికలు; 73 కథల జాబితా వెలువరించారు.

**సత్యవాణి చల్లా :** జన్మస్థలం రాజోలు తాలూకా మలికిపురం మండలం మోరి గ్రామం. 1942 ఏప్రిల్ 4 లో జన్మించారు. ఎం.ఏ (హిందీ) సాహిత్యరత్న, ఎం.ఏ (రాజనీతి శాస్త్రం, ఎం.ఏ (ఫిలాసఫీ, ఎం.ఇడి, ఎం.ఫిల్, పిహెచ్.డి. పూర్తిచేశారు. కందుకూరి రాజ్యలక్ష్మి కళాశాల అధ్యాపకురాలిగా, ఎన్.సి.సి మేడంగా సేవలిందించి, రాజమహేంద్రి మహిళా కళాశాల ప్రిన్సిపాల్ గా చేసి, డైరెక్టర్ గా కొనసాగుతున్నారు. దేశంలోని మారుమూల ప్రాంతాలకు సైతం వెళ్ళి అక్కడ ఆలయాలను దర్శించి, వాటి విశిష్టత అవగతం చేసుకుంటారు. ఇక అక్కడకు ఎలావెళ్ళాలి వంటి విషయాలంటిని పొందుపరుస్తూ, వ్యాసాలను పత్రికలకు అందించడమేకాదు, మళ్ళీ వాటన్నింటినీ క్రోడీకరించి, పుస్తక రూపంతెచ్చి, ఉచితంగా పంచిపెట్టడం సహజ లక్షణం. ఈవిధంగా ఇప్పటివరకూ 'ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రదర్శిని, నవజనార్దన క్షేత్రదర్శిని, ద్వాదశ నారసింహ క్షేత్రదర్శిని' వంటి 25 పుస్తకాలు అందుబాటులోకి తెచ్చారు. 2006లో ఆంధ్రా యూనివర్సిటీనుంచి' సర్ రఘుపతి వెంకట రత్నంనాయుడు 'స్వర్ణ పతక పురస్కారం, అన్నపూర్ణయ్య పురస్కారం పొందారు. ఇంకా ఎన్నో సత్కారాలు అందుకున్నారు.

**సత్యవేణి పసుపులేటి :** యువ రచయిత్రి. తణుకులో జన్మించారు. స్వాతి, నవ్య, ఆంధ్రభూమి, ఈనాడులలో వీరి కథలు ప్రచురితమైనాయి. చిరునామా : 501 చంద్రికా మాణిక్య అపార్ట్‌మెంట్, 6వ లైన్, బాబా నగర్, ఎ.వి. అప్పారావు రోడ్డు, రాజమండ్రి - 5033106. సెల్ : 8106678978.

**సరళ కమతం.డా.:** తెలుగు అధ్యాపకురాలు. పెద్దిభొట్ల సుబ్బరామయ్య కథల మీద ఎం.ఫిల్,నవలల మీద పి.హెచ్.డి. పొందారు. 20 జాతీయ, అంతర్జాతీయ సదస్సుల్లో పత్ర సమర్పణలు. పలు మాస పత్రికలలో కవితలు ప్రచురితం. అష్టావధానాలలో పృచ్ఛకత్వ అనుభవం ఉంది. చిరునామా. తెలుగు అధ్యాపకురాలు, శ్రీ దుర్గా మల్లేశ్వర సిద్దార్థ మహిళా కళాశాల,విజయవాడ. ఫోన్. 9848316383.

**సరళాదేవి పి. :** 1950వ దశకంలో ప్రముఖ రచయిత్రులలో పి. సరళాదేవి ఒకరు. జననం 1937లో. 2007లో మరణించేవరకు విజయనగరంలో నివసించారు. తొలి కథ" బావ చూపిన బ్రతుకు బాట" డిసెంబరు 1955 లో ప్రజాతంత్రలో ప్రచురితమైంది. రచనలు కుంకుమరేఖలు కథాసంకలనం, ప్రముఖ పాత్రికేయుడు గోరాశాస్త్రిగారి ముందు మాటతో ప్రచురణ అయింది. విశేషంగా ఆదరణ పొందిన సంకలనం ఇది. ఈ కథలు ఆకాశవాణి విజయవాడ కేంద్రం ధారావాహికంగా ప్రసారం చేసింది. 1979లో యువమాసపత్రికలో కొమ్మా, బొమ్మా అనే పేరుగల నవలిక ప్రచురించారు. తెలుగు సామెతలు సాంఘిక చిత్రణ అనే పరిశోధనాత్మక గ్రంథాన్ని 1986 లో ప్రచురించారు. తెలుగు సామెతలు సాంఘిక చిత్రణ (పరిశోధన గ్రంథం), కుంకుమరేఖలు, సరళాదేవి కథలు, కొమ్మా, బొమ్మా , చిగురు. ఇతర రచయిత్రులతో కలిసి 'షణ్ముఖప్రియ', 'సప్తపది' నవలలు రచించారు.

**సరస్వతి గోరా :** జన్మస్థలం కృష్ణాజిల్లా. సెప్టెంబర్ 28, 1912 న జన్మించారు. ఒక భారతీయ సాంఘిక కార్యకర్త. అనేక సంవత్సరాలపాటు నాస్తిక కేంద్రానికి నాయకురాలిగా పనిచేశారు, అంటరానితనం, కుల వ్యవస్థపై ప్రచారం చేశారు. 1930 వ దశకంలో, సరస్వతి దేవదాసినుల యొక్క వివాహాలు చేయించారు. భర్త గోరాతోపాటు వితంతువులు పునరావాసాలను నిర్వహించారు. జీవిత చరిత్ర 'మై లైఫ్ విత్ గోరా' అనే పుస్తకాన్ని 2012లో ప్రచురించారు (తెలుగులో). ఆగస్టు 19, 2006 న విజయవాడలో ఊపిరితిత్తులవ్యాధితో మరణించారు. 2001 లో, కర్ణాటక ప్రభుత్వం ఇచ్చే బసవ పురస్కారం; హ్యూమానిజంకు,

GD బిర్లా ఇంటర్నేషనల్ అవార్డు; జమ్నాలాల్ బజాజ్ అవార్డు (1999); జానకి దేవి బజాజ్ అవార్డు; మరియు పోట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు అందుకున్నారు.

**సరస్వతి రాయవరపు :** జన్మస్థలం విశాఖపట్నం దేవరపల్లి. 27.5.1955న జన్మించారు. చోడవరంలో నివాసం. విశ్రాంత సి. హెచ్. ఓ(హెల్త్ డిపార్ట్ మెంట్). 80 కథలు, 350 కవితలు పత్రికల్లో ప్రచురితం. పట్టుగొమ్మ కవితాసంపుటి, ప్రేమకథలు, ఆడదే ఆధారం కథా సంపుటాలు వెలువరించారు. చిరునామా: కోటవీధి, మొదటిలైన్, బి.ఎస్.ఎన్.ఎల్.ఆఫీసు వెనుక, చోడవరం-531036, విశాఖ జిల్లా. ఫోన్. నం. 7989665525.

**సరస్వతీదేవి ఇనగంటి:** 'ప్రబోధము' ఖండకావ్య రచయిత్రి.

**సరస్వతీదేవి ఇల్లిందల :** ప్రముఖ తెలుగు కథారచయిత్రి. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందిన తొలి తెలుగు రచయిత్రి. స్వర్ణకమలాలు కథాసంకలనానికి రాష్ట్ర సాహిత్య అకాడమీ పురస్కారం అందుకున్నారు. 1958లో ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ శాసనమండలికి నామినేటెడ్ ఎమ్మెల్సీగా ఎన్నికయ్యారు. "నీబాంచనుకాల్మొక్తా నవల 1976లో ఆంధ్రప్రభ దినపత్రికలో సీరియల్ గా వచ్చి ఒక సంచలనాన్ని సృష్టించింది.

**సరస్వతీదేవి ఇల్లిందుల :** జన్మస్థలం 'మచిలీపట్నం'. 1918లో జన్మించారు. 250 కథలను, 5 నవలలు రచించారు. 5 వ్యాస సంపుటాలు, జీవితచరిత్రలు రచించారు. బాలసాహిత్యకారిణిగా నాటికలు, రేడియో నాటికలు రచించారు. కృష్ణాపత్రికలో ఇయంగేహేలక్ష్మీ, ఆంధ్రపత్రికలో వనితాలోకం శీర్షికలు నిర్వహించారు. వివిధ భాషల్లోంచి ఎన్నో పుస్తకాలను అనువాదాలు చేశారు. కథాసంకలనాలు వెలువరించారు. "దరిజేరిన ప్రాణులు, ముత్యాల మనసు, స్వర్ణకమలాలు, తులసీదళాలు, రాజహంసలు, కళ్యాణ కల్పవల్లి, మనము మన ఆహారము (అనువాదము) పురస్కారాలు, గౌరవాలు 1982లో స్వర్ణకమలాలు కథాసంకలనానికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, స్వర్ణకమలాలు కథాసంకలనానికి రాష్ట్ర సాహిత్య అకాడమీ పురస్కారం అందుకున్నారు. 1983లో ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ శాసన మండలికి నామినేటెడ్ ఎమ్మెల్సీ పదవి లభించింది. 1998 వ సం.లో పరమపదించారు.

**సరస్వతీదేవి చేబ్రోలు :** సరస్వతీ రామాయణము,సరస్వతీ శతకము,ఆత్మోపదేశము, పతివ్రతాశతకము రచించారు. భర్త చేబ్రోలు రాజగోపాల నాయుడు; నివాసం నీలగిరి.ప్రముఖ సంఘసేవిక.

**సరోజిని యార్లగడ్డ :** జన్మస్థలం విజయవాడ. నవలా రచనలో సిద్ధ హస్తులు. సినీనిర్మాత వై రామచంద్రరావుగారి భార్య. మా ఊరి గంగ సినిమాకు కథను అందించారు.

**సరోజినీ దేవి బులుసు :** జన్మస్థలం ప్రకాశం జిల్లా దరిసి. 29.6.1955 న జననం. విశాఖపట్నంలో నివాసం. మొదటి కవితకు రంజని-కుందుర్తి అవార్డు, రెండవ కవితకు ఎక్స్-రే అవార్డు పొందారు. మొదటి కథకు రంజని సాధారణ ప్రచురణకు తీసుకున్నారు. మొదటి వ్యాసానికి ప్రథమ బహుమతి లభించింది. 200 కవితలు, 30 కథలు ముద్రించబడ్డాయి. శ్రీ మంగళంపల్లి బాలమురళీ కృష్ణని చివరిగా ఇంటర్వ్యూ చేశారు. చిరునామా: ఎఫ్ 1, బాబీ ఎన్ క్లేవ్, జగన్నాథ రాజు నగర్, వెంకోజీ పాలెం,విశాఖపట్నం-530022. ఫోను న. 9866190548.

**సాంత్వన చీమలమర్రి :** అబ్బరాజు మైధిలి గారి కుమార్తె. తెలుగులోను, ఇంగ్లీష్ లోనూ ఎన్నో వ్యాసాలు వ్రాశారు. సాంత్వన కర్ణాటక సంగీతం కూడా నేర్చుకున్నారు.

**సామ్రాజ్య లక్ష్మి జంగా.** విశ్రాంత ప్రధానోపాధ్యాయిని, జిల్లాపరిషత్, నెల్లూరు. 1940వ సంవత్సరంలో చిత్తూరు జిల్లా శ్రీకాళహస్తిలో జననం. శ్రీ పోతన భాగవతాన్ని సులభశైలిలో 15 పుస్తకాలుగా రచించి ముద్రించారు. ఈటీవీ పరిపూర్ణ మహిళ-2006 గా గుర్తింపు పొందారు. చిరునామా. 18-4-108, 1వ క్రాస్, రైల్వే కాలనీ, తిరుపతి, చిత్తూరు జిల్లా, 517501. ఫోన్ నెంబర్ 9440325995.

**సావిత్రి కనమర్లపూడి :** జాతీయ, రాష్ట్రస్థాయి సైన్సు ప్రదర్శనలు, ప్రాజెక్టులతో అనేక అవార్డులు పొందారు. కవిసమ్మేళనాలలో పాల్గొన్నారు. 2 పత్రసమర్పణలు చేశారు.

**సావిత్రి చిప్పాడ.** చిరునామా. సహాయ ఆచార్యులు,భారతీయ భాషల తులనాత్మక పాఠశాల, తమిళ విశ్వవిద్యాలయం, తంజావూరు, తమిళనాడు.

**సావిత్రి చిప్పాడ :** తంజావూరు. ఇంటర్నేషనల్ జర్నల్లో 13, నేషనల్ జర్నల్లో 32 పరిశోధనాత్మక పత్రాలు ప్రచురింపబడ్డాయి. అంతర్జాతీయ, జాతీయ, జిల్లా స్థాయి భాషా సాహితీ సదస్సుల్లో 65పైగా పత్ర సమర్పణలు చేశారు. తొల్కాప్పియం తెలుగు అనువాదం, యూరోపియనులు తెలుగు భాషావిద్యకు చేసిన సేవ,ఆంధ్రశబ్ద చింతామణి తమిళ అనువాదం, తెలుగు వ్యాకరణముల చరిత్ర, తమిళ తెలుగు వ్యాకరణ ధోరణులు గ్రంధాలను ప్రచురించారు. పోస్ట్ డాక్టరల్ అవార్డ్(యు.జి.సి.),అక్షరాభిషేకం,సాహితీ వల్లభ అవార్డులు

పొందారు. తంజావూరిలో తెలుగుతేజంగా పిలవబడ్డారు. ప్రస్తుతం తెలుగు, తమిళ ద్విభాషా నిఘంటువు రూపకల్పనలో ఉన్నారు.

**సి.ఆనందారామం డా.:** జన్మస్థలం పశ్చిమగోదావరి జిల్లా, ఏలూరు పట్టణం. ఆగస్టు 20వ తేదీ 1935వ సంవత్సరం జన్మించారు. 60 నవలలు, 100కు పైగా కథలు, 4 విమర్శ గ్రంథాలు వ్రాసారు. నవల ఆత్మబలి సంసార బంధం సినిమాగా, అదే నవల జీవనతరంగాలు టీవీ సీరియల్గా వచ్చింది. జాగృతి నవలను త్రిశూలం సినిమాగా, మమతల కోవెల నవలను జ్యోతి సినిమాగా తీశారు. పురస్కారాలు: గృహలక్ష్మి స్వర్ణకంకణము, మాలతీ చందూర్ స్మారక అవార్డు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ అవార్డు (తుఫాన్ నవలకు), మాదిరెడ్డి సులోచన బంగారు పతకం, తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారాలు(రెండు పర్యాయాలు), సుశీలా నారాయణరెడ్డి పురస్కారం, గోపీచంద్ పురస్కారం, అమృతలత జీవన సాఫల్య పురస్కారం.

**సింధూరెడ్డి కాసర :** జన్మస్థలం విజయవాడ 18-04-1990లో జననం. ప్రతిభా పబ్లిక్ స్కూల్ అకడమిక్ డైరక్టర్. 8 కథలు, 4 కవితలు వివిధ పత్రికలలో ప్రచురితం. రంగవల్లికలు, వంటలు పలు పత్రికలలో ప్రచురితం. తెలుగు తేజం, ఏ.టి.ఏ, గురజాడ స్మారక పురస్కారాలు పొందారు. వైజాగ్ ఫేమస్ న్యూస్ వారి అర్పిత అవార్డుకు ఎంపికయ్యారు. ఫోను నం: 9441084064.

**సీతమ్మ కొటికలపూడి :** (1874 - 1936) కొల్లిపర మండలం జెముడుపాడు స్వగ్రామం. ప్రముఖ రచయిత్రి. సంఘసంస్కర్త. అబ్బూరి సుబ్బారావుగారి కుమార్తె. కొటికలపూడి రామారావుగారి భార్య. భర్త ఉద్యోగరీత్యా రాజమండ్రిలో చాలాకాలం నివసించారు. ఆకాలంలో కందుకూరి వీరేశలింగం గార్కి శుశ్రూష చేసి, వారినుండి తెలుగు భాషలోని మెళకువలు తెలుసుకొని మంచి కవయిత్రిగా పరిణమించారు. వీరేశలింగం గార్కి స్త్రీవిద్య విషయంలో తోడ్పడ్డారు. సావిత్రి అనే పత్రికను కొంతకాలం నిర్వహించారు. కుమార్తె కానుకొల్లు చంద్రమతి కూడా మంచి రచయిత్రి. 1961లో గృహలక్ష్మి స్వర్ణకంకణం గైకొంది. 1913లో బాపట్లలో జరిగిన మొదటి ఆంధ్ర మహాసభలో మహిళా శాఖకు అధ్యక్షత వహించారు. అందులో పాల్గొన్నవారి ఉపన్యాసాల్ని అన్నింటిని వచన గ్రంథంగా సంపుటీకరించారు. చివరిదశలో పిఠాపురం మహారాణిగారికి విద్యనేర్పే గురువుగా పనిచేశారు. వీరేశలింగం గారి జీవితచరిత్రను రచించారు. "ఒక మహమ్మదీయ వనిత" అనే కరుణరసమైన పద్యాలు, లేడీ జేన్ గ్రే మొదలైన చిన్న కావ్యాలు రచించారు. రచనలు: అహల్యాబాయి చరిత్ర, సాధురక్షక శతకము, గీతాసారము

(పద్యకావ్యము), సతీధర్మములు, ఉపన్యాసమాలిక, ఉన్నత స్త్రీవిద్య, కందుకూరి వీరేశలింగం చరిత్ర.

**సీతమ్మ చోరగుడి :** ప్రభావతీ ప్రద్యుమ్నం కావ్యం వ్రాశారు. తండ్రివెలగపూడి దక్షిణాయన మూర్తి: భర్త చోరగుడి వెంకటాద్రి

**సీతమ్మ పెనుమత్స యోగిని :** జన్మస్థలం కృష్ణాజిల్లా గన్నవరం తాలూకలోని, 'పెనుమత్స' గ్రామం. 'చెరుకూరి బ్రహ్మయ్య, శ్రీరామమ్మ' పుణ్యదంపతులకు 26/8/1921న జన్మించారు. 8వఏటనే వివాహమైంది. కొన్నేళ్ళకు భర్త మరణించగా, సీతమ్మ వైధవ్యాన్ని పొంది, పుట్టింటికి వచ్చింది. వైరాగ్య బావన అలుముకున్నది. పూర్ణయ్యగారన్నే నపూర్ణులు చేసిన బోధనకు, భగవచ్చింతనలో కాలం గడిపేది. ఈ గురువుద్వారా 1942 నుంచీ సీతమ్మ సూర్యోపాసన ప్రారంభించి, పరిపూర్ణత పొందారు. 1949 సం.లో 4 మాసాలు సవికల్ప సమాధిలో ఆసీనులైనారు. సీతమ్మగారి 1951లో తమ కుటీరంలోనే కఠినదీక్షతో తపమాచరించి, శ్రీలక్ష్మీనారాయణుల సాక్షాత్కారంపొందారు. ఈ తల్లి మహిమలనంతంగా ఉన్నాయి. 2/4/1959న వీరు బ్రహ్మైక్యం పొందారు. సీతమ్మగారి యోగ గ్రంథ రచనలు; 'హఠయోగం, రాజయోగం, ఆత్మ రామాయణం' అనే గ్రంథాలు రచించారు.

**సీతాంబ చిలకపాటి :** 1933 లో గృహలక్ష్మి, భారతి వంటి పత్రికలలో వరుసగా పలురచనలు చేశారు. పద్మినీపరిణయము,పద్యరత్నావళి గ్రంథాలు వెలువడ్డాయి. భర్త చిలకపాటి వెంకట నరసింహాచార్యులు.నెల్లూరులో ఉండేవారు

**సీతాంబ చిలకపాటి :** జన్మస్థలం నెల్లూరు జిల్లాలోని కలికివాయి గ్రామం. రాఘవాచార్యులు, మంగమ్మ దంపతులకు అక్టోబరు18,1900 తేదీన జన్మించారు. సంస్కృత పాండిత్యం ఎక్కువైనా ఆంధ్ర కవిత్వమంటే ఆసక్తి ఎక్కువ. సాహిత్యకృషి పద్మినీపరిణయకావ్యము, సముద్రమథనము (విష్ణుమాయావిలాసము)నాటకము, దిలీప నాటకము, అరవింద నవల, శూర్పణఖ (ఏకాంకిక), కష్టజీవి (మరికొన్ని కలిపిన సంకలనం), సీతారామాయణ శతకము(అముద్రితము, అలభ్యము). పద్యాలు: శ్రీ తల్పగిరి రంగనాయక స్తుతి, కృతజ్ఞతాపంచరత్నములు, యశోద పుత్రవాత్సల్యము, రాధాకృష్ణవిలాసము, దసరా. పురస్కారాలు: "కవిరాణి" బిరుదు; గృహలక్షి; స్వర్ణకంకణం (1935) మొదలైనవి.

**సీతాదేవి గోవిందరాజు :** జన్మస్థలం కృష్ణాజిల్లా, మొవ్వ మండలం, "కాజ" గ్రామం.1936లో 'మహాలక్ష్మమ్మ, చలపతిరావు' దంపతులకు జన్మించారు.

ప్రముఖ కథా, నవలా రచయిత్రి. 300కు పైగా చిన్నకథలు, 21 నవలలు వ్రాశారు. రాసిన "తాతయ్య గర్ల్ఫ్రెండ్, ఆశలపల్లకి" నవలలు సినిమాలుగా వచ్చాయి. అనేక అవార్డులు, పురస్కారాలు. ప్రముఖ రచయిత్రి యద్దనపూడి సులోచనారాణికి సొంత చెల్లెలు. రచనలు: సుందరస్వప్నం, ఆలయం, పూలవాన, దేవుడు బ్రతికాడు, తాతయ్య గర్ల్‌ఫ్రెండ్, ఆశలపల్లకి, జీవితం చిన్నది, అనురాగ ధార, రేపటి స్వర్గం, ముత్యాలపల్లకీ, కథల సంపుటులు: పాఠకులారా బహుపరాక్(కథల సంపుటి), దోస్త్ రానిక నీకోసం(కథల సంపుటి), కథలు:అహల్య, ఓ నాన్నకథ, తుంగభద్ర, వెలుగు నీడ, మజిలీ. పురస్కారాలు: అనురాగ ధార టి.వి. సీరియల్ కు నంది అవార్డ్స్మ మద్రాస్ తెలుగు అకాడమీ ఉగాది పురస్కారర్స్మ సుశీల నారాయణరెడ్డి సాహిత్య పురస్కారం. 2014 సెప్టెంబరు 11 న హైదరాబాదులో మరణించారు.

**సీతాదేవి వాసిరెడ్డి :** జన్మస్థలం గుంటూరు జిల్లా చేబ్రోలు. తల్లిదండ్రులు వాసిరెడ్డి రాఘవయ్య మరియు రంగనాయకమ్మ. చిన్నతనంలోనే చెన్నై చేరుకున్నారు. చదివింది ఐదవ తరగతి వరకే అయినా ప్రైవేట్ గా హిందీ ప్రచారక్, ప్రవీణ, సాహిత్య రత్నలో ఉత్తీర్ణులయ్యారు. నాగపూర్ విశ్వవిద్యాలయం నుండి బి.ఎ. మరియు ఎమ్.ఎ. పూర్తిచేశారు. రచించిన మొదటి నవల జీవిత(1950), తొలి కథ సాంబయ్య పెళ్ళి (1952). అప్పటినుండి సుమారు 39 పైగా నవలలు మరియు 100 పైగా కథలు రచించారు. నక్సలిజం గురించి 1982 సంవత్సరంలో రచించిన మరీచిక నవలను రాష్ట్ర ప్రభుత్వం నిషేధించింది. తర్వాత ఆరుద్ర వంటి సాహిత్యకారుల అభిప్రాయాలపై హైకోర్టు కేసు కొట్టివేసి నిషేధాన్ని తొలగించింది. మట్టి మనిషి (2000) నవల 14 భాషలలోకి అనువదించబడింది. నవలల్లో కొన్ని తెలుగు సినిమాలుగా మరికొన్ని దూరదర్శన్ సీరియల్లుగాను నిర్మించబడ్డాయి. సమత నవల ఆధారంగా ప్రజా నాయకుడు, ప్రతీకారం నవలను మనస్సాక్షి సినిమాగా, మానినీ మనసు కథ సినిమాలుగా వచ్చాయి. మృగతృష్ణ నవలను అదే పేరుతో సినిమాగా నిర్మించారు. జవహర్ బాలభవన్ డైరెక్టర్ గా పనిచేశారు. 1985-1991 మధ్యకాలంలో ఫిల్మ్ సెన్సార్ బోర్డు సభ్యురాలిగా సేవలందించారు. రచనలు: మృత్యుంజయుడు (1988) శివసాగర్ మిశ్ర రచించిన "అక్షత్" హిందీ నవలకు తెలుగు అనువాదం. 30కి పైగా నవలలు రచించారు. అవార్డులు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కారం ఐదు సార్లు, ఆత్మగౌరవ పురస్కారం, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం గౌరవ డి.లిట్. (1989), శ్రీ పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయం గౌరవ డి.లిట్. (1989), తెలుగు

విశ్వవిద్యాలయం జీవితకాల సాఫల్య పురస్కారం (1996), 1994లో తెలుగు విశ్వవిద్యాలయం నుండి సాహిత్యలో విశిష్ట పురస్కారం. బిరుదము ఆంధ్ర పెర్ల్ఎస్. బక్.

**సీతాదేవి వింజమూరి :** సీతాదేవి 'ఆంధ్రదేశంలో జానపద సంగీతం' అనే అంశంపై పరిశోధనా వ్యాసం(ఆంగ్లంలో) సమర్పించి, మద్రాస్ విశ్వవిద్యాలయం నుంచి పి.హె.డి. పట్టా పొందారు. ఆకాశవాణి మద్రాస్, హైదరాబాద్ లలో పనిచేశారు. ఆంధ్రదేశమంతా తిరిగి, అమూల్యమైన జానపదపాటలు సేకరించి, పాడి, ప్రచారంచేశారు. రాష్ట్ర ప్రభుత్వంవారు 'సంగీత కళాప్రపూర్ణ' బిరుదు ఇచ్చారు. గృహలక్ష్మి స్వర్ణకంకణం అందుకున్నారు. 'లాలీ తాలీ, పండగలు పబ్బాలు , భక్తి ముక్తి, ప్రేమ విరహం, కర్షక కార్మిక, హాస్యం వినోదం, కదంబమాల' అనే పాటల పుస్తకాలను ప్రచురించారు. క్యాసెట్లు కూడా విడుదల చేశారు.

**సీతాబాయి బొడ్డపాటి :** బహువ్యాస రచయిత్రి. ప్రసిద్ధి చెందిన 'సీతాసుందరి' 'మలయాళం, కన్నడం, తమిళం, మరాఠీ, హిందీ' భాషలు అనర్గళంగా మాట్లాడగలిగారు. స్వయంకృషితో ఇంగ్లీషు చదవటం వ్రాయటం కూడా నేర్చుకొన్నారు. 1920 లో బెజవాడ వచ్చారు. చదివినది కేవలం మూడవ తరగతి వరకే అయినా, సాహిత్యాన్ని శ్రద్ధగా చదవటం వలన భాషాజ్ఞానం, విజ్ఞానం సంపాదించారు. ఆవిడ రచించిన కొన్ని రచనలు 'భారతి' లోను, 'ఆంధ్రపత్రిక'లోను ప్రచురించబడ్డాయి. పూనాలో తమ 53 వ ఏట 20.05.1948 న మరణించారు.

**సీతారత్నం అయ్యగారి డా.** 1.8.1965న శ్రీకాకుళంలో జననం.విశాఖపట్నం వాస్తవ్యులు.అరసం విశాఖ ఉపాధ్యక్షులు. స్త్రీవాద కథలు-స్త్రీల జీవిత చిత్రణ అంశంపై పరిశోధన చేసి పి.హెచ్.డి పొందారు.కూరాకులమడి(కథాసంపుటి), సాధిత(వ్యాససంపుటి) వెలువరించారు. 2 నవలలు పత్రికలలో ప్రచురితం. జాతీయ, అంతర్జాతీయ సదస్సులలో 60 పత్ర సమర్పణలు,100పైగా సాహితీ,రేడియో ప్రసంగాలు.

**సీతారావమ్మ ముదిగొండ :** పద్య కవయిత్రి. మల్లికార్జున శతకం, మారుతీ శతకం, పార్వతీశ్వరా శతకం లాంటి శతకాలు అనేకం రచించారు. మినీ కవితలు విశేషంగా వెలువరించారు. ఆధ్యాత్మిక వ్యాసాలు రచిస్తూ ఉంటారు. విజయవాడలో ఉంటున్నారు. సెల్ : 92993035.

**సీతాసుధాకర్ పండా :** చిత్రకారిణి. కవయిత్రి. చిత్రకారిణిగా దేశవిదేశాలలో 17 సోలో ఎగ్జిబిషన్లు, 30 గ్రూప్ ఎగ్జిబిషన్లు, కవయిత్రిగా 2 కవితా సంకలనాలు (దిరిశెన పూలు,పూస్తున్న పూలలో వీస్తున్న పరిమళం), 1 నానీల సంకలనం (పూనాలో పూచిన నానీలు). చిరునామా: బి 602, బ్లూ హిల్ సొసైటీ, యెరవాడ, పూనె-411006. ఫోను నం: 9765390399.

**సుందరీ కమలారత్నం ఓరుగంటి :** బందరు నోబుల్ కళాశాలలో ప్రథమ పట్టభద్రురాలు. మహిళా చైతన్యంకోసం ఆంగ్లంలో Ladies Litarary Magzine అనే పత్రికను నిర్వహించారు. సరోజినీ నాయుడు తొలి రచనలు ఇందులో ప్రచురించారు.

**సుందరీ నాగమణి నందూరి :** హైదరాబాదులో నివాసం. ఆంధ్రాబ్యాంకు మేనేజరు. 120కథలూ, 3నవలలూ ప్రముఖ పత్రికలలో ప్రచురితం. అమూల్యం, నువ్వు కదలివైతే, పూలమనసులు కథాసంపుటాలు వెలువరించారు. చిరునామాః మేనేజర్, ఆంధ్రాబ్యాంకు, జోనల్ ఆఫీసు, మూడవ అంతస్తు, హర్షా టవర్స్, రాక్ టౌన్ కాలనీ, యల్ బీ నగర్, హైదరాబాద్ - 500068. ఫోను నం. 98499898201.

**సుజనాదేవి నామని :** వరంగల్ వాస్తవ్యులు. భారతీయ జీవిత బీమా సంస్థలో పరిపాలనాధికారి. 3కథా సంపుటాలు, 2కవితా సంపుటాలు వెలువరించారు. ఒక కథా సంపుటికి రాష్ట్రస్థాయి తృతీయ పురస్కారం లభించింది. 175 కథలు,పలు కవితలు ముద్రితం. ఆకాశవాణిలో 70 ప్రసారం. కథా కిరీటి, కవి సుధ, సహస్ర కవి మిత్రతో పాటు అనేక పురస్కారాలు పొందారు. ఫోను నం. 7799305575.

**సుజాత అడువాల. డా. :** తెలుగు ఉపాధ్యాయిని, రచయిత్రి, కవయిత్రి, పరిశోధకురాలు. తెలంగాణా పోరాట నవలల్లో స్త్రీ అనే అంశంపై ఎం.ఫిల్. వ్యాసం సమర్పించారు. డా.పి.శారదా దేవి కథలు-సమగ్ర పరిశీలన అనే సిద్ధాంత వ్యాసానికి పిహెచ్‌డి పట్టా పొందారు. మట్టిమల్లెలు నానీలు, కాలమా కాస్త వినుమా వచన కవితలు, బతుకమ్మ పాటలు, విలోకనం వ్యాసపారిజాతం ప్రచురించారు. పాడరా తెలుగు బిడ్డా! ముద్రణలో ఉంది. పరిశోధక కళిక సంస్కృతి సమ్మాన్, సాహితీ జ్యోత్స్న,సాహిత్య స్త్రీ వంటి బిరుదులు పొందారు.

**సుజాత అరిగ :** అవనిగడ్డలో జన్మించిన అరిగ సుజాత 'డా. గుడిసేవ విష్ణు ప్రసాద్ రచనలు పరిశీలన' అనే సిద్ధాంత వ్యాసం రచించి, నాగార్జున విశ్వవిద్యాలయం నుంచీ డాక్టరేట్ సంపాదించారు.

**సుజాత.ఎ.వి.కె.** గుంటూరుజిల్లా గణపవరం గ్రామంలో జననం. అమృత హృదయం, వ్యాస సుమాలు, బాలల కవితలు, నవ్యాంధ్ర నానీలు వెలువరించారు. వక్తృత్వ పోటీలలో రాష్ట్ర స్థాయిలో బహుమతులు పొందారు. సదస్సులలో ప్రసంగాలు, ఆధ్యాత్మిక ప్రవచనాలు చేశారు. చిరునామా. ఇం.నం. 5-89-12/4, 3వ లైన్, లక్ష్మీ పురం, గుంటూరు. ఫోన్. 9490449521.

**సుజాతాదేవి డి :** జన్మస్థలం పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు సమీపంలోని చింతపల్లి గ్రామం. 1949, ఏప్రిల్ 26న జన్మించారు. బాలసాహిత్య రచయిత్రి. 24 పుస్తకాలు రచించారు. లలిత, జానపద, సంగీత కేసెట్లు వెలువడ్డాయి. కొక్కొరొకో గేయకథ ఆధారంగా రూపొందిన కార్టూన్ చిత్రం బంగారు నందిని పొందింది. చేపలు పుస్తకం మాడభూషి రంగాచారి అవార్డు పొందింది. డెహ్రాడూన్, త్రివేంద్రం నగరాల్లో సెమినార్లలో బాలసాహిత్య ప్రతినిధిగా ప్రసంగాలు చేశారు. బాలసాహిత్యంలో ఆటలో అరటిపండు చిన్న పిల్లల కథా సంకలనానికి 2013 కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం పొందారు. ప్రఖ్యాత కథారచయిత్రి. ఎంఏ తెలుగు లిటరేచర్ చేశారు. 'ఆహ్వానం' తెలుగు సాహిత్య పత్రిక, ఆంధ్రమహిళా సభ పబ్లికేషన్స్ విభాగం, సీపీ బ్రౌన్ అకాడమీల్లో అసిస్టెంట్ ఎడిటర్‌గా పనిచేశారు. నన్నపనేని బాల సాహిత్య పురస్కారం, కోడూరి లీలావతి స్మారక బహుమతి వంటివెన్నో అవార్డులు అందుకున్నారు

**సుధ కొంగర :** జన్మస్థలం ఆంధ్రప్రదేశ్ లోని విశాఖపట్నం. చిత్ర దర్శకరాలు, రచయిత్రి. తమిళ్ సినిమా, తెలుగు సినిమా మరియు బాలీవుడ్ లో రచనలకు ప్రసిద్ధి వచ్చింది. తండ్రిది ఆంధ్రప్రదేశ్, తల్లిది చెన్నై. విశాఖపట్నంలో టింపనీ సెకండరీ స్కూల్లో చదువుకున్నారు. తరువాత మహిళా క్రిస్టియన్ కళాశాల, నగర్ కోయిల్ నుండి హిస్టరీ అండ్ మాస్ కమ్యునికేషన్ అభ్యసించారు. తమిళ, తెలుగు, మరియు బాలీవుడ్ చిత్రాలకు రచనలు చేశారు. 49 వ నేషనల్ ఫిల్మ్ అవార్డు, ఉత్తమ ఇంగ్లీష్ ఫిల్మ్ ఆఫ్ ది ఇయర్ అవార్డును గెలుచుకున్న ఇండియన్ ఇంగ్లీష్ చిత్రం మిత్రా, మై ఫ్రెండ్ కు స్క్రీన్ రచయితగా కెరీర్ ప్రారంభమైంది. తర్వాత మణిరత్నంతో ఏడు సంవత్సరాలు అసోసియేట్ డైరెక్టరుగా పనిచేశారు. 2016 లో, సయల ఖదోసోతో హిందీ సినిమా రంగప్రవేశం చేసారు. గురు చిత్రంతో తెలుగు సినిమా రంగప్రవేశం చేశారు. సుధ బాక్సింగులో ఒక క్రీడా రంగ చిత్రం రాయడం మొదలుపెట్టారు, ఇది 'ఇరుదు సుత్రు' అనే పేరు పెట్టింది.

**సుధారాణి వేలూరి :** కలం పేరు సుధారాణి కౌండిన్య. 100కవితలు, 15కథలు, కొన్ని వ్యాసాలు పత్రికలలో ప్రచురింపబడ్డాయి. నవ్యాంధ్రప్రదేశ్, సమైక్యాంధ్ర

సంపుటాలకు సహసంపాదకులు. చిరునామా: అనితా అపార్ట్ మెంట్స్, ఎస్.ఎఫ్.5, విద్యాధరపురం, విజయవాడ-12. ఫోన్: 9392942485.

**సుధారాణి సగిలి.** డా. 18.5.1974న చిత్తూరు జిల్లా తిరుపతిలో జననం. హైదరాబాద్‌లో నివాసం.తమిళ నాట తెలుగు స్త్రీల జానపద కథనాలు అనే అంశంపై పరిశోధన చేసి పి.హెచ్.డి.పట్టా పొందారు.కొనసాగింపుగా 3 పుస్తకాలు,2 అనువాద నవలలు వెలువరించారు..ఇం.నం.102,అశోక సైలెంట్ వేలీ, అవెన్యూ-4, బంజారాహిల్స్, రోడ్ నం.10, హైదరాబాద్-34. ఫోన్. 9490428825.

**సుబ్బమ్మ బి.వి (బాతినేని) :** జన్మస్థలం ఆంధ్రప్రదేశ్లోని గుంటూరు జిల్లాలోని బోడిపాలెం గ్రామం. జులై 1,1925 న జన్మించారు. క్రైస్తవ ఆశ్రమాలు స్థాపించి ప్రముఖులయ్యారు.1999 లో ఆంధ్ర ఎవాంజెలికల్ లూథరన్ చర్చ్ (AELC) చేత ఏర్పాటు చేయబడిన ప్రారంభ మహిళా పాస్టర్లలో ఒకటైన థియలాజికల్ ట్రైనింగ్ ను సాధించిన భారతదేశంలో మొదటి మహిళలలో ఒకరు. వేదాంత శిక్షణ పొందిన తరువాత, సుబ్బమ్మ కలోనియల్, సాంస్కృతికత, క్రైస్తవ మతం మరియు మహిళా అవకాశాలపై విస్తృతంగా వ్రాశారు. రచనలు: ఓపెన్ డోర్స్; ఆంధ్రప్రదేశ్లో హిందువుల మధ్య చర్చి గ్రోత్ యొక్క కొత్త పద్ధతులు; డాటర్స్ అఫ్ ది చర్చ్; ఉమెన్స్ అండ్ మినిస్ట్రీ ఫ్రం న్యూ టెస్టామెంట్ టైమ్స్ టు ది నేషన్; క్రీస్తు భారతదేశాన్ని ఎదుర్కొంటుంది: భారతదేశంలో క్రైస్తవ మతం యొక్క దేశీయ వ్యక్తీకరణ. క్రిస్టియన్ ఆశ్రమాలు: ఇయర్స్ (1968-1993); విజన్ మరియు సఫలీకృతం. తమిళనాడు, భారతదేశం, క్రిస్టియన్ ఆశ్రమాలు.

**సుబ్బమ్మ మల్లాది :** జన్మస్థలం గుంటూరు జిల్లాలో 'పోతార్లంక'లో 1924 అగస్టు 2 న జన్మించారు. స్వేచ్ఛావాది, వక్త, సంఘ సంస్కర్త, బహు గ్రంథకర్త, మహిళా విప్లవ సేనాని.మల్లాది వెంకట రామ్మూర్తిగారితో వివాహం జరిగింది. 1970లో విజయవాడలో 'వికాసం' పత్రికను స్థాపించి,10 యేళ్ళు నడిపారు. రాసిన 'ఆంధ్ర ప్రదేశ్లో మహిళోద్యమం మహిళా సంఘాలు 1960 1993 అనే పుస్తకానికి పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారు ఉత్తమ గ్రంథం అవార్డ్ ఇచ్చారు. ఇంకా 'పాతివ్రత్యం నుండి పెమినిజం దాకా, లైంగిక విప్లవం, స్త్రీ స్వేచ్ఛ, Womens liberation మొదలైన 15 పుస్తకాలు వ్రాశారు.

**సుబ్బలక్ష్మి నందివాడ :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'తాడంకి' గ్రామం. వీరు నవలా రచయిత్రి, కొన్ని కథలు కూడా వ్రాశారు.

**సుభద్రాదేవి శీలా.** 19.12.1949 న విజయనగరంలో జననం. విశ్రాంత ప్రధానోపాధ్యాయిని. 12కవిత్వ సంపుటాలు, 2 కథా సంపుటాలు, కొత్తగా ఇస్కూలు కథలు సంపుటి వెలువరించారు. నీడల చెట్టు నవలిక చతురలో ముద్రితం. ముగ్గురు విద్యార్థులు వీరి రచనలపై పరిశోధన చేసి పి. హెచ్.డి. పొందారు. ఒక కథ మహారాష్ట్ర లో 7వ తరగతి పాఠ్యాంశంగా ఉన్నది. 5 ప్రతిష్ఠాత్మక పురస్కారాలు పొందారు.

**సుభద్రమ్మ మదిన :** మదిన సుభద్రమ్మ లేదా మదిన సుభద్రయ్యమ్మ (జ: 1781) శ్రీ సర్ మహారాజా గోడే నారాయణ గజపతి రాయుడు గారి మేనత్త మరియు మదిన జగ్గారాయుడుగారి తల్లి. శతకములు రచించిన స్త్రీలలో నీమె యగ్రగణ్యురాలని కందుకూరి వీరేశలింగము పంతులుగారు కవిచరిత్రలో వ్రాశారు. తరిగొండ వెంగమాంబకు సమకాలీనురాలు. శ్రీరామదండకము, రఘునాయక శతకము, కేశవ శతకము, కృష్ణ శతకము, రాఘవరామ శతకము, శ్రీ హరి రమేశ పద్యాలు; శ్రీ రంగేశ్వర పద్యాలు; శ్రీ సింహాచలాధీశ్వర పద్యాలు; శ్రీ రఘునాయక శతకము; శ్రీ వేంకటేశ శతకము; శ్రీ కేశవ శతకము; శ్రీ కృష్ణ శతకము మొదలైన తెలుగు కావ్యాలు రచించారు.

**సుభద్రమ్మ మామిడన్న :** ఆధ్యాత్మ రామాయణం గ్రంథాన్ని ద్విపదలో రచించారు. అయ్యగారి రామమూర్తి పంతులు సోదరి.

**సుభద్రయాంబ సీరము :** శ్రీవేంకటేశ్వర శతకం, శ్రీరామ శతకం, ఉత్తరరామచరిత్ర అనే నిర్వచనకావ్యం రచించారు.

**సుభాషిణి ప్రత్తిపాటి :** జన్మస్థలం గుంటూరుజిల్లా బాపట్ల. ఉపాధ్యాయిని. పలు కవిసమ్మేళనాలలో కవితా గానం చేశారు. విద్యార్థులలోని సృజనను ప్రోత్సహించి వారి రచనలను 3 సంకలనాలుగా ప్రచురింపచేశారు. చిరునామా: విశ్వబ్రాహ్మణ కాలనీ, బాపట్ల-522101. ఫోను నం. 8099305303.

**సులోచన తోట :** 5.8.1954లో జన్మించారు. విశ్రాంత ఉపాధ్యాయిని. శ్రీ సాయిసుమాలు, పసిడిబాల శతకం(గేయ పద్యాలు), జీవన రాగాలు(కవితా సంపుటి), నానీ సులోచనాలు(నానీలు) వెలువరించారు. అనేక పురస్కారాలు పొందారు. ఫోను నం: 9490173053.

**సులోచనారాణి యద్దనపూడి :** జన్మస్థలం కృష్ణాజిల్లా దివితాలూక, మొవ్వ మండలంలోని "కాజ" గ్రామం. 'మహాలక్ష్మమ్మ, చలపతిరావు' దంపతులకు జన్మించారు. మేటి నవలారాణిగా పేరు పొందారు. సులోచనారాణి 17వ ఏట, ఎస్.ఎస్.ఎల్.సి. పాస్ అయిన సంవత్సరం 1957 మే లో మొదటికథ 'చిత్రనళీయం' మద్రాసు నుంచీ వెలువడుతున్న ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికలో పెద్దకథగా రెండు వారాలు ప్రచురితమైంది. అప్పటినుంచీ కథలు రాయటం

ఎక్కువైంది. ఆ తర్వాత పెళ్ళి, హైదరాబాదుకు మకాం మారింది. కానీ రచనల జోరు తగ్గలేదు. 'నాకీ అదృష్టం చాలు, గీతజ్యోతి, ఐ లవ్ యు, బహుమతి' వంటి కథలు 30 కి పైగా రచించారు. అన్నీ పాపులర్ అయాయి. 1964లో 'బాపు, ముళ్ళపూడి, రాఘవయ్యలు' దగ్గర్కొచ్చి, "జ్యోతి" మాసపత్రిక కోసం 'సెక్రటరీ' వ్రాయించారు. నార్ల వారు 'ఆంధ్రజ్యోతి'కి సీరియల్ రాయమని కోరారు. అదే 'జీవనతరంగాలు'. "యువ" మాసపత్రికకు చక్రపాణిగారు అడగగా, "మీనా" నవల ఆశారు. ఈ విజయంతో 'ఆగమనం, ఆరాధన, ఆత్మీయులు......సౌగంధి, సుకుమారి' మొదలైన 70 నవలలు రాయగా, వాటిలో 17 నవలలు సినిమాలుగా వచ్చాయి.'ఆత్మగౌరవం, మనుషులు మమతలు. ఆ తర్వాత టి.వి. సీరియల్స్ శకం 'ఆగమనం, ప్రియసఖి, జీవన సౌరభం, పార్థు"వచ్చాయి. డి.డి.లో ప్రథమ డైలీ సీరియల్ 'ఋతు రాగాలు' ఒక సంచలనం. 'రాధామధు' ఈ తరం ప్రేక్షకుల ఆదరణ పొందింది. నవలల్లో యదార్థ వాదానికి తావులేదు. శోకానికి కరుణకూ కూడా ఆస్కారం లేదు. వైచిత్రి, ఝటితి స్ఫూర్తి, ప్రణయకోపం, ప్రణయతాపం వగైరాలు మాత్రమే కనిపిస్తాయి. 'కీర్తి కిరీటాలు' లో నాట్య మయూరిని చూపి; 'పట్టుదల, పోరాటం, మమత, మానవత్వం' మొదలైన అనుభూతులు గల 'బందీ'ని కళ్ళకు కట్టి చూపారు; విభిన్నధ్రువాలైన గిరిజచందూలకు 'గిరిజాకళ్యాణం' చేశారు. 2018 ఏప్రిల్ 19 న కీర్తిశేషులయ్యారు.

**సువర్చలా సుబ్రహ్మణ్యం సన్నిధానం :** కలంపేరు శుభప్రియ. తెలుగు అధ్యాపకురాలు. విజయవాడ. కవితా సన్నిధానం, భావ సౌవర్చలం(వ్యాసాలు), స్వర్ణ పుష్పాలు(గేయ కవితలు) వెలువడ్డాయి. భారత మహిళాశిరోమణి, ప్రతిభామూర్తి, గ్లోబల్ పీస్ శాంతి అవార్డులు పొందారు. చిరునామా. ఇం.నం. 76-14-228/4ఎ, టీచర్స్ కాలనీ, 4వ లైన్, భవానీపురం, విజయవాడ.12. ఫోను నం. 9849041071.

**సువర్ణాకన్నన్ రావినూతల :** ప్రఖ్యాత (శతాధిక)నవలా రచయిత్రి, లలిత సంగీత గాయని, తెలుగు సినిమా నేపథ్య గాయని "సువర్ణ"గారి తండ్రి "తాళ్ళూరి చంద్ర శేఖరరావు, తల్లి కనక దుర్గమ్మ". మొదటి నవల 'కానుక' వనిత మాస పత్రికలోను; 'క్లిక్..క్లిక్..క్లిక్' ఆంధ్ర జ్యోతిలోను అచ్చయ్యాయి. బహుమతితో పాటు, 'క్వీన్ ఆఫ్ సస్పెన్స్ నావెల్స్' అవార్డు గెలుచుకుంది. స్వాతి వారపత్రికలో లేడీ ఓరియంటెడ్ అడ్వంచరస్ నవలలు వరసగా వ్రాశారు. ఇలా ఎన్నో కథలు, వ్యాసాలూ కూడా వ్రాశారు. రచించిన 'మొగలి పొద' అప్పటి ప్రధాని శ్రీ పి.వి.

నరసింహారావు గారికి అంకితమివ్వడం జరిగింది. 75 సీరియల్స్ పూర్తయిన సందర్భంగా, నాటి ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడు గారికి "ది క్లూ" అనే 52 వారాల మెగా సీరియల్ అంకిత మిచ్చారు. వారప్పుడు "వజ్రోత్సవ నవ్య నవలా నాయకి"అనే బిరుదు ఇచ్చారు. 'స్వర్ణకంకణం' అక్కినేని చేతుల మీదుగా అందుకున్నారు. ఇటీవలే నూరవనవల పూర్తి చేశారు . నవలలు కాంచన సౌధం, కావేరీ గెస్ట్ హౌస్ 20పైగా నవలలు వ్రాశారు. కథాసంపుటాలు మంచుతెర, నిజాలు నీడలు. కథలు అంకితం, ఇంద్రధనుస్సు, పొదరిల్లు, శిక్ష, హృదయస్పందన మొదలైన పుస్తకాలు రచించారు.

**సుశీల కరెడ్ల :** మచిలీపట్నంలో అన్నపూర్ణ వృద్ధాశ్రమ వ్యవస్థాపక అధ్యక్షులు. సమాజ సేవాకర్త. శ్రామిక రంగ నాయకురాలు. శ్రామిక రంగ ప్రతినిధిగా సింగపూర్, బ్యాంకాక్ లలో జరిగిన సదస్సులలో పాల్గొన్నారు. చిరునామా:ఇంటి నెం: 30-426, ముస్తఖన్ పెట మచిలీపట్నం - 521001కృష్ణా జిల్లా.ఫోనునం: 9440330500.

**సుశీల సోమరాజు :** జన్మస్థలం ప.గో.జిల్లా 'సిద్ధాంతం' గ్రామం. 1946 ఏప్రిల్ లో జన్మించారు. కథా రచయిత్రి. ఎం.ఎస్.సి., పి. హెచ్.డి. చేశారు. విజయవాడలో లెక్చరర్‌గా పనిచేశారు. అప్పుడు 'శశాంక' మొదలైన వార్లతో పరిచయం ఏర్పడింది. 1997 లో రచన ప్రారంభించి, 'చిన్న పరిశ్రమలు పెద్దకథలు, ఇల్లేరమ్మ కథలు(ఈ 2 కథా సంకలనాలు); అయిన వాళ్ళం మహాప్రభో, పెద్ద చేప, మాయాబజార్' లాంటి సుమారు 30 కథలు పత్రికలలో ప్రచురింపబడ్డాయి. ఇంకా 'ధర్మ విజయం, పద దర్శిని, రామాయణ బారత కథలు' వచ్చాయి. వీరికి తెలుగు విశ్వవిద్యాలయంవారి 'ధర్మనిధి ' పురస్కారం లభించింది.

**సుహాసిని ఆదుర్తి :** జన్మస్థలం గుంటూరు జిల్లా రేపల్లె. 12.8.1968న లో జన్మించారు. 80కవితలు వ్రాశారు. కొన్ని ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. మన బందరు కవితాసంకలనం వెలువరించారు. 40జాతీయ, రాష్ట్ర విద్యాసెమినార్లలో పాల్గొన్నారు. చిరునామా: ప్రిన్సిపాల్, ఎ.పి.మోడల్ స్కూల్ & గవర్న్ మెంట్ జూనియర్ కాలేజి, మద్దులపర్వ, రెడ్డిగూడెం మండలం, కృష్ణాజిల్లా. ఫోన్ నం. 9491585652.

**సూరమాంబ బుర్రా :** విశాఖ మండలం శ్రీకాకుళం. 19/20 వ శతాబ్దం, సావిత్రీ విజయుము, నందనార, హరినాధ శతకాలు: ప్రహ్లాద నాటకము, శ్రీకృష్ణబోధామృతము రచనలు. తండ్రి సోమంచి భీమశంకరం. భర్త దేవేంద్ర నాథ్.

**సూరమ్మ మల్లిపెద్ది :** గృహలక్ష్మి పత్రిక 1929 ఏప్రియల్ సంచికలో విధాతృస్తుతి అనే రచన చేశారు.

**సూర్యకుమారి పుప్పాల :** జన్మస్థలం తూర్పు గోదావరి జిల్లా, తాళరేవు మండలం లోని సుంకటరేవు గ్రామం. "రాగబంధం - రక్తబంధం" అందాల బృందావనం, ప్రణయ స్నేహం, పొగడరా నీ భూమి భారతిని, మాపల్లె పచ్చదనం నవలలు ముద్రించారు. హృదయవసంతం, హిమధాత్రి కవితా సంపుటులు, 5 భక్తి గీతాల సంపుటులు, 2 భక్తి గీతాల సి.డీ లు వెలువరించారు. అక్షర పుష్పం, స్వాతి చినుకులు కథా సంపుటులు ముద్రించారు. అనేక సాహితీ ప్రతిభా పురస్కారాలు పొందారు.

**సూర్యకుమారి వారణాసి :** జన్మస్థలం ద్రాక్షారామం. నివాసం మచిలీపట్నం. పద్య రచయిత్రి రామకథాసుధ, సూనృత మంజరి, తెలుగుభాష-సంస్కృతి, ఆదర్శరామా, కవితారామం, కృష్ణాపుష్కర మాహాత్మ్యం, వేణునాదం(ద్విపద), ఇంతిహాసం, సూర్యకిరణాలు, శ్రీ ఆంజనేయం అనే పద్య రచనలను; స్వామి చిన్మయానంద హరికథ, సప్తపది నవల,మానినీ మానసం కథలు పుస్తకాలను వెలువరించారు. సాహితీమిత్రులు కార్యదర్శిగా, కస్తూరిబాయి మహిళామండలి ప్రెసిడెంట్ గా ఉన్నారు. ప్రభుత్వ ఉగాది పురస్కారం, ఆంధ్రసారస్వతసమితి జీవనసాఫల్య పురస్కారం వంటి అనేక సత్కారాలను పొందారు. చిరునామా: ఇం.నం.21-562/3, పరాసుపేట, మచిలీపట్నం-521002.

**సూర్యలక్ష్మి భోగరాజు :** 24.11.1964 న జన్మించారు. స్వస్థలం విజయనగరం. సీనియర్ స్పెషల్ అసిస్టెంట్, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా. కవయిత్రి. అనేక కవి సమ్మేళనాలలో పాల్గొని కవి సత్కారం పొందారు. చిరునామా: 64, శర్వాణి నగర్, రింగ్ రోడ్, విజయనగరం-535002. ఫోను నం: 9440117116.

**సౌరిస్, ప్రమోద :** సౌరిస్ తెలుగు రచయిత్రి. గుడిపాటి వెంకట చలం కుమార్తె. సౌరిస్ కథల్ని పుస్తకంగా భీమునిపట్నంలోని స్నేహ ప్రచురణల వారు ఆగస్టు 1997లో ప్రచురించారు. ఈ పుస్తకంలో వున్నవి 8 కథలు. ఉష అనే కథ 1936 లోనూ, సుమిత్ర అనే కథ 1937 లోనూ, స్మృతి కథ 1946-47 లోనూ రాసినట్లు పేర్కొన్నారు. ప్రస్తుతం సౌరిస్ పేరిట ఒక ఆశ్రమం విశాఖపట్నంలోని భీమిలి ప్రాంతంలో నెలకొని ఉంది. సౌరిస్ చలం కూతురిగానే కాకుండా, యోగినిగా, రమణ మహర్షి శిష్యురాలిగా కూడా సుపరిచితురాలు. సౌరిస్ని చలం ముద్దుగా షౌ అని పిలిచేవారు. పిల్లి పిల్లలన్నా, కుక్క పిల్లాలన్నా ఎంతో

ఇష్టం. వాటిని తన స్నేహితులుగా భావించేవారు. అదే అంశాన్ని తీసుకొని 'మా మిత్రులు' అని ఒక పుస్తకం కూడా వ్రాశారు. స్త్రీలు' వ్యాసం వ్రాశారు.

**స్నిగ్ధ మాధవి తుమ్మల.** (27.10.1983.). 300కవితలు,150కథలు రాయగా 6వ్యాసాలు,కొన్ని కవితలు ప్రచురితం.

**స్వరాజ్య పద్మజ కుందుర్తి:** చిరునామా: శ్రీనగర్ కాలనీ, రెండవ లైన్, అద్దంకి - 523201 ప్రకాశం జిల్లా. ఫోను నం: 9505047477.

**స్వరూపరాణి కొలకలూరి :** ప్రముఖ తెలుగు రచయిత్రి. తండ్రి నడికుర్తి వెంకటరత్నం గారు కవి మరియు పండితులు. గోవాడ గ్రామంలో జన్మించారు. విద్యాభ్యాసంలో భాగంగా సంస్కృత పంచకావ్యాలు, కాళిదాసత్రయం, భారవి, మాఘం తదితర కావ్యాలు, ప్రబంధాలు చదివారు. తొలి రచన స్వాతంత్ర్యం మళ్లీ వచ్చింది కృష్ణా పత్రికలో ప్రచురించబడింది. ఉపాధ్యాయం అనే కవిత సాహితీపరుల మెప్పుపొందింది. గంగావతరణ శివతాండవం ద్విపద కవితా ప్రక్రియలో సంగీతభావ ప్రధానంగా సాగిన రచన. నన్నయ మహిళ అనేది భారతం గురించిన సమీక్షా గ్రంథం ఉత్తమ రచనల్లో ఒకటి. విద్యాధర ప్రభాస అనే సాహిత్యసంస్థను నెలకొల్పి దానిద్వారా తన రచనలను ప్రచురించారు. 1986లో ఆనాటి ముఖ్యమంత్రి యన్.టి.రామారావు సన్మానించాడు. కవయిత్రీతిలక అనే బిరుదును పరల్డ్ ఎవాంజిలిన్ సంస్థ ప్రదానం చేసింది. రచనలు గంగావతరణ శివతాండవం, చంద్రగ్రహణం, ప్రబోధం, కల్యాణవాణి, నన్నయమహిళ.

**స్వరూపరాణి చల్లపల్లి :** జన్మస్థలం గుంటూరు జిల్లా, ప్యాపర్రు గ్రామం. 1970, మే 25లో మంత్రయ్య, మరియమ్మ దంపతులకు జన్మించారు. తొలి దళిత స్త్రీవాద రచయిత్రిగా ప్రసిద్ధి చెందారు. కథలు, కవితలు వ్రాశారు. వ్రాసిన కొన్ని రచనలు ఇంగ్లీషు, హిందీ భాషలలోకి తర్జుమా అయ్యాయి. 1992లో నాగార్జున విశ్వవిద్యాలయం నుండి ప్రాచీన భారత చరిత్ర & పురావస్తు శాస్త్రంలో ఎం.ఎ. పట్టా పొందింది. 1996లో హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం నుండి చరిత్రలో ఎం.ఫిల్, 2007లో పి.హెచ్డి పట్టాలను పొందారు. 1999 నుండి పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యా లయంలో చరిత్ర విభాగంలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా చేసి పిమ్మట 2008లో నాగార్జున విశ్వవిద్యాలయంలోని మహాయాన బౌద్ధ అధ్యయనాల కేంద్రంలో 2011లో ప్రొఫెసర్గా పదోన్నతిని పొందారు. 81కి పైగా వివిధ సెమినార్లలో, వర్కుషాపుల్లో పాల్గొని పత్రసమర్పణ గావించారు. వివిధ పత్రికలలో బుద్ధిజం గురించి, జాషువా సాహిత్యం గురించి, దళిత రచయిత్రుల గురించి, గిరిజన సంస్కృతి గురించి ఇంకా వివిధ విషయాలపై 56కు పైగా వ్యాసాలను రచించారు. ఇంకా "చారిత్రక పరిశోధన" అనే అర్ధవార్షిక

పత్రికకు, "బహుజన కెరటాలు" అనే మాసపత్రికకు సంపాదకురాలిగా ఉన్నారు. "మన చరిత్ర సంస్కృతి" మాసపత్రికకు, "సమాంతర వాయిస్" పత్రికకు సంపాదక వర్గ సభ్యురాలిగా వ్యవహరిస్తున్నది. పలు సామాజిక, విద్యాసంబంధ సంస్థలలో సభ్యురాలిగా క్రియాశీలకంగా ఉన్నారు. రచనలు: అస్తిత్వ గానం, మంకెన పువ్వు, Caste, Religion and State in Medieval South India, Facets of Gender Discrimination and Violence, Tribe Peasant Elite Dynamics in Medieval Andhra. 2002లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుండి నాళం కృష్ణారావు ధర్మనిధి పురస్కారం, 2014లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే మహాకవి గుర్రం జాషువా సాహిత్య పురస్కారం. 2015లో యునైటెడ్ ఫోరం ఫర్ ఎస్.సి, ఎస్.టి ఎంప్లాయీస్, వరంగల్లు వారిచే గుర్రం జాషువా పురస్కార్ లాంటి 8 అవార్డులు అందుకున్నారు.

**స్వరూపరాణి బి.జె. :** జన్మస్థలం 'విజయవాడ'. 1952లో జన్మించారు. కథా రచయిత్రి 'చదువుకుందాం' అనే నాటికనూ; 'మానవత్వం, సహజీవనం' అనే కథలను రచించారు. జాషువా సాహిత్యసమితివారి 'బెస్ట్ టీచర్' అవార్డు అందుకున్నారు.

**స్రవంతి ఐతరాజు :** మానసిక శాస్త్ర నిపుణురాలు. గాయని, కవయిత్రి. వీణలో డిప్లమో పొందారు. సాంఘిక సంక్షేమ శాఖలో ఉన్నతాధికారిణిగా పనిచేస్తున్నారు. బాలల అకాడమీ అవార్డు గ్రహీత అనేక ప్రతిభా పురస్కారాలు, గుర్తింపులు పొందారు. కథా సంపుటి, కవితా సంపుటి, నవల ప్రచురితాలు. శ్రీ చందన స్వరాలు స్వయంగా పాడి ఆడియో చేశారు. గానకోకిల, నాట్యమయూరి బిరుదులు పొందారు. సెల్ : 9618503480.

**హజర అట్లూరి :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'గుడివాడ'. 1941 ఏప్రిల్ 10లో జన్మించారు. రచయిత్రి, కథకురాలు, లక్ష్మిలాండ్స్ అధినేత్రి, చలన చిత్ర నిర్మాత అట్లూరి పూర్ణచంద్రరావు భార్య. 'రేవతి' వీరి నవల. మద్రాసు నుండి వెలువడిన 'నీలిమ మాస పత్రిక'లో వీరి కథలు ప్రచురితమైనవి.

**హనుమాయమ్మ వెన్నెలకంటి :** ఆధ్యాత్మ రామాయణము లోని శ్రీరామ లక్ష్మణ సంవాదము తెలుగు చేశారు. అనేక ఆధ్యాత్మిక రచనలు చేశారు.

**హిమబిందు గుజ్జర్లమూడి. డా. :** దూరదర్శన్ ముఖాముఖి, రేడియో ప్రసంగాలు అనేకం చేశారు. మూడు దోసిళ్ళ కథలు, ఆరు దోసిళ్ళ కవితలు ప్రచురించారు. అంతర్జాతీయ పరిసోధనా పత్రికలలో పన్నెండు వ్యాసాలు ప్రచురితం. ఎనిమిది దేశాల్లో అంతర్జాతీయ సదస్సులలో పాల్గొన్నారు. 5 వ ఏటనే లెనిన్ పై ప్రసంగానికి రజత పతకం పొందారు. సహాయ ఆచార్యులు, రింస్ మెడికల్ కాలేజీ, ఒంగోలు -523001.

**హేమలత కోనేరు :** హిందీ అధ్యాపకురాలు. కొమ్మా శివశంకరరెడ్డి గారి స్మారక హిందీ పురస్కారం ఆం.ప్ర. హిందీ అకాడమీ వారి పురస్కారం పొందారు. చలం బ్రాహ్మణీకం హిందీలోనికి అనువదించారు. రాహుల్ సాంకృత్యాయన్ "యాత్రోంకేతమ్మే' గ్రంథాన్ని తెలుగులోనికి అనువదించారు. చిరునామా : 104-3, వాటర్‌ట్యాంక్ రోడ్, నిడమానూరు, విజయవాడ. సెల్ : 8500546386.

**హేమలత ఎం :** హిందీ ఉపన్యాసకులు. తెలుగు, హిందీ భాషలలో విశేష కృషి చేస్తున్నారు. చిరునామా : 4-48, రైల్వేస్టేషన్ దగ్గర, ధోన్ - 518222. సెల్ : 9441656600

**హేమలత పుట్ల :** శ్రీమతి మనోరంజితం, శ్రీ మనష్షే గార్ల  సంతానం. నెల్లూరు, బెంగుళూరులో ప్రాథమిక విద్యను కొనసాగించారు. బి. ఎ. చదువు తర్వాత ట్రైనింగ్ పూర్తి చేసారు. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుంచి "వెబ్ లో తెలుగు సాహిత్యం తీరు - తెన్నులు' అనే అంశం పై పిహెచ్.డి" చేసారు. ప్రముఖ కవి ఎండ్లూరి సుధాకర్ తో వివాహం అయ్యింది. వీరి అమ్మాయి మానస యువ కథా రచయిత్రి. 1982లో "గూడు చేరిన గువ్వ" అనే నవల 'స్పందన' ఆధ్యాత్మిక మాసపత్రికలో ధారావాహికగా ప్రచురితమైంది. "స్త్రీవాద, దళిత సాహిత్య ఉద్యమాలు దళిత స్త్రీల భావాలను చెప్పుకోవడానికి వేదికను కల్పించి గ్రామ స్థాయి అట్టడుగున దళిత స్త్రీల వరకు వెళ్ళాల్సి ఉందని "అభిప్రాయపడ్డారు. విహంగ మహిళా సాహిత్య పత్రికకు సంపాదకురాలు. అంతర్జాలంలో ప్రారంభించబడిన తొలి తెలుగు మహిళా పత్రిక, మరియు ISSN నెంబర్ పొందిన తొలి అంతర్జాల పత్రిక కూడా విహంగ. ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక (ప్రరవే) కి జాతీయ అధ్యక్షురాలిగా వున్నారు. వేకువరాగం అనే కవితా సంపుటి కూడా వ్రాశారు.

**హేమలతా లవణం :** జన్మస్థలం గుంటూరు జిల్లా 'వినుకొండ'. 1932లో జన్మించారు. చారిత్రక గ్రంథ రచయిత్రి, త్యాగశీలి, విశ్వమానవి. తండ్రి 'గుర్రం జాషువా', తల్లి 'మోరాయమ్మ'. శ్రీమతి లవణం శ్రీ గోరా కుమారుడు, విజయవాడ నివాసి అయిన 'లవణం' భర్త. మద్రాసు కళాశాలలో బి.ఏ. చదివారు. తన తండ్రిని గురించి 'మా నాన్నగారు' అనే చారిత్రక గ్రంథం రచించారు. ఈ పుస్తకం 30 సార్లు పునర్ముద్రణకు నోచుకుంది. 2008 మార్చి 19 న మరణించారు.

**హైమవతి, ఆర్.ఎస్.:** జన్మస్థలం నరసాపురం తాలూకా భీమవరం గ్రామం. ఆగష్టు 15 1942 న దీదువాను కామేశ్వరమ్మ మరియు దీదువాను నరసింహారావు దంపతులకు జన్మించారు. ఆంధ్రా మెట్రిక్లేషన్ ప్రైవేట్ గా చదివి పాసై ఎలాగో ఇంట్లో అందర్నీ ఒప్పించి నరసాపురం కాలేజీలో పి .యు .సిలో చేరడం జరిగింది. కలంపట్టింది 1981లో. మొదటి కథ అప్పటి మహిళా మాసపత్రిక వనితలో

(జూలై 1981) ఫొటోతో కూడిన పరిచయంతో ప్రచురింప బడింది. వివిధ పత్రికలలో వచ్చిన కథలు, రేడియోలో ప్రసారమైన కథలు వందకి చేరుకుంటే. పదిహేడు నాటికలు ఆలిండియా రేడియోలో ప్రసారమయ్యాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు పెట్టిన రకరకాల పోటీలలో ఒక నాటికకీ, ఒక జన్గిల్కీ బహుమతులు లభించాయి (2006లో). వివిధ పత్రికలలో వెలుగు చూసిన కవితలు ముప్ఫైకి చేరుకోగా బాలజ్యోతి లాంటి పిల్లల పత్రికల్లో కథలు ఓపది దాటితే నాలుగైదు గేయాలు, ఓ నవల ప్రచురితమయ్యాయి. ఇక వ్యాసాలు వివిధ పత్రికలలో మొత్తం అరవై చేరుకున్నాయి. ఇక నవలలు మూడు వెలుగు చూశాయి. మూడూ కూడా ఆంధ్ర భూమి డైలీలో పోటీల్లో సాధారణ ప్రచురణకి ఎన్నికైనవే. ఇంచుమించు ప్రచురితమైన అన్నికథలు వివిధ పోటీల్లో ఎన్నికైనవే. మొత్తమ్మీద నవలలు 3, ఒక మినీ నవల, కథలు 100, వ్యాసాలు 60, కవితలు 30, నాటికలు 18 వెలుగు చూశాయి. పిల్లల గేయాలు రచించారు. బహుమతులు 15 దాకా అందుకున్నారు.

**హైమవతీ సత్య జగదాంబ కోడూరు :** జన్మస్థలం కృష్ణాజిల్లా 'మచిలీపట్నం', 'కనకదుర్గాంబ రామారావు' దంపతులకు 1938 అక్టోబర్ 16న జన్మించారు. భక్తికావ్య రచయిత్రి. రచనలు: కాశీవిశ్వేశ్వర నామావళి; మనవాడు మేధావి పింగళి వెంకయ్య; దైవస్తుతి, సన్మతి. పురస్కారాలు: ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డిచే అవార్డు; మల్లాది సుబ్బమ్మ గారిచే స్త్రీశక్తి అవార్డు పొందారు.

**హైమావతి పెబ్బిలి :** 16-2-1953న జన్మించారు. విశాఖపట్నంలో ఉంటున్నారు. 80వరకూ కథలు ప్రచురితం అయ్యాయి. 25 నవలలు వ్రాశారు. బహుమతులు పొందిన రచయిత్రి. ఉత్తరాంధ్రకథల సంపుటిలో వీరి కథ అచ్చయ్యింది. బలివాడ కాంతారావు స్మారకపురస్కారం పొందారు. 9వ తరగతి నుండే రచనా వ్యాసంగం ప్రారంభించిన సీనియర్ రచయిత్రి.

**హైమావతి మందరపు :** విజయవాడ. కవయిత్రి. సూర్యుడు తప్పిపోయాడు, నిషిద్ధాక్షరి కవితా సంపుటాలు; వానచినుకులు వ్యాస సంపుటి వెలువరించారు. కొన్ని కవితలు ఆంగ్లం, హిందీ, తమిళం, కన్నడం, మలయాళాల్లోకి అనువదింపబడి ప్రచురితమయ్యాయి. నిషిద్ధాక్షరి కవితాసంపుటి హిందీ, కన్నడాల్లోకి అనువదింపబడింది. యోగివేమన యూనివర్శిటీ ఎం.ఏ సిలబస్ లో చేర్చబడింది. వాయిదా, కవిగారి భార్య, ద్విపాత్రాభినయం కవితలు కూడా కుప్పం, ఉస్మానియా యూనివర్శిటీల సిలబస్‌లో ఉన్నాయి. కృష్ణశాస్త్రి అవార్డు, ఉమ్మిడిశెట్టి సాహితీ అవార్డు, సినారె అవార్డు, ఫ్రీవర్స్ ఫ్రంట్ అవార్డు, శ్రీశ్రీ పురస్కారాలు అందుకున్నారు.



138

ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల మహాసభలకు విచ్చేయుచున్న
ప్రతినిధులకు నిర్వాహకులకు అభినందనలు



# నవ్యసాహితీసమితి

(రిజిస్టర్డ్)
విజయవాడ (1966)

## ఉచితశిక్షణా కేంద్రం

23-23-50 చల్లపల్లివారి వీధి, సత్యనారాయణపురం,
విజయవాడ - 520011. 0866-2531766



విజయవాడ సత్యనారాయణపురం మారుతీ వ్యాయామశాల సమీపాన గాయత్రీ వైద్యశాల భవనం నందు కేవలం మహిళలకు కంప్యూటరు, కుట్టుమిషనులలో 2007 సంవత్సరం అక్టోబరు నెల నుండి ఉచితంగా శిక్షణ ఇవ్వబడుతూ వుంది.

ఇప్పటికి సుమారు 2550 మంది ఇక్కడ శిక్షణ పొంది ఇప్పుడు స్వయంకృషితో ఆర్జనపరులవుతున్నారు. అంతేగాక ప్రతి సంవత్సరం కొందరు రచయిత్రులు కూడా ఇక్కడ తెలుగు లిపిలో కంప్యూటరు నేర్చుకున్నారు. ఆదివారం పండుగరోజు సెలవులలో మినహా ప్రతిరోజూ ఉదయం ఉదయం 10-30 నుండి మధ్యాహ్నం 12-30 వరకు ఈ శిక్షణా కార్యక్రమం నిర్వహింపబడుతుంది.

కావున మహిళలు, బాలికలు రచయిత్రులు ఈ అవకాశము వినియోగించుకో వలసినదిగా ప్రార్థిస్తున్నాము. ఇదేగాక ఆదివారము పండుగరోజులు మినహా ప్రతిరోజు సాయంత్రం 5-30 గంటల నుండి 7-30 గంటల వరకు వైద్యాచార్య వేదాంత రామకృష్ణమాచార్యులుగారి పర్యవేక్షణలో ఉచిత వైద్యపరీక్షలు చేసి ఉచితంగా మందులు ఇవ్వబడును. వివరాలకు సమితి కార్యాలయంలో తెలుసుకొనగలరు. లేదా 98491 04811కు ఫోను చేసి కూడా తెలుసు కొనవచ్చును.

భవదీయులు

**కాలనాధభట్ట వీరభద్రశాస్త్రి, అధ్యక్షులు**



# ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల మహాసభలకు స్వాగతం...

## శ్రీమతి తమిరిశ జానకి
హైదరాబాదు

## శ్రీ ముక్తేవి రామకృష్ణ
మచిలీపట్నం

## శ్రీ వి. శిరీష్‌కుమార్
నున్న, విజయవాడ

